# మూడవ ముద్రణము

● త్వరపడుడు ●

ఆంధ్రమహాజనులు చాల నాళ్లుగా ఎదురు చూచు చుండిన ఈ ముద్రణము కాపీలు అయిపోవుచు న్నవి. కాగితంకరవులో గూడ చక్కని కాగిత ములపై ముచ్చటగా ముద్రింపబడినది. వెనుకటి ముద్రణ ములకంటె ఇది అన్నివిధాల అంద మై యున్నది. అక్కరగల వారు త్వరపడ వలెను.

● ఆలసింపకుడు ●



వెల రెండు రూపాయలు

# శ్రీమద్భగవద్గీత

## శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు

ప్రకాశకులు,

ఆంధ్ర గ్రంథమాల -- తపాలా. పెట్టె 212 -- మద్రాసు.



పండిత

డి.గోపాలాచార్యులవారి



# అయాన

## గర్భాశయరోగనివారిణి

★ఆయుర్వేదాశ్రమము (స్థాపితము 1898) మదరాసు





## గర్భినాల్ (రిజిష్టర్డు)

గర్భాశయసంబంధమైన సమస్తవ్యాధులకు అమోఘమైనచికిత్స

ఒకసారి వాడిచూచిన దానిగుణము తెలియగలదు.

కెమిస్టు లందరివద్ద దొరకును.

కాట్ని (సి. పి.) నుండి ఒక స్త్రీ వ్రాయుచున్నది:—మీమందు నాకు బాగా పనిచేసినది. పిపులోను, పొత్తికడుపులోను భరింపరాని బాధయుండెడిది. ఇంగ్లీషుమందులు యెన్ని తీసికున్నను ప్రయోజనం లేకపోయెను. నా స్నేహితురాలొకరు మీమందును గురించి చెప్పగా నేను వాడితిని. ఇపుడు బాగా స్వస్థత చేకూరినది. నేను దానిని కొంటిమంగి నా స్నేహితురాండ్రకు కూడ శిఫారసు చేయుచున్నాను. (సం)............

విజయ ఫార్మసీ, — త్రిచూరు.



## రాజకర

ధాతుపుష్టికి—బలానికి

ఎక్కువ చదువు, ఆలోచనవల్ల కలుగు తలదిమ్ము రాకుండ చేయును.

కుర్రతనపుచేష్టలవలనకలుగు జబ్బు లన్నిటిని పోగొట్టును.

మలబార్ ... ర్వేదిక్ స్టోర్సు

10...



పక్షవాతమునకు ... యిన

## క్షీరబల (రిజిష్టర్డు) ఆయుర్వేదము

వాడిచూడుడు. తృప్తి నొందుదురు.

ఆయుర్వేదాచార్య ఎన్. మాధవమీనన్,

ఎ. ఎం. ఎ. సి, కన్సల్టింగు ఫిజిషియన్.

మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు

107 బ్రాడ్వే, మదరాసు

# ప్రమద



స్త్రీల పాలిటి వర ప్రసాదిని. ప్రదరము, కుసుమరోగము (స్త్రీలు చీరెలువిడుచు వ్యాధులు) ఋతుశూల, దుర్బలత్వము, మేహఉడుకు, శిగరోగము, బహిష్టు చక్కగా కాకపోవుట, వంధ్యాదోషము మొదలగువానిని హరించి సంతానవతులనుగా చేయుటలో శ్రేష్ఠమయినది. 8 ఔన్సుల సీసా రు. 1-12-0. 4 ఔ॥ సీసా రు. 1-0-0. పోస్టేజి ప్రత్యేకం. రు. 0-11-0. అగును. అన్ని ఔషధముల కూ క్యాట్లాగు ఉచితము.

## పి. శి. ఏ. అండు కంపెనీ,

ఆయుర్వేదసమాజం,
పెరిదేపి, నెల్లూరుజిల్లా.



## అత్యద్భుత కుష్ఠురోగనివారిణి

కుష్ఠు, బొల్లి, సుఖరోగములకు గ్యారంటీ చికిత్స గుణములేనిచో పైకము వాపసు ఇచ్చుటేగాక

బహుమానం రూ. 500/-

| | |
|---|---|
| మావద్ద చికిత్సపొందు యేవ్యాధికైనను రక్త పరీక్ష గ్యారంటీ ఇవ్వబడును. | మద్రాసు, బొంబయి, పోర్చుగీసు గవర్నమెంటు డాక్టర్లచే శ్లాఘింపబడినది. |

## రెడ్డి అండ్ కో., (రిజిష్టర్డు.)

(బంగారుపతకాంకితులు)

హెడ్ ఆఫీస్:—
గోపాలపురము తూ॥ గో॥ వయా తణుకు.

స్థాపితము:—1920

స్థాపకులు:—డా॥ యం. సుబ్బారెడ్డి.

కుష్ఠువులకు చికిత్సలేదను ప్రతీతిని రద్దుపరచి, స్వంతహాస్పిటలు నిర్మించి నిర్భయముగా, కుష్ఠు, బొల్లి, సుఖరోగముల నిర్మూలించుచున్న సంస్థ— ఇండియాకంతటికి, మాసంస్థ ఒక్కటియే!





నాకు ఇప్పుడెంతో సౌఖ్యముగానున్నది!
ఒక్క మోతాదు సిసుసాన్ తోనెంతసుఖమిచ్చినది!
రాత్రియెంతమంచి నిద్రపట్టినది!

## సిసుసాన్

కడుపునొప్పి మలబద్ధకమునకు మందు.
శిశువులకు బలదాయకము.

ఆంధ్ర ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్
బెజవాడ, వారి దివ్యౌషధము.

# కలగూరగంప

## పండ్రెండవ శతాబ్దంనాటి శివలింగము

కొద్దిరోజులక్రిందట నిడదవోలులో కోటదిబ్బ అనే ప్రదేశమందలి దక్షిణభాగం పాటిమట్టి నిమిత్తం త్రవ్వుతుండగా ఆరడుగులలోతులో ఒక రాతికట్టడమందు భూస్థాపితమైన ఒక శివలింగం హఠాత్తుగా బయటపడింది. సదరు లింగంయొక్క చుట్టుకొలత ౩౨ అంగుళాలు; ఎత్తు ౧౫ అంగుళాలు; పానవట్టము బిగించే క్రిందిభాగము ౧౭ అంగుళాలు. ఈ లింగముతోబాటే ఏకశిలలో చెక్కబడిన మరికొన్ని విగ్రహాలుకూడ దొరకినవి. ఆశిలలో బ్రహ్మ, శివుడు, కుమారస్వామి, విష్ణువు, యముడు, ఇంద్రుడున్ను వరుసగా తమతమ వాహనాలైన హంస, నంది, నెమిలి, గరుడుడు, దున్నపోతు, ఏనుగులతోసహా చెక్కబడివున్నారు. ఏకాండమైన ఆశిలపొడవు ౪౯ అంగుళాలు. ఈవిగ్రహాలు దొరకడానికి కొద్దిరోజులక్రిందటనే ఆప్రాంతంలోనే ౫౨ అం. పొడుగు, ౨౧ అం. వెడల్పుగల ఒక రాతితాబేలుకూడ దొరికింది.

ఈ శివలింగముయొక్క, తతిమావిగ్రహాలయొక్క పూర్వచరిత్ర ఆకళించడానికి నిడదవోలు పూర్వచరిత్ర కొంత సహాయపడుతున్నది.

నిడదవోలుగ్రామం ౧౧-వ శతాబ్దంనుంచి శైవారాధ్యపరులైన చాళుక్య, కాకతీయాదిప్రభువులచేత పరిపాలింపబడుతూవుండి ౧౪-వ శతాబ్దంలో మహమ్మదీయుల హస్తగతమై పోయింది. వారిచేతులలో అక్కడి హిందూదేవాలయాలున్ను, కోటలున్ను ధ్వంసధూళి చేయబడినవి. ఆవిధంగా భిన్నాభిన్నమైపోయిన బాపతు లింగములు, నందులు, విఘ్నేశ్వరులు, శక్తులు మొదలైన విగ్రహాలు ఈప్రాంతంలో అక్కడక్కడ తరచు కనబడుతూ వచ్చినవి. వాటిలో ప్రాచీనశిల్పచాతుర్య ముట్టిపడుతూ కనబడేది. పెద్ద పెద్ద శివాలయాలకు ముందు కట్టిన కల్యాణమండపాలలో శివకేశవభేదం పాటించకుండా చెక్కిన విగ్రహాలతోను, బంధనాలతోను నిండిన శిలాస్తంభాలు నేటికిన్ని ఈప్రాంతంలో అక్కడక్కడ పొడసూపినవి. అలా దొరికిన శిలాస్తంభాలన్నీ ఇప్పుడు నిడదవోలులోని శ్రీ గోలింగేశ్వరస్వామి ఆలయప్రాకారంలో విడిగావున్నవి.

ఈ గ్రామంలోనే దొరికిన ఒక శిలాశాసనాన్నిబట్టి ఇక్కడి ప్రభువులున్ను, ప్రజలున్నకూడా శైవారాధ్యపరులై యుండినట్లు తెలుస్తున్నది. చాళుక్య చక్రవర్తుల యిష్టదైవము కుమారస్వామి. దరిమిలాను ౧౨, ౧౩ శతాబ్దాలలో ఇక్కడ చక్రవర్తులుగా పరిపాలించిన ఇందుశేఖరుడు,వీరి కుమారులు శైవమతావలంబకులే. వీరి కాలమందే (శా. శ. ౧౧౯౯-౧౩౨౮) సమర్పింపబడిన శిలాశాసనాల మూలంగానూ, ఇక్కడి మహాదేవేశ్వరాలయానికి భక్తులిచ్చిన దానాలూ కానుకల వల్లనూకూడా ఈపురపు ప్రభువులు శైవులయి యుండినట్లు నిరూపితమవుతున్నది.

ఇప్పుడు దొరికిన లింగము ఆ ౧౨, ౧౩ శతాబ్దాల నాటిదని ఊహింపబడుతున్నది. దీనికి త్వరలోనే గుడిగోపురాలు కట్టించే ప్రయత్నంలో ఉన్నారు.



# విమర్శనము

## 'రామచంద్ర' విద్యార్థికోశము

గ్రంథకర్తలు: విద్వాన్ టి. ఆర్ముగంపిళ్లై, పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగార్లు. ప్రతులు లభించుచోటు: ఆర్. వేంకటేశ్వర అండు కో., లాన్ స్క్వేరు, మద్రాసు. వెల రూ. ౨-౮-౦.

శబ్దరత్నాకరము, శబ్దార్థచంద్రిక, ఆంధ్ర వాచస్పత్యము, అరకొరగా తయారైయున్న సూర్యరాయాంధ్ర నిఘంటువు ఇవి తప్ప తెలుగులో మరి నిఘంటువులే లేవు. అవి కేవలము పండితమాత్రోపయోగములుగానేయున్నవి. విద్యార్థులకు నిత్య-వాడుకకు అక్కరకువచ్చు పాకెట్ డిక్షనరీలు తెలుగులో శూన్యము. ఇంగ్లీషు మొదలైన భాషలలో అవి కొల్లలకు కొల్లలు. చిరుతవయస్సులోని విద్యార్థులు శబ్దరత్నాకరాదుల నుపయోగించుకోలేరు. అసలు వానిని ఇంటికిని బడికిని మోయగల తాహతే ఉండదు వారికి. అటువంటి విద్యార్థుల ఉపయోగము నిమిత్తము ఇదంప్రథమముగా ఈ పాకెట్ డిక్షనరీని సంకలనము చేసి, విద్యార్థులకు సహాయముచేసిన ఈ గ్రంథకర్తలను మనస్ఫూర్తిగా అభినందించుచున్నాము. ఇంగ్లీషు పాకెట్ డిక్షనరీల వరవడిలో, ముచ్చటగా, విద్యార్థుల కవసరమైనంత సమగ్రముగా, నిర్దుష్టముగా ఇది సంకలితమై యున్నది. పదములకు నానార్థములు, వ్యుత్పత్త్యర్థములు, ప్రకృతులు, వికృతులు మొదలైన అనేక ముఖ్యవిషయములు దీనిలో చక్కగా పొందుపరుపబడియున్నవి. విద్యార్థులు ముఖ్యముగా తెలుసుకోవలసినవి ఈ వ్యుత్పత్త్యర్థములు, ప్రకృతులు, వికృతులు మొదలైనవే. ఈ సౌకర్యము వారికి శబ్దరత్నాకరములోకూడ దొరకదు. గ్రంథవిస్తృతికి కారణమైన ప్రమాణముల ప్రమేయమునకు వీరు పోలేదు. అర్థవిజ్ఞానమునకు మాత్రమే ఆధిక్యమిచ్చి, విద్యార్థుల సుఖబోధకు ఆస్పదమేర్పరచినారు. విద్యార్థుల పాలిటికి ఇది వామనాకారములోని శబ్దకల్పద్రుమమనుట కభ్యంతరములేదు. తెలుగువిద్యార్థుల కిది వీడరాని తోడుగా పరిణమించు ననుట కాక్షేపణలేదు. గ్రంథముయొక్క కూర్పుతీర్పులుకూడ ముద్దుగా,


అగ్ని, మోటారుకారు

భీమాకు



యునైటెడ్ ఇండియా

ఫైర్ అండ్ జనరల్

ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగు,

ఎస్ప్లనేడ్, మద్రాసు.

టెలిఫోన్ : 4241.

Grams : "UNIGEN"

పోస్టుబాక్సు : 1207.

మెచ్చుటగా ఉన్నవి. గ్రంథకర్తల కృషి అమూలాగ్రముగా దీనిలో ప్రతిబింబించుచున్నది. విద్యార్థిలోకము దీనిని తప్పక ఆదరించి తీరును.

---

## ప్రతిమాసుందరి

రచయిత : అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు. ప్రచురణ కర్తలు : వెరైటీ ఏజన్సీస్, గవర్నరుపేట, బెజవాడ.

నవ్యనాటక కర్తలలో ప్రథమశ్రేణికి చెందిన విఖ్యాణి హెరాల్డ్ బ్రిగ్‌హౌస్ రూపకసరణి ననుసరించి, ఆయనభావముల నాకళించుకొని స్వేచ్ఛగా రచించిన ఒక రూపక మిది. అనుకరణపు తోడు సొంతపోకడలుకూడ కలవు. రచన సాఫీగా ఉండి, జిజ్ఞాసకు దోహద మివ్వజాలియున్నది. సంభాషణలుకూడ చక్కని రీతిని సంతరించుకొన్నవి.

---

## విధురవీణ

రచయిత : నల్లానిచక్రవర్తుల వెంకటాచార్యులుగారు. ప్రకాశకులు: ఆంధ్ర వాఙ్మయసేవాసమితి, పాల్వంచ. వెల ౮ అణాలు.

రకరకములయిన వేదనలను మ్రోగించుచున్న అనేక ఖండకవితల సంపుటి యీ విధురవీణ. ఆవేదనలను తెలివిడి చేయగలిగిన అనుభూతి ఈ కవిలో గాఢముగా ఉన్నట్లే యున్నది. రచనలో ఇంకను సాధన అవసరము. కవిహృదయ మున్నది కావున సాధన కష్టములోపని కాదు. భవిష్యత్తులో చక్కని రచనల వ్రాసించవచ్చును.

---

# గ్రంథ స్వీకారము

## నారాయణరావు

నవల. రచయిత : అడివి బాపిరాజుగారు, కళాపీఠము, గుంటూరు. ఫూల్సుకేపు ¼ సైజులో ౩౦౦ పుటలు. వెల తెలియదు.


రాజా స్నో




మొటిమలను పోనిచ్చి అందమునిచ్చును

వెల రు. 1-0-0


## వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్ర సంగ్రహము

గ్రంథకర్త : వేదము వేంకటరాయశాస్త్రిగారు, యం. ఏ. ప్రకాశకులు : వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, ౮, మల్లికేశ్వరస్వామి గుడిసందు, లింగిసెట్టివీథి, మదరాసు. క్రౌనుసైజులో ౨౦౮ పుటలు. వెల తెలియదు.

---

## అభ్యుదయరచన

రచయిత : నాగభైరవ శివరామకృష్ణయ్యగారు, కవితావనం, బెజవాడ. క్రౌనుసైజులో ౫౧ పుటలు. వెల అర్థరూపాయి.

---

## జాముకోడి

కావ్యకర్త : బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు, తలమర్ల, అనంతపురము జిల్లా,

# సాభిప్రాయ విశేషాలు

## భాషాయజ్ఞం :

ఒకజాతివిజ్ఞానమంతా ఆజాతిభాషలో ఇమిడి వుంటుంది. అందులోని సామెతలు ఆజాతిసంస్కృతిని సంపుటీకరించిన రసగుళికలు. జాతిజీవితమంతా వాటిలో మనం చూడవచ్చు. మన ప్రాచీనసంస్కృతిని నిలబెట్టుకోవలెనంటే ఈ సామెతలను భద్రంగా పదిలపరచుకోవడమే దానికి ముఖ్యకీలకం.

తెలుగులో సామెతలు దిక్కుమాలినన్ని వున్నవి. వాటినన్నీ ఇంతవరకూ ఎవరూ ఏకత్రసమావేశంచేసిన పుణ్యాన పోలేదు. లేదంటే, ఇప్పటికి ఒక్కమూడువేల సామెతలుగలగ్రంథం తెలుగులో ఒకటి కనిపిస్తున్నది. అంతే, మరిలేనేలేదు. తెలుగులోవున్న సామెతలన్నీ ఇంతేనా? ఇలాంటి వేలు ఎన్ని వున్నాయో!

తెలుగులోని సామెతలనన్నిటినీ ఒక్కటీ విడువకుండా గ్రంథస్థంచేసే యజ్ఞానికి చిలుకూరి నారాయణరావుగారు దీక్షవహించివున్నారు. వారి ప్రయత్నం ప్రశంసాపాత్రమైవున్నది. వారికి గల ఓపికా, పట్టుదలా మరెవరికీ లేవు. కాబట్టి వారు ఈ యజ్ఞంలో సునాయాసంగానే అవభృథస్నానంచేస్తారని మాకు గట్టినమ్మకమున్నది. ఇప్పటికప్పుడే వారు యాభైవేల సామెతలు సంకలనం చేసినారట. మా నమ్మకానికి ఇంతకంటే వేరే ఋజువేమి కావాలి?

అయితే—

ఖరారుగా లక్షసామెతలు చేర్చవలెనని వారు సంఖ్యానియమం పెట్టడంలో మాకొక భీతి తట్టుతున్నది. ఈపట్టుదలతో అనవసరములు, కల్తీలు అయిన సామెతలనుకూడా గ్రంథంలో స్థానం ప్రాప్తిస్తేనూ ప్రాప్తించవచ్చు. ఇందువల్ల గ్రంథబాహుళ్యమే కాని ఎక్కువ ప్రయోజనముండదేమో అని మా ఉద్దేశ్యము. అందువల్ల సంఖ్యానియమాన్ని ఖరారుగా పెట్టుకోక, అసలయిన సిసలైన సామెతలనన్నిటినీ క్రమపంథాలో సేకరించి, ప్రకరణాలుగా విభజించి నిర్దుష్టమయిన వివరణములతో జోడిస్తే ఈగ్రంథం చాలా ఉపయోగంగా ఉంటుందని మా అభిప్రాయం.

* * *

## కవిరాజహంసలకు సన్మానము

కవిరాజహంసలన్న బిరుదనామంతో సుప్రసిద్ధులైన శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు అరువదియవపడి దాటిన వృద్ధమూర్తులు. వారినెరుగనివారు ఆంధ్రదేశంలో లేరు. ఆంధ్రప్రచారిణీగ్రంథమండలిద్వారా వారిపేరు ఆంధ్రదేశమంతటా మారుమ్రోగింది. వారి నవలలు చదవని ఆంధ్రుడు లేడు. నవలావాఙ్మయంలో ప్రజలకు అమితమైన అభిరుచిని కల్పించి, ఆ వాఙ్మయానికి వ్యాప్తి సంపాదించిపెట్టిన ప్రథమగౌరవం వారిదే అంటేకూడా అతిశయోక్తి కాదు. ఆంధ్రప్రచారిణికి వారూ, వారికి ఆంధ్రప్రచారిణీ అన్యోన్యాశ్రయంగా అండయై వుండి, వంగాంగ్లచ్ఛాయల ననుకరించిన నవలావాఙ్మయంతో దేశాన్ని ఒక పుష్కరం పాటుకాబోలు ఉఱ్ఱూతలూగించారు. ఆనవలలకోసం ప్రజలు విరుచుకుపడేవారు.

ఆ దొక యుగం. వారొక యుగపురుషులు.

వేంకట పార్వతీశ్వరకవులు నవలావాఙ్మయస్రష్టలే కాదు. సరసకవితాసంపన్నులుకూడా. నవరాశిల్పంలో వలెనే కవితాశిల్పంలోకూడా. కొత్తకొత్త పోకడలు పోగలిగిన ప్రజ్ఞావంతులు. భావంలో, భాష

లో, బంధంలో స్వతంత్రత చూపగలిగిన చతురులు. వారి కావ్యాలు రసవాహినులు, భావబంధురములు.

నవలా వాఙ్మయంతో పామరజనాన్నీ, కవితా వాఙ్మయంతో పండితజనాన్నీ ఏకటాకీగా రంజింపజేసిన వీరి సవ్యసాచిత్వం ఆంధ్రులందరిచేతా తలలొగ్గింపజేసింది.

ఉభయమార్గ ప్రవర్తకాచార్యులైన వీరి షష్టిపూర్తి సందర్భాన్ని పురస్కరించుకొని గత మాసంలో వీరిని అఖండంగా సన్మానించిన రాజమహేంద్రవర పౌరులను మేము హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము. రాజమహేంద్రవరమే కాదు, అఖిలాంధ్రదేశమూ ఆనాడక్కడ ప్రత్యక్షమై వారిని సన్మానించి గౌరవించింది. పెద్ద పెద్దలంతా సమావేశమై వారి గుణగణాలనూ, పాండితీవిశేషాలనూ ప్రశంసించినారు.

కవిరాజహంసలకు జరిగిన ఈ కవిపూజ సలక్షణంగా, జయప్రదంగా, వైభవోపేతంగా జరిగింది. కానుకలు, చదివింపులు వర్షప్రాయంగా కురిసినవి. ఇందుకు మేము చాలా ఆనందిస్తున్నాము. కవిపూజ చేసి, వారిని సత్కరించి, సంతోషింపజేసిన జాతే జాతి! ఈ అఖండసన్మానాన్ని అందుకొన్న కవిరాజహంసలకు మా అభినందనలు.

వేంకట పార్వతీశ్వరకవులు శ్రీ రామాయణం వ్రాస్తున్నారన్న ఒక విశేషం ఈ ఉత్సవంలో బయటపడింది. త్వరలోనే అది పూర్తి అయి, వెలువడుతుందని ఆశిస్తున్నాము.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.




# లిప్టన్స్

## జాకూజా ★ వైట్ లేబిల్

## టీగరల్ రకములు

TK-52-TG

లిప్టన్స్ టీని సేవించే ఆనందంలో అజాగ్రత్త సంభాషణలలో మునుగవద్దు.

# భారతీయ సంప్రదాయము

భారతదేశము, కళ, అతిథి సత్కారము—యీ ద్వివిధ సంప్రదాయములకును ప్రసిద్ధిగన్నది. ఇవి రెండును జీవితానందముతో అతి సామీప్యమైన సన్నిహితత్వము కలిగి వున్నవి. సున్నితమైన యీ చోళ శిల్పకళను చూస్తూ వుంటే—మీ ఆప్తమిత్రులను "టీ" తో సత్కరిస్తూ వున్నప్పుడు కలిగే ఆనందము మీకు కలుగుతుంది. ఏ సమయమున వచ్చినప్పటికీ రుచికరమైన పానీయమును యిచ్చిన అతిధి సత్కారము మరొక్కటి వున్నదా? మీ సంప్రదాయమును విడువకుండా అనుసరించుతూ ప్రతివారూ స్వగృహమున ఉన్నట్లు భావించులాగున ఇండియా టీ పానీయమును అందించడముతో సత్కరించండి.

★

"నిత్యానుష్ఠానము"—గృహములో "టీ" త్రాగుటకు యెటువంటి సమయము అనుకూలమైనవో తెలియజేయుటకు మేము కొత్తగా వెలువరించిన ముచ్చటైన సచిత్ర పుస్తకముయొక్క శీర్షికయిది. ఈ ప్రకటన కత్తిరించి మీ పేరు, పూర్తివిలాసము (పెద్ద అక్షరములలో)తో సహా కమిషనర్ ఫార్ ఇండియా, ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డ్, పోస్టు బాక్సు నెంబర్ 2172, కలకత్తా విలాసానికి పంపితే, ఆయన మీకు ఆ పుస్తకాన్ని ఉచితముగా పంపగలడు.







## ఒకేయొక కుటుంబ పానీయము

# ఇండియాటీ



IK 204

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిచే ప్రకటింపబడినది

Regd. No. M. 1856. 7th January

## తెలుగు చిత్రకళామతల్లికి సంక్రాంతి కానుక!

అహోబిల నారసింహుడు ఒక చెంచువడుచుతో
జరిపిన మహోజ్వల ప్రణయగాథ

విడుదల
జనవరి
**14**



తారాగణం:
నాగయ్య,
నారాయణ రావు,
కమలా కోట్నీస్,
బుషేన్యేంద్ర మణి,
లంక సత్యం,
గరుడ్.

ఛాయాగ్రహణం:
జితేన్ బెనర్జి

శబ్దము:
దిన్షా టెహ్రానీ

స్టూడియో:
న్యూటోన్

కథ, పాటలు, మాటలు:
సముద్రాల రాఘవాచార్య

తమిళనాడు టాకీస్ వారి

# చెంచులక్ష్మి

దర్శకుడు _ ఎస్. సౌందరరాజన్

Produced by
**TAMILNADU TALKIES,**
Mount Road :: MADRAS

Distributors for Andhra
**CHAMRIA TALKIE DISTRIBUTORS,**
BEZWADA.



సంధ్యార్చన

= చిత్రకారుడు—శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి =



సంపుటము 21
సంచిక 4

# భారతి

తారణ, చైత్రము
1944 ఏప్రిలు

# శిలాహృదయము



= శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ =

"స్వామీ! సామయజుశ్శిఖాజ్వలిత తేజస్స్ఫూర్తిమన్మూర్తీ! భా
మామాధ్వీరసపూర్ణచిత్తజలజా! స్మేరాననాంశుప్రభా
భామోద్దీపిత సర్వలోక! త్రిజగద్వంద్యా! రఘూత్తంసమా!
రామా! రమ్ము! దయాపయోదనవలీలామోహనాకారమై!

ప్రతి తొలి కోడికూత పెను అంపపుకోతయి ఊఱువడ్డ నా
బ్రతుకున పంచప్రాణములు పట్టి వధించుచు విస్మృతాంశసం
స్మృతి నిడి, గాడిపీడి భ్రమియించెడి నాదగు జీవయాత్రకున్
ప్రతిదినగండమై చనిన పద్ధతి తాళగలేనురా! ప్రభూ!

అల తొలి కోడికూత వినినంతట సంతమసమ్ము తూర్పుచా
యల పొలివోవలేదు, హృదయమ్మున నిండుగ గ్రమ్మె; స్నానసం
ధ్యలకయి యప్పుడే గడపదాటిన నాథుడు దాటినట్టులే
మలగిన సవ్వడుల్ హృదయమర్మరమున్ ద్విగుణీకరించెబో!

తెలతెలవాఱువేళ కనుద్రిప్పి, యొకించుక మోముద్రిప్పి, నా
తలపును ద్రిప్పి యెన్నడును దాను చరించని నూత్నమాన్మథో
జ్జ్వలరసనిష్ఠతో వెలుగు బాటలలో నడయాడి నన్నునున్
నిలిపెను నేత్రకోణముల నిండిన రక్తిమ శోభలీనగన్.

చీకటి మూకలన్ దునిమి చిమ్మిన నెత్తురుకండలెల్ల చీ
కాకయి నాల్గుదిక్కులను గ్రమ్మినయట్లుగ బాలసూర్యశో
భాకలితారుణాంశువులు పర్వుటతో నిలువెల్ల నెఱ్ఱనై
సోకిన పుష్పసాయకరుచుల్ ప్రసరించెను శ్వేతకాంతులన్.

వెలవెలబాఱి మోముకనువిచ్చినయంతట నాథుమోము వి
చ్చలవిడి వెల్గి తృప్తిగనజాలమి తొందఱపాటు తొట్రుపా
టుల బడి యంతలో సమయడోల చలించుట త్రుళ్లిపడ్డటుల్
వెలవెలబాఱి నన్ను కనువిచ్చిన చూపుల చూడబోయినన్.

సూదులవోలె వాడిగల చూపులు, తూపులు, ద్రాచునాల్కలై
ఆదిదొడంగి నే సలిపినట్టి మహాఘము లొక్కపెట్టుగా
నూదిన తీక్ష్ణవహ్నిశిఖలో యన నాదెస సాగినంత వెం
పేది, తపించిపోయి, తనువెల్ల వడంకి, చెమర్చి, నిల్చితిన్.

ఒక్కడు పట్టువడ్డ కడు నొంజలిచే దలవ్రాల్చి నిల్చె, వే
ఱొక్కడు జ్ఞాతదుష్కృతమహోగ్రభయంకర సాట్టహాస స
మ్యక్కనదగ్నిగోళముల నక్షుల నిల్పె మఱింతలోన నా
కక్కట! ఇంద్రియాభిముఖమై చనిపోయిన వన్ని జ్ఞానముల్.

నాపతిగుండె బండయయి నన్నును బండగు మన్న మాట నా
లోపల గంటువెట్టి కదలున్ కలచున్ మఱి రాచు కారమున్;
ఏ పలు కాడలేను, కదలింపను చేతులు కాళ్లు, నూరకే
లోపలి తాపకుండములలో బడి కొట్టుక చత్తు నంతియే!

రాముని స్పర్శ యిచ్చు సకలమ్మని వింటిని క్రోధచాలనా
త్తామితశీఘ్రవేగమున నామడదూరము పోయి యెందుకో
యీమెయి మేనుద్రిప్పి మదధీశుడు పల్కిన సన్నవాక్కులో
రామ! ప్రచండవేగమున రావుగదా! నను దన్నునైనన్."

* * * *

అది యేమో పొరపాటుగా దనువు లన్యాక్రాంతమైనంత నే
యెద లుద్దీపితసర్వజీవములునై యేకాగ్రతన్ పొంగినన్
కదలన్లేని యహో మయస్థితియు రాగా జూచి రామాంఘ్రిసం
పదకై తెన్నులుచూచు గౌతముని బామన్ జూతు నాభారతిన్.



# ప్రకృతి - కవిత

= శ్రీ కపిస్థలం శ్రీరంగాచారి =

ఆది తలపు తొలివేకువ.

చూపుల కందక, వూహకు రాక, పురాప్రపంచం ప్రకృతిచండికకు బలిపీఠంగా నెత్తురోడుతూ ఘూర్ణిల్లితే, దద్దరిల్లుతూ, పాపం మానవుడు, మలచిన బొమ్మై, నిలువే నీరై వుంటాడు. ఆ భీషణలాస్యపు తామసిలో తెప్పిరిల్లుకుని, రెక్కలకొండల అడుగున తడబడి, నలిగి, పిండిపిండలి, దుమ్ముదుమారం అయిపోక, పిల్లికళ్ళతో, పాముచెవులతో మసలేవేళ, మనిషిమనసులో- ఆ కుందేటిగుండెలో—విత్తున చెట్టయి దాగిందేమో కవిత!

కాలక్రమేణ, ప్రకృతిముఖంలో ప్రసన్నభావం పుచ్చలుపూచింది; వెన్నెల విరిసింది. వేకటికాకల చీకటి లోకం వూపిరిసలుపక మూలుగుతుంటే, ఎదలో దాగిన మూగకవిత్వం తల్లి చల్లనిపాలకోసం, పచ్చపచ్చని చూపు కోసం కెవ్వుకెవ్వునా కేకలువేస్తే—అప్పటిదాకా అర్థం కాక, జీవన్మృతిలో గుటకలుమ్రింగిన వుషోహాసమూ, సుమవికాసమూ లొలకరిసిగ్గున జలదరించినై. ప్రకృతీ, కవితా పురివిచ్చి, చూపూచూపూ కలుపుకుని, నాట్యంచేసిన ఆ సుముహూర్తం కాలభిత్తిపై పొలిన చిత్రం.

ప్రకృతి ప్రతిభావంలోనూ, ఆమె ప్రతి హావంలోనూ అనాటి మానవుడు దేవతామూర్తుల్ని, సృష్టించి, అర్చించి, అర్పించుకుని, తాను కవియై లోకానికి- అందాకా- అజ్ఞాతం, అననుభూతం అయిన వొక ఆనందాన్ని ప్రసాదించాడు. మన వేదాల్లో యీ త్రయీచ్ఛాయలే ప్రతిబింబించాయి, అప్పటి కవులకి విపినాలూ, తరువాటికలే జీవిక సాగిన గృహాంగణాలు. శర్వరి పర్యంకంలో తలవాల్చి, చంద్రతారకానిబిరీసం, ఆ వినీల విశాల విహాయసం చూస్తూవుంటే కవులకి కన్నులు కప్పిన మైకాలే, హృదిలో లేచిన భావాలే మస్తిష్కంలో మర్మాలై, వుపనిషత్తులై వెలిగాయి ...

ఆ యుగానికీ, పురాణాలకీ యెంత అంతరం, యెంతటి వ్యవధి! అది వొక మహా అఖాతం, అగాధార్ణవం. వీటిని కలిపే వంతెన అంటూ లేకేపోయింది. వేదయుగంలో కవితా ప్రకృతుల సాంగత్యం అతిసన్నిహితం. అన లా దృష్టే వేరు; అది వ్యోమసీమలకి ఎగబ్రాకింది- శంపాలతలై, నభోంతరాళా లల్లిబిల్లిగా అల్లుకుపోయింది. పురాణకాలపు చూపు లంటిమా, చుట్టూచూస్తూ, ముందువెనకలకి పరుగెత్తినై. అప్పటి కవిత కథాకథనమే అవటంచేత ప్రకృతి దర్శనం ఆనుషంగికం. అయోమార్గమే ఆధారంగా, చకచక గబగబ గమించగలిగిన ధూమశకటమే ఆ కవిత్వం. శకటం లోపలి కిటికీగుండా వూసుపోకకి బయలుచూచే ప్రవాసికళ్ళకి చెట్టు పుట్టలూ, కొండకోనలూ, వాగువరదలూ సర్రున తోచీ, గిర్రున తిరిగి, అదృశ్యమౌతాయి.

ప్రబంధకవితకి ప్రకృతే భూమిక; ఒక్కొక్కప్పుడు వాతావరణం. అప్పటి క... అంతో యింతో చిత్ర

కారులు ; అంటే వారికి వర్ణం వాక్కు, తూలిక లేఖిని, వా రుపాసించినవి సౌందర్యం, మాధుర్యం, చమత్కృతీ. సాయంసంధ్యా సమయంలో, హిమశైలోన్నతశృంగం నించీ పెద్దన గీచిన చిత్రం చూడండి—"శ్రేణుల్ గట్టి పథోంతరాళమున దారేఁ బక్షు లుష్ణాంశుపా షాణవ్రాతము కోష్ణమయ్యె; మృగతృష్ణావార్ధు లింకెఁ; జపాశోణం బయ్యెఁ బతంగబింబము; దిశాస్తోమంబు శోభాదరిద్రాణం బయ్యెఁ; సరోజషండములు నిద్రాణంబు లయ్యెఁ గదుఁ" ఇది అచ్చపు చిత్రం; కాని, శ్రీనాథునిది వూహాచిత్రం.-"వ్రాలెఁ బశ్చిమశైలశృంగముపయిఁ బ్రత్య గ్రమధ్వాగమోన్మీలత్కింశుకకోరకస్తబకకాంతిఁ భాను మన్మండలం; బాలంబించె మరుంపు హస్తమున దాఁబాము లీలావతీభ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముఁ బుంద్రేక్షుకో దండముఁ"

బాటసారుల రాజమార్గం ప్రబంధాల్లో కవిత్వం. నీడలకోసం నాటిన వృక్షాలు; అవి ఆస్కారంగా వ్రాలిన విహగాలు; కొండకోనలు; వుభయసంధ్యలు; వుపవనవాపీ కూపాలు; తారకలూ చంద్రికలు; కదలీ సదులు; ఋతు చక్రం—యిలాంటి వన్నీ తప్పనిసరిగా, శాస్త్రోక్తంగా కని పిస్తుంటాయి — మనసారా, వోపికలో యిష్టం వుంటే చూడచ్చు. అంతేగాని, నిసర్గశోభలు అరుదు; గతానుగతికత అధికం. అస లాలోకం పరాధీనమూ, శాసితమూ. అప్పటి కవులకి — కొందరుమినహా — ప్రకృతిశోభతో వున్న పరిచితి యింద్రియసాంగత్యం కాదు—పుస్తకసాంగత్యం. కవిత వారికి చూచివ్రాత. మరి, ప్రకృతీ?—అది అద్దపు గదిలో రంగులరాటం, బొమ్మలకొలువు... ....

విప్లవఝంఝూ విచలితమై, మన సాహితిలో, పురా ప్రపంచం—పురాణలోకం — కూలిపోయినా, 'మరోప్రపంచం'—మౌలికలోకం — 'ముందుకు పిలిచింది; ప్రకృతీ, కవితా చుట్టరికాల్లో క్రొత్తలు పలికాయి. ఇప్పటి కవిత ప్రకృతికి ముకురం కాదు —బ్రతుకే ప్రకృతికి నూతన ముకురం; అంటే, కవిహృదయంలో బ్రతుకు, అతని మెదటిలో బ్రతుకు. ఒక్క ఘట్టమే, వొక్క దృశ్యమే ప రి ప రి వి ధా ల, క్రొ త్త క్రొ త్త గా వింతవింతగా కనిపిస్తుం దీ నాడు. ఉదయం చూడండి—"కుంకుమపంకముఁ బులుముకొన్నవి తూరుపు కొండ నెత్తముల్ ; పంకజ బాంధవుం డరుణపాదముల న్నిగిడించె ; మింట నేణాంకుడు చిన్నవోయి చరమాచల సాను తటంబు లెక్కె, మైజింకయు ...ను గడ్డిగరచెఁ బెనుచీకటు లార్చెఁ గాకురై" "ఉదయకాంతుల పసిడితీగొకటి మెరసినది ; మృదుపుష్ప గర్భమున రేకొకటి విరిసినది — హృదయనాళకవోష్ణ రక్తప్రవాహాలు పొంగెత్తి, యణువణువు పులకించిపోయినవి;" "ఘోరతిమిరాకాశకుడ్యములు కూలెరా, వీరప్రభాదేవి వెలికిరాజాలెరా" సాయంసంధ్యా ప్రభ లివిగో—"గగన నదిలోని మేఘనౌకలకు నెవతె గొనబు బంగారు తెరచాపలను బిగించె ?" "రాలిపడియున్న దానిమ్మపూలరేకు లొలయుచోటుల సాంధ్యవాయువులలోన కనబడని భావముల్ల సువాసనలకొఱకు వినయమున బాల్య దృష్టి నిల్పితి నొకింత—ప్రణయవతి, ప్రేమమునకు పారమ్యుమ్మలేదు ;" "ఆలాపింపు కొక్కమా రుభయసంధ్యా శోణదృక్కోణరాగాలంకారములైన గీతల, సహస్రార్చిర్విపంచీశ్రుతివ్యాలోలాచ్ఛ సువర్ణతంత్రుల రకల్ వర్షించి, మేఘోదయోద్వేల స్నేహతుషారముల్ ప్రసవవృత్తీస్వేద తారళ్యముల్"

ఇప్పటి కవులకి యెక్కువ వున్నది యింద్రియ మర్యాద. కళ్లు మూసుకుని 'నేతినేతి' 'మిథ్యాజగతీ' అనటం యెరుగరు. అంధుడు లేదన్నా డని, షండుడు కాదన్నాడని, చెలువం, వరువం యేమనుకుంటాయి?—అంతే, మేమూ అంటా రీకవులు. కని విని, చేకొని, మూర్కొని, చవులెరిగి ప్రకృతిని తమలో లయించుకుంటారు—అనుభవరసికులు అధునాకవులు. ఈ యనుభూతే నవకవి కవితాస్రవంతిలో అమృతవాహిని లహరీలాస్యం చేసింది — "ఏవిరియు మల్లియల పూవుబొదలందు, విడిపోవు నెలయేళ్ల మృదు రావములయం దేమావుల సుశీతలపు తావుల జనించితివో ? ఏ వనచరాంగనలు దేవిరడ పాలంద్రావు నిను లేమొగలి పూవువలె లాగికొనిపోవుదురొ పాడువడు త్రోవలను సౌందర్యావృతవతీ! నరుల వావులను రాలిపడు పూవులను భావములు పోవని విధాలఁ" ఇదీ సౌందర్యం. అందుకనే. "పెరిగినా తరిగినా ప్రియమేనె పూవ; చచ్చినా బ్రతికినా స్వర్గమే పూవ" అంటారు వీరు. అస లీకవులది రసైక జీవిక. వీరికి ప్రకృతి రసస్వరూపిణి. కేళీలాలసమానసులైతే, ప్రకృతే వీరికి క్రీడారంగం. "సాంధ్యకిమ్మీరపర్ణవస్త్రములు దాల్చి, గిరితట విహారశృంగారకేళిసొలసి, రమణచరియి" స్తారు 'జలధరార్చకు'లు. తొలకరివలపులు పొటమరించితే, "పాడుట కొప్పవేని. పదవల్లడిపించెదు నేటిత్రోవలే చూడగవద్దు" అంటారు. ప్రేయసి ప్రేమపు దారిచూపితే, ప్రేమయే కృష్ణుడై వెలసెనే పూవ, ప్రకృతియే, రాధయై, వలచెనే పూవ, ఆనందమే గానమాయెనే పూవ" అని పాడు

కుంటారు. యువకవి హృదయం-సంక్షోభిస్తే, అగ్ని మహీధ్రోద్విగ్నార్భటం—లావాగ్నె సర్ వెళ్ళగ్రక్కుతూ సర్వం కష మైపోతుంది. ఆ తెల్ల వేడిలో పొంగిన పాటలు 'వలయవిచలద్విహంగాలో', విలయసాగరతరంగాలో', యుద్ధగుంజన్మృదంగాలో', అవుతాయి,

నేటికవిత్వం కని విని యెరుగని మౌలిక దృష్టుల విశిష్టసృష్టి. పలుకుపలుకునా. తలపుతలపులో తరితీపీ, క్రొందళుకూ. కవితా, ప్రకృతీ యీనాడు పూవూతావీ, కన్నూచూపూ. మాటా భావం, మేనూ ప్రాణం—లాంటి వొక సాంగత్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యంతో కలసి వెలిగినై. నడకనడకలో పరుగుపరుగునా రేకా లెన్నో తోస్తూవుంటాయి. తొలిసంజగాలులు పైకొనేవేళ, "ఈతొలికోడి కంఠమున నేయినబింబము నిద్రవోయెనో రాతిరి" అనుకుంటారు. "ఆగడపు మబ్బుశయ్యల నపరశిఖరి బుడుతచంద్రుడు నిద్దురవోవుచుండె - ఈ చెఱువునీట నతని కుయ్యేలలు గట్టి, జోలవాడుచు నావంకఁ జూడ వేమి?" అని ప్రకృతి నడుగుతారు. "తైలసంస్కార శూన్యమై, దర్భ లగుచు, బిఱ్ఱబిగిసిన ఒక నిరుపేదరాలి చికురములవోలె. సంపదఁ జిదుముకొనిన నగ్నశాఖలనవయు" మోడును చూచి, "తొలిరజస్వలవగు నాఁటి తలిరుటాకు చందమామ గుక్కిళ్ళ పసందు విందు లుట్టిపడ వేల నేడు?" అని జాలిపడి అడిగారు. ఆకే కదలని మధ్యాహ్నంలో, మాతృప్రేమను మననంచేస్తూ, "ప్రోవునై రాలె హృదయసరోజదళములు . నైజరుచిరమ్ములగు స్రవంతీజలమ్ము లారిపోయిన రాతిబయళ్ళవోలె, రిక్తయయిపోఁ దలంపుల మెత్తఁదనము గిల్లుకొనిపోయె. యేడ డాగికొనె దిపుడు?" అని బైలుచూస్తారు. మబ్బుల చాటున వురుము వురిమితే, "భూలలనా రత్నము స్నానమాడునని వేళాఘంటికల్ మ్రోసె" అనీ, యముని మహిషపు లోహఘంటలు మబ్బుచాటున ఖణేల్ మన్నాయి" అనీ అనుకుంటారు. మునిమాపుచుక్కల్ని చూచి, "సొంచిన క్రౌంజీకటు లఱ్ఱుసాచి వెలిగించెఁ దారకాదీపముల్ ;" "మీరెవరో క్షణక్షణ నిమీలన మోహననేత్రులై, తమోభార సుషుప్తిలో తొణకు స్వప్నగరుత్తుల చంచలానిలాంకూరములఁ దిశావధులకుఁ వెలిపూతల సోయగమ్ము, కర్పూర సువాసనామిళిత భోగముగా నిడు స్వర్గదేవతల్ కారు కదా" అనీ హాయిగా, వింతగా పాడుకోగలిగారు,

ప్రకృతే వీరికి వుపాస్యదేవత. నిత్యనిష్ఠలో, ఆ భక్తిలో, జీవికరక్తికీ-జీవన్ముక్తికీ పునాదివేశారు. "సుకవీ వెన్నెల లంతరించెదు; తమస్సుల్ కృష్ణపక్షమ్ములెల్ల కడల్ నిండగ విప్పుచున్నవి; పొలాలఁ జెల్లుపూ ల్కానుపింపక, ధ్వాంతమ్మున మాతృశాదముల క్రేవఁ నల్లనై పోయె; తారకలాలాపము సేయు గానముల సారస్యమ్ము నాలింతువా" అని ప్రకృతి వీరిని పిలిచి, అడుగుతుంది. నవకవులు ప్రకృతే తామూ, తామే ప్రకృతీ అయిపోటానికి యత్నిస్తారు. "శిలలఁ బ్రవహించి, శీకరంబులను జల్లి, ప్రకృతిహృద్గతభావంబు బయలుపఱచు గానముం జేయు మల యూటకాల్వగాగ నేల సృజియింపదో నన్ను, నీశ్వరుండు!" ఇలాంటివీ కవిమనోరదాలు. "ఆకులో ఆకునై. పూవులో పూవునై ...ఈయడవి దాగిపోనా. ఎట్లయిన ఇచటనే ఆగిపోనా" "చిలుపవానలకు పరువులుపెట్టిన సెలల యిసుకపొరలో, మొగలితావిపసబుగులుకొన్న పుప్పొడుల మేలితెరలో, కలిసియాడుదము పాటలు పాడుచు మంగిపోవుదము పనిలో, జిలుగుపూ తెనగు పచ్చని బయళుల కలిసిపోదమూ మనిలో;" "వలపులో, వెతలలో, బ్రతుకులో నీకె మధుపూజ లొసగి తన్మయత నొందెదనొ; నీ తీపిపాటలో నీడగా నొదిగి యొదిగి, ప్రత్యణువు సాయుజ్య మొందెదనొ" అని వొళ్లుతెలియని వుద్రేకంలో పొంగి, పాడినారు. ఇంతటి తపనా, యింతటి దీక్షా పురాకవితలో గోచరించదు.

అంతర్ముఖులై, ఎక్స్‌రేదృక్కులు విసిరా రంటే, స్థూలసంజ్ఞలూ, బాహ్యమూర్తులూ, ఆ ధవళాంగారపు ధగధగలలో తప్తసువర్ణం అయిపోతాయి. ఇలాంటి కవులకి వైకల్యంలో సౌందర్యం, భిన్నత్వంలో ఏకత్వం కనిపిస్తుంటాయి. "కాటియందలి ధూమాంధకారభరము, పరేకటింటి కప్పురపు దీపపు మెఱుంగు"—యిలాంటివన్నీ వొకటే నంటారు. "ఈ పృథగశేషజగతీసౌందర్యం సృష్టించే శతధృతి ఆనందానికి ప్రళయజ్యోతులు వెలిగిస్తే, నీహృదయం విరిసిన దిరిసెనపూవై ఉపశమనం నొందునాం — మఱి— నీవే యీ విలయంలో ఉదయించే యుగయుగచైతన్యానికి నవజీవప్రసరణలో ప్రణవం పలికిస్తావో" మృత్యూ! అని గంభీరంగా సంబోధిస్తారు.

అధునాకవులది వ్యూహశక్తి. అదృష్టపూర్వం, అనితరోపమం. 'మచ్చుకు' రేఖువు—"ఓయి తాండవచక్రవర్తీ! అగ్ని వీణలు పాణితలాంకరాన వెదల, జ్వాలాతరంగాల వేణీజార, రోదసీ భ్రామ్యమాణనిర్గుణరహఃప్రశస్తి జోహారులిడ. నుదయాస్తమయపు టరుణతేజశ్ఛయ మ్మేకమయినయట్లు విశ్వతాండవకేళీనవీనవిలసనంపు రంహఃప్రవృత్తి

తోఁ గెంపుగజ్జియల ధగద్ధగలతో నాట్యమాడి యాడి, తన్మయత లీనమైనావు, తావకీన విస్ఫురత్కల్య నాట్య శోభిత పరాగపటలి, వ్యథలమడుగునఁ జొమ్మలు వారు చుండు, ఈయధోలోక కృష్ణాంధ హృదయమందు .... పరమపరమాణువుగ నేనుదొరలుచుందు. అంటిసం జాలు, పీదని అంధకార శిధిలహృదయానఁ బడిన యీచిఱుతరేణువున విశాలశోకదహనభువన మొకటి యెడతెగని చిచ్చు రగిలించు నేల ప్రభువ?''— 1. ప్రోడు; 2. రేణువు; 3. హరివిల్లు; 4. కల్పలత; 5. శివరాత్రి ప్రభ; 6. స్వర్గదేవతలు; 7. ఆకాశదీపం; 8. కైలాసగంగ; 9. మృత్యురాసకం; 10. విద్యున్మాలికలు;— యిలాంటి కావ్యాల్లో ప్రకృతివిలాసం విచిత్రలాస్యం చూచింది. తరించిపోతా ననుకుంది.

కాలం యేమనుకుంటోందో—కవితవలపులో భావి కలో, ప్రకృతికడుపులో భావకళో-ఏముందో మరి ముందు!

(1,2) మోటూరి వేంకటరావు; (3) బాలాంత్రపు రజనీకాంతరావు; (4) కాశూరి వెంకటనరసింగరావు; (5) కవికొండల వెంకటరావు; (6,7,10) శ్రీరంగం శ్రీనివాస రావు; (8,9) 'సంపత్'



# తాళిబొట్టు మంగళసూత్రము : :

= శ్రీ కోరాడ రామకృష్ణయ్య =

ఒక భాషలోని కవిత-సారస్వతము ఆ భాషను వ్యవహరించు జనులయొక్క, అనగా ఆ జాతి యొక్క జీవితచరిత్రను, సంస్కృతిని ఎట్లు తెలుపుచుండునో, అట్లే ఆభాషలో నాయాకాలములందు వ్యవహారములో నున్న పదసముదాయముకూడ ఆజాతి జీవితపద్ధతికి, ఆచారవ్యవహారములు మొదలగువానికి చిహ్నము కాగలదని సాహిత్యతత్త్వవేత్తలు చెప్పుదురు. ఈభావము ననుసరించి పైపదముల స్వరూపలక్షణములు, చరిత్రను వానిని వ్యవహరించు జనుల జీవితాచార సంప్రదాయముల నెంతవరకు సూచించునో యించుక విచారింతము.

ఆంధ్రుల కవితావిషయములోను, వారి యాచార విషయములోను గూడ విశేషలక్షణములుగా గ్రహింపబడదగినవానిని గూర్చి కొరవిగోపరాజను నాంధ్రకవి ఆతడు రచించిన "ద్వాత్రింశత్సాలభంజికల కథలు" అను గ్రంథములో కొంత ముచ్చటించినాడు. ఆసందర్భమును ఇచ్చట అనువదించుట అప్రస్తుతము కాదు.

విక్రమార్కుడను నొక రాజు కలడు. అతని పురోహితుడు త్రివిక్రముడు. ఈతని కుమారుడు కమలాకరుడు. ఈతడు చిన్నవయస్సున విద్యార్జనమునం దాదరము లేక తిరుగుచుండగా తండ్రి యది సహింపక యాతని నింటినుండి వెడలగొట్టెను. కమలాకరుడు ఇల్లు విడిచి దేశాటనము చేసి, అనేకపట్టణములను దర్శించి అచ్చటి పండితులయొద్ద ననేకవిద్యల నభ్యసించి పండితుడై కొన్ని సంవత్సరములకు మరల నిల్లు చేరెను. తండ్రి విద్యలను గడించి వచ్చిన కొమరుని జూచి సంతసించి రాజునొద్ద కాతనిని దీసికొనిపోయెను. కమలాకరుడా విక్రమార్కునకు దాను జూచివచ్చిన దేశములందలి విశేషము లన్నిటిని దెలుపుచు నాయా దేశములందలి కవితాలక్షణములను గూర్చి ప్రసంగించి యం దాంధ్రదేశమునందలి కవితలో గల యపూర్వలక్షణములను గూర్చి చెప్పదొడంగెను. "అతడు జూచిన దేశములలో గణములు, గణజాతులు మొదలగున వన్నియు "నొక్కవిధము కవితల కెల్లన్." "ఇట్టి విధం బయ్యు నంధ్రమండలంబునం గోణదేశంబున దెలుంగు కవితకు ప్రాలు వళ్లు నను నియమంబులు సూచినాడ. నవి యెయ్యెడం దప్పు గాకుంట నపూర్వం బవధరింపుము——

పుణ్యస్త్రీకి గుణంబు మంగళగుణం
బు న్సొమ్ములై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణమౌక్తికమణీ
సద్యుక్తిభూషాకృతుల్
గణ్యం బౌగతి సంస్కృతంబునకు వా
గ్భవంబు శబ్దంబు లా
వర్ణ్యాకారములౌఁ, దెనుంగునకుఁ బ్రా
ల్వళ్లుం గదున్ వన్నియల్.

పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్లు లేని తెలుగకవిత
వన్నెలెల్లఁ గూర్చి వ్రాయుచోఁ గాటుక
వన్నె లేని ప్రతిమ వ్రాఁతఁ బోలు"

అని పుణ్యస్త్రీకి గుణంబు, మంగళగుణంబు (మంగళసూత్రము) సొమ్ములై యొప్పినట్లుగా దెనుంగు

నకు (తెనుగుకవితకు) ప్రాలు, వళ్లు అనునవి కడుఁ బన్నె దెచ్చు సొమ్ములగునని తెలిపినాడు. ఇంతేకాక సంస్కృతకవితను బణ్యస్త్రీతో బోల్చినట్లుకూడ నగపడుచున్నది. పణ్యస్త్రీకి సువర్ణమౌక్తికసురూపవ్యక్తిభూషాకృతులు గణ్యంబైనరీతినే, సంస్కృతమునకు వాగ్గుంభనంబు, శబ్దంబు లావణ్యాకారము లగునట. ఎట్లైనను పుణ్యస్త్రీకి గుణమును, మంగళసూత్రము నెట్టివో తెలుగుకవితకు ప్రాస, వడి అట్టివేయై వన్నె గూర్చుచున్నవని తెల్పినాడు.

ఇట్టిరీతిని గోపరాజాంధ్రకవితాసతికి వన్నె దెచ్చిన విశేషలక్షణములనుగూర్చి చెప్పుచు నాంధ్రసతీలలామజీవితమునకు వన్నె దెచ్చు ప్రధానలక్షణము లనుగూడ జమత్కారముగ దెలిపినవాడైనాడు. ఆంధ్రకవితలో నొక్కొక పద్యమునందలి భిన్నపాదములను, పాదములలోని దళములను యతిప్రాస లెట్లొక సూత్రమున బంధించి యాపద్యమునకు వన్నెగూర్చుచున్నవో, అట్లే మంగళసూత్రమనునది ఆంధ్రసతిజీవితమును తత్పాణిగ్రహీతృజీవితముతో ననుసంధించి యామె జీవితమునకు వన్నె దెచ్చుచున్నది. అదియే యామె సతీత్వమునకు చిహ్నమగుచున్నది. సంస్కృతకవితలోని యనుప్రాసాదికము బాహ్యాలంకారసదృశమై వాగాడంబరమునకు మూలమగుటచే గాబోలు నీకవిత పణ్యస్త్రీకి బోల్పబడినది. పలుదెరంగులైన పలుకులు గలిగియుం గొటుకవన్నెలేని ప్రతిమను బోలినదైనదని సూచించినాడు.

ఇచ్చట మనము గమనింపదగిన విషయ మొకటి కలదు. తెనుగుకవిత కిట్టి వన్నెదెచ్చిన ప్రావళ్లు, శార్దూలమత్తేభాదివృత్తములవలె సంస్కృతకవితా సంప్రదాయమునుబట్టి తెలుగున సంక్రమించినవి కావనుట ప్రసిద్ధమే. కాని, యవి కేవల మాంధ్రదేశ సంప్రదాయ సిద్ధములు మాత్రమేనా, లేక దక్షిణదేశీయ కవితా సంప్రదాయ సిద్ధములా యను విషయము విచారింపవలసి యున్నది. కమలాకరుడు అనేక దేశములు తిరిగి అచ్చటి కవితారీతులను, ఆచారవ్యవహారములను దెలిసికొన్నట్లు మాపరాజు చెప్పినాడుకాని, అత డితరదక్షిణదేశభాషాకవితలను బోల్చి పరిశీలించి చెప్పినట్లగపడదు. అట్లు పరిశీలించినట్లయితే తెలుగుకవితకు వన్నె దెచ్చిన ప్రావళ్లు ఆంధ్రదేశీయసంప్రదాయసిద్ధములు మాత్రమేకాక, 'దక్షిణదేశీయకవితా సంప్రదాయసిద్ధములే యనియు, ఇంతేకాక దీనితోపాటు ఆంధ్రదేశమున పుణ్యస్త్రీ చిహ్నమైయొప్పిన మంగళసూత్రముకూడ నాంధ్రదేశీయము మాత్రమేకాక దక్షిణదేశీయసంప్రదాయసిద్ధమే యనియు గూడ గ్రహించియుండును. తెలుగుకవితయందలి ప్రావళ్లు ప్రాచీనతమిళకవితాసంప్రదాయసిద్ధములగు మోనై, ఎదుగై లనువానికి సంబంధించినవనియు, కన్నడకవిత ప్రాసనుమాత్రము గ్రహించి యతివిలంఘన మొనర్చిన దనియు, ఛందోవిషయమునగూడ నీభాషలలోని దేశికవితారీతులను సరిపోల్చి పరిశీలించినచో ప్రాచీనదక్షిణదేశీయసంప్రదాయలక్షణములను మనము గుర్తింపవచ్చుననియు నిదివరకే నేనీ పత్రికాముఖమున సూచించియున్నాను. కావున నిప్పు డీదేశమున పుణ్యస్త్రీకి ముఖ్యచిహ్నముగా గ్రహింపబడుచున్న యీ మంగళసూత్ర మనునది ఆంధ్రదేశీయ సంప్రదాయమాత్ర సిద్ధమా, అంతకంటె విపులమగు ప్రాచీన దక్షిణదేశీయసంప్రదాయ సిద్ధమా యను విషయము నించుక పరిశీలింతము. ప్రాచీనాంధ్రదేశీయ సంప్రదాయసిద్ధ మన్నపు డది ప్రాచీనదక్షిణదేశీయ సంప్రదాయసిద్ధము కాకూడదా, ఈ కాకదంతపరీక్ష యేల అను ప్రశ్న కలుగవచ్చును. కాని ప్రాచీనదక్షిణదేశీయమగు సహజసామాన్య సంప్రదాయ మొకటి కలదనియు, నది యీదక్షిణదేశీయజాతులలో దేశకాలానుగుణమగు మార్పులకు లోనై యనుసరింపబడుచున్నదనియు చెప్పుటలోను, ఏకదేశీయమగు నొక సంప్రదాయ మితరదేశములకు సంక్రమించినదని చెప్పుటలోను గల భేదము పరిశీలించినవారికి దెలియకపోదు. ఆంధ్రభాషాసాహిత్యముల ప్రాచీనచరిత్ర నన్వేషించు సందర్భమునకేకాక ఆంధ్రదేశీయాచారసంప్రదాయముల చరిత్ర నన్వేషించుపట్ల కూడ నిట్టి పరిశీలనదృష్టి యావశ్యకమేమో యని తోచుచున్నది. పుణ్యస్త్రీ వివాహచిహ్నముగా మంగళసూత్రమును ధరించు నాచారము కేవలాంధ్రదేశీయమా, లేక దక్షిణదేశసామాన్య సంప్రదాయసిద్ధమా యను విషయము మన కిచ్చట ప్రసక్తము. 'మంగళ

సూత్ర' మను శబ్దము సంస్కృతీయమైనను, తద్ధారణ మార్యవివాహతంత్రములో జేరినది గాదు గావున తత్సంప్రదాయమును సూచించునది కాబోదు. ఇక నది దక్షిణదేశీయమగు ననార్యసంప్రదాయమును సూచించు శబ్దమునకు సంస్కృతీకరణము గావచ్చును. ఆసంప్రదాయ మీదక్షిణదేశభాష లన్నిటిలోను 'తాళి' శబ్దముచే సూచింపబడుచున్నది. 'తాళి'అనగా మంగళసూత్రము. తాళికట్టుట=మంగళసూత్రమును గట్టుట-అనగా వివాహమగుట అనియు, తాళికట్టు= వివాహము అనియు ననుగున వాడుక కలదు. ఇచ్చట 'కట్టుట' అను శబ్దముతోడి సాహచర్యముచేత 'తాళి' శబ్దము సూత్రపర్యాయమా యను భావము స్ఫురింపకమానదు. మంగళసూత్రమునుగూడ కట్టుటయనియే చెప్పుదురు. ఆంధ్రకవితాపితామహుడగు పెద్దనార్యుడు స్వరోచిచే మనోరమకు మంగళసూత్రమును గట్టించినాడు చూడుడు:

"కట్టెన్ మంగళసూత్రమున్ శరధిశం
ఖశ్రీలకుం బొమ్మలన్
గట్టన్ జాలెడు కంఠపీఠి నిఖిల
క్ష్మాభర్త శోణద్యుతుల్
దట్టంబై నఖకోరకోత్కరము త
ద్గ్రైవేయహైమస్ఫుర
త్పట్టస్థాపితపద్మరాగముల పం
తంబుల్ విడంబింపగాన్."

ఆంధ్రసారస్వతమునందలి వివాహవర్ణనల సందర్భమున మంగళసూత్రమును గట్టించినవారిలో పెద్దనార్యుడే మొదటివాడుగా గనబడుచున్నాడు. ఆకాలముననే ఆముక్తమాల్యదాకారుడుగూడ రంగనాథునిచే గోదాదేవికి మంగళసూత్రమును గట్టించినాడు. "గళమున గట్టెను హరి మంగళసూత్రము పులక లతివగాత్రముం బొదువన్" (ఆము. ౫-౪౦). కాని యింతకు బూర్వులగు తెలుగుకవుల వివాహవర్ణనములలో మంగళసూత్రధారణము వర్ణింపబడిన ట్లగపడదు. ఇక 'తాళికట్టు' అనుదానిలోని 'కట్టు' అనుదాని సాహచర్యమునుబట్టి 'తాళి' శబ్దము 'సూత్ర' పర్యాయమైయుండునని మన మూహింపవచ్చును. మంగళసూత్రమునుగూడ కట్టుట యనియేకదా చెప్పుదురు. సామాన్యముగా దీనిలో రెండు వస్తువు లుండును. బొందుదారము-లేదా సూత్రము ఒకటి. ఈ దారమునకు గ్రుచ్చబడు బంగారు మొదలగువానితో జేయబడిన బిళ్లలు రెండు. ఇవి దేశాచారమునుబట్టి ఆకారమునందును, సంఖ్యయందునుగూడ భిన్నముగా నుండవచ్చును. ఆంధ్రదేశమున సామాన్యముగా రెండు. దక్షిణదేశమున మూడు. మలయాళదేశమున నొకటి. దీనినిబట్టి చూడగా మాంగళ్యము—బంగారము మొదలగువానిచే జేయబడినది; దీనినే 'బొట్టు' అని చెప్పుటయు గలదు—, దీనికి గ్రుచ్చబడిన యొక దారము- సూత్రము కలిసి మంగళసూత్ర మనేది ఏర్పడినట్లు తెలియవచ్చుచున్నది. కాని యిటీవలి సామాన్య వ్యవహారములో బంగారు ఆభరణమునకు మాత్రమే 'మంగళసూత్రాలు' అనే వాడుక గలిగిన ట్లగపడుచున్నది. 'మంగళసూత్రాలు చేయించినారా' అని ప్రశ్నించుట కలదు. ఇచ్చట 'మంగళసూత్రా'లనుదానికి దారమునకు గుచ్చబడిన 'బొట్టు' వంటి ఆభరణమునకే గ్రహణము గదా. 'మాంగళ్యము' అను సంస్కృతపదము మంగళవాచకమే కాని, ఆశబ్దమును బట్టి ఆసూత్రమున గ్రుచ్చబడు ఆభరణముయొక్క స్వరూప మెట్టిదో తెలిసికొను నవకాశము కలుగుట లేదు. వివాహమున నీ మంగళసూత్రధారణ మనునది ఆర్యాచార ప్రసిద్ధమైనదిగాక, కేవల దక్షిణదేశీయాచారమే యగుటచే నీశబ్దము తత్సంప్రదాయ సూచకమై యర్వాచీనముగా నేర్పడియుండును. కావుననే యావస్తుస్వరూపము నిది మనకు తెలుపజాలదు. ఇక దేశీయమగు 'తాళిబొట్టు' అనుదానినిబట్టి గ్రహింపగలమేమో చూతము. 'తాళిబొట్టు' అనునది తొలికాలమున 'తాళి' శబ్ద మాత్రముచేతనే సూచింపబడినట్లున్నది. ఆంధ్రవాఙ్మయమున నీ'తాళి'శబ్ద ప్రత్యేకప్రయోగము పాండురంగమాహాత్మ్యమున ౪-వ ఆశ్వాసమున సుశీలచరిత్రలో నీక్రిందిపద్యమున గానవచ్చుచున్నది:

"తాళి విభుండు గట్టిన మొ
దల్ పతిదేవత యౌసుశీల పెం
గోలతనంబునన్ మగడు
కొట్టిన దిట్టిన దట్టుచేసినం

దాళి దినంబు దచ్చరణ.
తామరసంబులు గొల్చు నేలయుఁ
బోలునె యీవె కంచు గృత
బుద్ధులు వృద్ధులు ప్రస్తుతింపఁగ"*

ఇది ముద్రితప్రతిలో 'తాళి' అని అలఘులకారముతోనే ముద్రింపబడియున్నను గోల, బోలు మొదలగు ప్రాసవర్ణములను బట్టి దీనిని లఘులకారముతో గూడిన 'తాలి' శబ్దముగానే కాని 'తాళి' శబ్దముగా గ్రహించుట యుక్తముగా గనబడదు. దీనిని శబ్దరత్నాకరకారుడు మంగళసూత్రార్థమున 'తాలి' శబ్దముగనే గ్రహించి 'తాళి'శబ్దమును వేరుగా గ్రహించి దానికి పతకము, హారవిశేషము అను నర్థముల నిచ్చినాడు. కాని సూర్యరాయనిఘంటువులో నిది 'తాళి' యని అలఘులకారముతోనే గ్రహింపబడినది. ప్రయోగము పాండురంగమాహాత్మ్యములోనిదే కాని యంతకంటె ప్రాచీనమగునది చూపబడియుండలేదు. ప్రాసస్థానమును జూపు ప్రయోగము నిదియొక్కటే. ఇందు ప్రాసస్థానమున రెండు పాదములందు 'ల' కారమే కనబడుచున్నది. ఇది తెనుగుననేకాక యితర దక్షిణదేశభాషలందుగూడ 'తాలి' యని లఘులకారముతోనే కానవచ్చుచున్నది. సామాన్యవ్యవహారమున తెలుగునందువలెనే తమిళకన్నడములందును 'తాలి' యనునది 'మాంగళ్యము' అనునర్థముననే వ్యవహరింపబడుచున్నట్లు తమిళకన్నడకోశములు తెలుపుచున్నవి. తమిళకోశమున "The central piece of a neck - ornament solemnly tied by the bridegroom around the bride's neck as a marriage- badge." అనియు, కిట్టెలు కన్నడ నిఘంటువున "A small round plate of gold worn as a marriage_badge." అనియు గలదు. దీని వలన తాలిశబ్దము నడుమనుండు బంగారపుబిళ్లనే సూచించునదైనది.

ఇక తెలుగున 'తాలిబొట్టు' అనుదానితో సమానార్థకమైన 'తాలిప్పొట్టు' అను తమిళశబ్దమునకు గూడ "Discshaped tali- వట్టమాగ చెయ్ద తాలియురు" వర్తులముగా జేయబడిన తాలి యనునర్థము చెప్పబడుటచే, 'తాలి' అనుదాని మూలార్థము విస్మృతప్రాయమై 'బిళ్ల' అనునర్థము మాత్రమే నిలిచినట్లు స్పష్టము. కాని 'తాలి పెరుగుదల్-త్రాడు తెగినది – మంగళసూత్రములు తెగినవి' అనునపుడు ఈ 'తెగుట' సూత్రములకే అన్వయింపవలసియుండుటచే 'తాలి' మొదట సూత్రపర్యాయమే యైయుండెననుట నిశ్చయము. ఇది 'తాల్చు= ధరించు' అను ధాతువునుండికాక 'తాలుచు=పిరివెట్టు, పేను' అను ధాతువునుండి యేర్పడి సూత్రపర్యాయమైనది. యజ్ఞోపవీతములు మొదలగువానిని తాల్చుట - పిరియెక్కించుట ప్రసిద్ధమేగదా. ఈతాల్చుటను గూర్చి కేతన విజ్ఞానేశ్వరమునుండి చక్కని ప్రయోగము.

"గాయత్రి చదువుచు గడగి మున్నూలొండ్లి
వలచెయి యెక్కంగ వలనుదాల్చి
ముమ్మడుం గగదాల్చి క్రమ్మఱ దిగదాల్చి
ముక్కలు వుచ్చి ముచ్చుట్లు చుట్టి"

మన స్త్రీలు మంగళసూత్రముల నిట్టే పురిపెక్కింతురుగదా.

దీపపువత్తిని తాల్చుటయు గలదు.

"ఎసగు సంతాపభరమున నిట్టు నట్టు
బొరలు శయ్యాతలంబున బువ్వుబోడి
తిపురు విరహానలంబున దివ్వెయొత్తి
చిత్తజాతుండు వత్తి దాల్చినవిధమున."

'తాలిక' అను మఱియొక శబ్దము 'మెలిక' అను నర్థమున గలదు. "నడిసెత్తి మత్తిపా లిడి తాలిక లొనర్చి కడలుకొల్పిన గొప్ప జడలద్రిండు."(శుక. ౨ ఆ)

---

* ఆంధ్రసారస్వతమునందలి వివాహవర్ణనముల లో తాళిగట్టించినవారిలో మఱియొకరు 'యయాతి చరిత్ర'కారుడగు తెలగనార్యుడు.

"తాళిగట్టె నఘుడౌ తలిరాకుబోడికి
పుడమిఱేడు వేడ్క గడలుకొనగ
దనరు పెక్కువాయిదమ్ముల మ్రోతలు
చెలగి ముజ్జగములు చెవుడుపరుప"(య. చ. ౨ ఆ)

ఇట్లు 'తాల్చు' ధాతువునుండియే 'తాలి' శబ్ద మేర్పడియుండును. తాల్పబడినది 'తాలి'. అనగా 'వేసిన దారము' అని యర్థమగును. దీనికి గట్టబడిన లేదా గ్రుచ్చబడిన 'బొట్టు' తాలిబొట్టు.

ఈ 'తాల్చు' ధాతువు తెలుగుననే నిలిచియున్నది గాని తమిళకన్నడములం దగపడదు. తమిళమున 'తాలి' అనుదానికిని, కన్నడమున 'తాళి' శబ్దమునకును వ్యవహారప్రాచుర్యము కలదు. కన్న. గిళిదాళి (చిలుక చిహ్నము గల తాళిబొట్టు), గుళదాళి, అయర్దాళి, తాళిబొట్టు (A small kind of tali) మొదలగు వానిలో నలఘులకారమే కనబడుచున్నది. తెలుగు లోను చిలుకతాళి, తుమ్మెదతాళియు గలవు. ఇట్లే తెలుగునగూడ నిది యలఘులకారముతో గూడినదిగా గ్రహింపబడుటచేతనే కాబోలు దీనికి వృక్షభేదమును సూచించు 'తాళ' శబ్దముతో సంబంధము కల్పించి, తాటియాకును జుట్టగా జుట్టి దారమునకు గట్టి మంగళసూత్రముగా ధరించు నాచార మాంధ్రదేశమున గలదనియు, దానినిబట్టియే దీనికి 'తాళి' యను పేరు కలిగిన దనియు, 'తాటంక' శబ్దము 'తాటియాకు' శబ్దసంస్కృతీకరణమే కావచ్చు ననియు గొందరు తలచుట కూడ తటస్థించినది. సంస్కృతమునగూడ 'లళయో రభేద'పక్షమున తాళ, తాలశబ్దములు రెండు నుండ వచ్చును. 'తాల' శబ్దము తాడిచెట్టు అనునర్థమున ఋగ్వేదముననే ప్రయోగింపబడినట్లు కోశములనుబట్టి తెలియుచున్నది. తాలీ, తాడీ, తాటంకశబ్దములు సంస్కృతమున కర్ణాభరణ పర్యాయములుగనే యున్నట్లును, నిఘంటువులనుండి గ్రహింపబడినట్లును మానియర్ విలియమ్సు పండితుడు తన కోశమున దెలిపియున్నాడు. "తాళీదళాబద్ధతాటంకభూషావిశేషాన్వితే" అని కాళిదాసవిరచితమగు శ్యామలాదండకములోని దని చెప్పబడు వాక్యమునుబట్టి కాళిదాసు కాలము నాటికే 'తాటంక' మనునది తాళీదళాబద్ధ మయిన కర్ణాభరణ మని తెలియుచున్నది. ఈ కాళిదా సెప్పటివాడో. కన్నడ శబ్దమణిదర్పణకారుడు 'తాల' శబ్దములోని 'ల' కారమునకు ద్రావిడాక్షరమగు 'ళ' కారము గలుగునని చెప్పినాడు. కాని కిట్టెల్ పండితుడు దీనిని 'ల' కారయుక్తమగు దేశీయశబ్దముగనే గ్రహించినాడు. 'తాల్' అనునది ప్రాచీన దేశీయశబ్దమైనచో నిది కన్నడమున 'తాళి' యనియు, తెనుగున తాడు, తాడి యనియు నగుట యీ భాషా సంప్రదాయమున కనుగుణముగనే యున్నది. తెలుగున వృక్షపర్యాయమైనది 'తాడు'.- 'తాడి' శబ్దమేగదా. కావుననే తాటి, తాటియాకు అనునాపవిభక్తికరూపము సిద్ధించినది. తాళపత్రమును కర్ణాభరణముగా ధరించు నాచారము దక్షిణదేశమం దంతటను గలదు గాని, దానిని బట్టి తెలుగు 'తాటియాకే' 'తాటంక' మైనదని చెప్ప గలమా? అట్లే యైనచో నీ తెలుగుపదము కాళిదాసునకు బూర్వముననే కల తెలుగుభాష స్వరూపమును మనకు దెలుపుచున్న దనవలసియుండును. ఇక నీ తాటియాకు చుట్టను మంగళసూత్రమున గూర్చు నాచారము కొన్ని ప్రాంతములందు గలదేమో కాని ఇటీవలి కాలమున మామిడాకు నందుల నుపయోగించుట కలదు. చేతి కంకణములకుగూడ మామిడాకునే యుపయోగింతురు. మలయాళదేశమున రావియాకు నుపయోగింతురట. కావుననే వారి మంగళసూత్రము రావియాకును బోలి కొంచెము కోలగా నుండును. కాని మన తాలిబొట్టు వలె గుండ్రముగా నుండదు. ఆంధ్ర తమిళ దేశములలో నిది సామాన్యముగా స్వర్ణరచితమైనపుడు వర్తులమై యుండుటచేతనే దీనికి 'బొట్టు' అను పేరు కలిగినట్లగపడుచున్నది. వర్తుల - తిలక వృత్తశబ్దభవమే 'బొట్టు' అనియు, నిది వైకృతమే యనియు పండితుల యభిప్రాయము. దీనికి నీటిబొట్టు - బిందువు అనియు, అనుస్వారచిహ్నము వర్తులాకారము కలదగుటచే అనుస్వార మనియు, ముఖమున దీర్చు తిలకము గుండ్రముగా నుండును గావున 'తిలక' మనియుగూడ నర్థములు గలిగినవి. దీనినిబట్టి దేశ్యమగు 'తాలి' శబ్దము కంటె వైకృతమగు 'బొట్టు' శబ్ద మర్వాచీనమనియు, తాలిబొందుకు గ్రుచ్చబడు గుండ్రని సువర్ణరచిత మాంగల్యము 'తాలిబొట్టు' అయిన దనియు వ్యక్తమగుచున్నది.

చేమకూర వెంకటకవి విజయవిలాసములో సుభద్రా వివాహ సందర్భమున నర్జునునిచే నాతను-

మంగళసూత్రమునే కట్టించెను గాని, ఆ సందర్భమున గలిగిన చంద్రోదయమును వర్ణించుచు 'తాళిబొట్టు' స్వరూపమును మాత్రము మనకు దెలిపియున్నాడు.

"నందకుమారానుజ యుగుఁ
తం దన నందనుడు గట్ట దైవతపతి చే
డ్కం దెచ్చు తాళిబొట్టన
జందురుఁ డరుణరుచిఁ బ్రాగ్దిశన్ గనఁబడియెన్"
(వి. వి. 3-౯3)

తాలికి గట్టు బొట్టు సూర్యాస్తమయ మైనంతనే యుదయించిన యరుణరుచి గల పున్నమచంద్రునితో బోల్చుటనుబట్టి 'తాళిబొట్టు' స్వరూపము మనకు దెలియవచ్చుచున్నది.

వివాహమునకు 'తాలికట్టు' అనియే యీదక్షిణ దేశభాష లన్నిటిలోను వ్యవహారము కలదు. కావున నిది యాంధ్రదేశమునకు మాత్రమే ప్రత్యేకమగు నాచారమనికాని, ఆంధ్రదేశీయాచారమే యితర దేశములకు సంక్రమించిన దనికాని చెప్పుటకు వీలులేదు. ఈ 'తాలి', అనగా పేనినదారము తొలికాలమున వివాహచిహ్నముగా నొక కన్యకు గట్టబడునపుడు ఒక పచ్చని యాకు—తాటియాకో, మామిడాకో, రావియాకో చుట్టగా జుట్టి దానికే త్రాడుకట్టి, దానిని కన్య మెడలో గట్టు నాచార మేర్పడియుండును. కాలక్రమమున నాగరకత పెరిగినకొలది బంగారుతో జేయబడిన బొట్టు * వంటి యాకారము గల చిహ్నము ఆ పచ్చియాకు స్థానమును వహించియుండును. వివాహాదులలో జేతికి గట్టబడు కంకణములు, రక్షాబంధనములు మొదలగునవి యిప్పటికిని మామిడాకుచుట్టకు గట్టబడిన త్రాడుతో గూడియుండునుగదా. ఈ 'తాలి' యనునదిగూడ తొలుత రక్షాబంధనముగనే యుండి కాలక్రమమున వివాహచిహ్నముగ నేర్పడినదేమో. ఏలయనగా నీ 'తాలి' శబ్దమునకు ప్రాచీనప్రయోగము తమిళసంఘ వాఙ్మయములోని 'పురనానూరు' అను గ్రంథములో గనబడుచున్నది. అక్కడ 'పులిప్పల్తాలి' అను ప్రయోగముకలదు. దీనికి 'పెద్దపులిపళ్లతో గూడిన తాలి' యని యర్థము. పులి + పల్ + తాలి అను పదములు చేరి తమిళములో సంధివశమున 'పులిప్పత్తాలి' యగును. ఇప్పుడు పులిగోరుపతకమును పిల్లలు ధరించుచున్నట్లే ఆకాలమునను పిల్లలకు 'పులిగోళ్ల తాలి' ఒకదానిని కట్టు నాచారముకలదు. పిల్లల కిది రక్షాబంధనము వంటిదే. కాని 'కురింజి' అను కొండలప్రదేశములో శౌర్యశాలురగు యువకులు పులినిజంపి దాని గోళ్లను గెచ్చి తాము ప్రేమించిన యువతుల కిచ్చుట, వారు వాని నొక 'తాలి'కి గట్టి యా తాలిని ప్రేమచిహ్నముగా మెడలో ధరించుట అను నాచారమున్నట్లు ప్రాచీనతమిళసంఘ

* ఈ 'తాళిబొట్టు' స్వర్ణరచిత మైనపిదపనే దానికి 'మినుకు' అను పేరుకూడ వచ్చియుండును. ఇది ప్రకాశమాన మైనది అను నర్థమున 'మిన్' ధాతువునుండి యేర్పడినది. "మినుకు -'తాళిబొట్టు', బంగారునాణెము" అని శ. రత్నా. తాళిబొట్టు అను నర్థమాంధ్రవాఙ్మయమున పోతనగారి కాలమునకే యున్నట్లీ భాగవతప్రయోగమునుబట్టి తెలియుచున్నది. శ్రీరాము దశ్వరముల జేసి తన రాజ్యమును, సొమ్ములను సూనుల కొసంగి,

"తనకు రెండు పుట్టంబులు దనకు నయిన
మెలతమంగళసూత్రంబు మినుకుదక్క
వినతుడై యుండె" (భాగ. ౯-౩౭౨)

నట. దీనినిబట్టి మినుకనునది స్వర్ణవికారమగు మాంగళ్య మనుటయేకాక అది మంగళ సూత్రమున బొందుపరుపబడిన దనుటయు వ్యక్తము. ఇంతేకాక స్త్రీలకీ మంగళ సూత్రధారణము పోతనామాత్యుని కాలమునకాంధ్రదేశమున సుప్రసిద్ధాచారమే యైయుండె ననియు దెలియుచున్నది. ఇంతకు పూర్వులగు కవుల వివాహవర్ణనములలో మంగళసూత్రమును గట్టించినవారగపడరు.

ఈ 'మినుకు' శబ్దము గౌరనహరిశ్చంద్రద్విపదలో గానవచ్చుచున్నది. చంద్రమతికుత్తుక నంటియున్న 'మినుకు'ను సుంకముగా దెమ్మనుటచేతనే యాతడు తన భర్తయగు హరిశ్చంద్రుడని యామె గుర్తించినట్లు వర్ణించినాడు. గౌరన శ్రీనాథపోతనలకించుక సమకాలికుడే యగుటచే మంగళ సూత్రములనుమ స్వర్ణరచితమగు 'మినుకు' గట్టు నాచార మప్ప

సాహిత్య సంప్రదాయములను బట్టి తెలియుచున్నది. * ఇట్లు రక్షాబంధముగనో, వివాహచిహ్నముగనో 'తాలి' కట్టు నాచారము క్రీస్తుశకారంభమునుండి కలదనియు, నిదియే కాలక్రమమున సువర్ణకలితమగు మంగళసూత్రధారణముగ బరిణమించిన దనియు మనము నిశ్చయింపవచ్చును.

ఇది దక్షిణదేశీయమే యనుటకు ఇది తద్దేశీయ వాఙ్మయసంప్రదాయసిద్ధమగుటయే కాక, ఆర్యవివాహ పద్ధతియం దీ మంగళసూత్రధారణ మనునది లేకుండుట కూడ నొక ప్రబలనిదర్శనమగుచున్నది. ఈ దేశమందలి హైందవనాగరకత, భాషాసాహిత్యములు, జీవితపద్ధతులు, ఆచారవ్యవహారములు మొదలగువాని సంప్రదాయము లన్నియు ప్రాచీనార్య సంప్రదాయములకును, అనాదియగు దేశీయ సంప్రదాయములకును కాలగతిని గలిగిన సహజసమ్మేళనముచే నేర్పడినవిగా నున్నవి. ఉత్తరదేశమునం దీసంప్రదాయములను వేరుపరచి పరిశీలించుటకు దగిన యవకాశము లేకపోయినను, దక్షిణమునకు వచ్చినకొలది యీదేశీయ సంప్రదాయముల జాడలను కనిపట్టు నవకాశము లేకపోదు. మానవుని జీవితమున నొక ప్రధానవిషయముగ గ్రహింపబడుచున్న యీ వివాహ పద్ధతిని గురించి విచారించినపుడు ప్రస్తుతము మన దేశమున ప్రచారములో నున్న పద్ధతిలో ప్రాచీనార్య సంప్రదాయములు, దక్షిణదేశీయ సంప్రదాయములు సమ్మేళనము పొందినవిధము తెలియకపోదు. ఆంధ్రదేశ ముత్తరదేశీయమగు నార్యసంపర్కమున కెక్కువగా లోనైయుండుటచేత నిందు కేవల దక్షిణదేశీయ సంప్రదాయములు కొన్ని యంతరించినవి. కావున నింకను దక్షిణదేశమందలి సంప్రదాయములతో వీనిని పోల్చి పరిశీలింపవలసియుండును. ఆర్యసంప్రదాయమున నష్టవిధవివాహములు కలవు. కాని వీనికి దేశవిభాగముతో నెట్టి సంబంధము నున్నట్లగపడదు. కాని దక్షిణదేశమందలి ప్రాచీనతమిళ సాహిత్యమును, లక్షణగ్రంథములను బరిశీలించినచో నీ వివాహపద్ధతి దేశవిభాగము, తత్తత్పరిస్థితులనుబట్టి భిన్నరీతులుగలదై యున్నట్లగపడుచున్నది. దేశ మైదు భాగములుగ గ్రహింపబడినది. కురింజి, ముల్లై, పాలై, మరుదం, నెయ్‌దల్ అని. ఆయా దేశపరిస్థితుల కనుగుణమగునట్లుగనే వివాహసంప్రదాయములును ప్రాచీనతమిళసాహిత్యమున వర్ణింపబడియున్నవి. కొండప్రదేశము

---

టికి సుప్రసిద్ధమైయున్న దనుటకు సందేహము లేదు. కాని యంతకు గొంత పూర్వుడగు మారన రచించిన మార్కండేయ పురాణాంతర్గత హరిశ్చంద్రకథలో నీ 'మినుకు' వృత్తాంతమే లేదు.

"అక్కట దైవము రాజ్యము
ద్రెక్కొని యాలిం దనూజు దెగనమ్మంగా
నెక్కొలిపి హరిశ్చంద్రుని
నిక్కడ గాస్పటిచె నింక నేగతిఁ బోదున్"

"అని పలుకన్ విభుండు విని
యప్పుడు దా మది వారల న్నిజాం
గనయు సుతుండుగా నెఱిగి"

నట్లుమారన వర్ణించినాడు. మూలమగు సంస్కృతమార్కండేయ పురాణములో నట్లుండుటచే మారన యట్లే రచించియుండును. కాని హరిశ్చంద్రకథలో నీమార్పెప్పటినుండి కలిగినదో పరిశీలింపవలసియున్నది. దక్షిణదేశమం దంతటను నీ మినుకు వృత్తాంత మాకథలో నున్నట్లే యగపడుచున్నది. దేశీయాచారములను విశేషముగా వర్ణించిన తిక్కన శ్రీనాథుల వంటివారు గూడ వారి వివాహవర్ణనలలో మంగళసూత్రధారణము చేయించినారు కారు. ఏలనో, అప్పటి కీయాచారము ప్రబలియుండలే దనవలెనా ?

*"When Poetry first arose among the Kuravar the bards naturally sang about the pre-nuptial loves of dill chieftains, and their presenting their mistresses with leaf garments (talai udai) and the teeth of the tigers which the hill chiefs killed in the chase; these teeth were strung together and worn hanging from the neck and called 'Pulipparrali' from which in later times was evolved the 'Gold tali.'

'Culture of the Tamils' by P. T. Sreenivasa Iyengar.

నందలి జీవితమును, ప్రణయపద్ధతిని వర్ణించు భాగము నకు కురింజిత్తిణై అని పేరు. ఇందు నాయికానాయ కుల ప్రథమదర్శనముననే ప్రణయము. నాయకుడు 'తిణై ఉడై'—అనగా 'తలిరుడుపులు'— పులిగోళ్లు మొదలగువానిని కన్యక కిచ్చుట గాంధర్వపద్ధతిని వివాహము. దీనిని 'కళవు' అని చెప్పుదురు. ఇక తల్లిదండ్రులు కన్యావరులకు వివాహముచేసిన పిదప వారి ప్రణయమును 'కర్పు' అని అందురు. ఇది 'మరుదం' అనగా నదులు ప్రవహించు పంటభూములు గల దేశము నందలి జనుల జీవితమునకు సంబంధించినది. వివాహము, దంపతులప్రణయము, పరస్త్రీమూలమున దీనికి భంగము, గృహకలహములు, మరల దంపతులు సమాధానపడుట మొదలగు రీతి గలది. వ్యవసాయము, నాగరకత పెరిగినకొలది ఆదేశములలో గాంధర్వపద్ధతి అంతరించి యుండును. ఆకాలపు దక్షిణదేశ వివాహ పద్ధతియందలి ముఖ్యవిషయములను కొన్నిటి నప్పటి వాఙ్మయమునుండి గ్రహింపవచ్చును. మొదట కల్యాణవేది నిర్మాణము (మణవరై). దీనిపై వధూవరులను గూర్చుండబెట్టి వివాహము జరుపుదురు. గృహాద్యలంకరణము, లగ్ననిశ్చయము, నూతనవస్త్రము నొసంగుట, వధువుకు పుష్పమాల నిచ్చుట (మణమాలై), పుణ్యతీర్థములను గొనివచ్చుట, రక్షాబంధనము, దీపారాధనము, యువతులు కలశములను గొనివచ్చుట, వాద్యములు మ్రోగుచుండ వివాహమండపముక్రింద వరుడు వధువుపాణిగ్రహణము చేయుట, అగ్నిహోత్రమునకు ప్రదక్షిణము, సప్తపది, లాజహోమము, కుంకుమ చందనాలంకరణము, ఊరేగింపు, స్నానము. 'అగనానూరు' అను ప్రాచీనతమిళగ్రంథమునుబట్టి యీవిషయములు తెలియవచ్చుచున్నవి. ఇందు తాళికట్టుట ప్రత్యేకముగా జెప్పబడలేదు. కాని 'పురనానూరు' అను గ్రంథములోని 'ఈగై అరియఇళైఅ'—'(ఇతరులకు) ఇచ్చుటకు వీలుగాని తాడు' అను సందర్భములనుబట్టి చూడగా మొదట (పిల్లలకుగూడ కట్టబడుచుండుటచే) రక్షాబంధనముగా నుండిన యీ 'తాళి' అనునది కాలక్రమమున వివాహచిహ్నమయినదా యని తలంపవలసి వచ్చుచున్నది. క్రీ. శ. ౧౦,౧౧ శతాబ్దములందలి జీవకచింతామణి, నన్నూల్ మొదలగు గ్రంథములలో 'తాళి' యనునది వివాహచిహ్నముగనే గ్రహింపబడుచువచ్చినది. ఇంతకు ప్రాచీనమే యగు 'శిలప్పదికారము' అనే తమిళకావ్యములో 'తాళి'శబ్దము లేదు గాని దీనికి పర్యాయ మనదగిన 'మంగళఅణి' శబ్దము కలదు. ఇది మంగళసూత్రపర్యాయమే. వివాహవిషయమున దక్షిణదేశీయు లవలంబించుచున్నది బోధాయనాపస్తంబాదుల గృహ్యసూత్రపద్ధతి యని సామాన్యముగా జెప్పబడుచున్నను, అందు జెప్పబడిన విషయములలో దక్షిణదేశీయసంప్రదాయము లేమైన చేరినవో లేదో కనుగొనుట సుసాధ్యముగ లేదు. కాని వీరి పద్ధతిలో ప్రధానవిషయములు అర్ఘ్యము, మధుపర్కము*, అగ్నిముఖము, పాణిగ్రహణము, హోమము, అశ్మస్థాపన, లాజహోమములు, పిదప ఉద్వాహము.† స్వగృహప్రవేశము, వాగ్యమధ్రువారుంధతీదర్శనము, వ్రతస్వీకారము, పక్వహోమము, స్థాలీపాకము, పంచమదినమందు నాపితకర్మ,గర్భాధానము—ఇదియే బోధాయనాపస్తంబుల వివాహపద్ధతి. దీనిలో నెచ్చటను మంగళసూత్రధారణము గాని, వధూవరుల నడుమ తెరపట్టుట, తలంబ్రాలు పోయుట, నాకబలి మొదలగునవి గాని లేవు. ఇవన్నియు దేశీయాచారములే కావచ్చును. మంగళసూత్రధారణము, తెరపట్టుట దక్షిణదేశమందంతట నున్నట్లున్నది. వధూవరులొండొరులు శిరముల తలంబ్రాలుపోయుట ఆంధ్రదేశీయాచారమమాత్రము కావచ్చును. కాని వధూవరుల శిరస్సులపైని వృద్ధస్త్రీపురుషు లార్ద్రాక్షత లుంచుట దక్షిణదేశమందంతటను కలదు. అక్షతలేకాక దోసె

---

*ఆకాలమున 'గో'సహితముకూడ గాబోలును. "వివాహే గౌః సన్నిధాప్యా. గృహేషు అన్యా సన్నిధాప్యా. ఏతన్మధుపర్కద్వయమపి వివాహాంగం తయా వర మతిథివ దర్హయేత్. ఏతావ ద్గోరాలంభనస్థాన మతిథిః పితరో వివాహశ్చ"

† ఇదియే వివాహమైనది. అనగా (ఉద్-వహనము= వివాహము) పితృగృహమునుండి తనయింటికి రథము మీద నెక్కించి తీసికొనిపోవుట. (అథ ఏనాం పితురంగా దుద్వహతి, హస్తేన గృహీత్వా స్వరథ మారోప్య స్వాన్ గృహా నానయతి.—బోధా)

ళ్లతో బియ్యమును పెండ్లికి వచ్చిన ముత్తైదువ లందరు వధూవరుల శిరస్సులపై బోయుటయు కలదట. ఆర్ద్రాక్షతారోపణమును శ్రీనాథుడు దమయంతీవివాహసందర్భమున వర్ణించియున్నాడు. కాని యిది కాళిదాస కుమారసంభవకథలోనే వర్ణింపబడియున్నది. విధివిహితపాణిగ్రహణోపచారము లైనవెనుక నాపార్వతీపరమేశ్వరులు వృద్ధజనాభివాదప్రత్యభివాదనానంతరము —

"క్లృప్తోపచారాం చతురంత వేదిం
తౌ వేత్య పశ్చాత్ కనకాసనస్థౌ,
జాయాపతీ లౌకిక మేషితవ్యం
ఆర్ద్రాక్షతారోపణ మన్వభూతాం"

చతురశ్రమండపమునకు వచ్చి కనకాసనమున గూర్చుండి, లోకాచారసిద్ధమును, కావుననే బంధువులచే నభిలషణీయము నైన ఆర్ద్రాక్షతారోపణము ననుభవించెనట. దీనినిబట్టి యిది వైదికాచారసిద్ధము కాదనియు, లౌకికాచారమే యనియు వ్యక్తమగుచున్నది. ఇందలి మండపనిర్మాణముకూడ లోకాచారసిద్ధమే యని 'క్లృప్తోపచారాం' అను విశేషణవ్యాఖ్యానసందర్భమున 'వివరణ'కారు డిట్లు వ్యక్తము చేసినాడు: "క్లృప్తా రచితా ఉపచారాః పూర్ణకుంభాదయః యస్యాం,గంధోదకప్రోక్షణ పుష్పమాలాలంబన పూర్ణకలశాదిభి రలంకృతే చతుష్కోణమండపే" దీనినిబట్టి చతుష్కోణమండపరచన, అందు పూర్ణకుంభాదుల నుంచుట, అందాసీనులగు వధూవరులపై నార్ద్రాక్షతారోపణము లౌకికాచారసిద్ధము లని కాళిదాసునాటికే తలంపబడుచున్న వని తెలియుచున్నది. పెండ్లికి ప్రత్యేకముగా పచ్చనియాకుల పందిరిమండపము రచించుట, అందు ఐరేని (పూజ) కుండ లుంచుట, వృద్ధస్త్రీలు వధూవరుల తలలపై పుణ్యోదకములను జల్లి అక్షతల నుంచుట మొదలగు నాచారములు వైదికేతరములుగా గనబడుటచేతను, తాళికట్టుటతోపాటు దక్షిణదేశముననే ఎక్కుడు ప్రచారములో నున్నట్లగపడుటచేతను ఇవి దేశీయములే కాక దక్షిణదేశీయములుగూడ కావచ్చు నని తలంప దగియున్నది. మండపరచనాదికముతోపాటు ఆర్ద్రాక్షతారోపణము శ్రీనాథుడు దమయంతీవివాహసందర్భమున వర్ణించినను కొన్నివిషయముల కాళిదాసు ననుకరించిన నన్నిచోడుడు పార్వతీవివాహసందర్భమున వీనిని తన కుమారసంభవకథలో వర్ణించియుండ లేదు. పరమేశ్వరునిపై నితరులచే నక్షతల వేయించు టుచితము కాదని యేమో. ఈశ్వరపారమ్యమును ప్రతిపాదింపదలచినవాడగుటచే నతడు కాళిదాసువలె వధూవరులచేతనే బ్రహ్మకు ప్రమొక్కించుట (ప్రణేమతుస్తౌ పితరౌ ప్రజానాం పద్మాసనస్థాయ పితామహాయ), అతనివలన "కల్యాణి, వీరప్రసవా భవ" అను నాశీర్వాదమును చేయించుట మొదలగు విషయములను వర్ణించియుండకపోవచ్చును. కాళిదాసు చెప్పిన ఈ లౌకికాచారముల నతడు వర్ణింపకపోయినను మన్మథపునరవతరణము నాధారముగా జేసికొని మన్మథోత్సవమును, వసంతోత్సవము నతి చమత్కారముగా వర్ణించినాడు. ఇది పెండ్లియైదవనాటి యాచారముగా మన దేశమున నున్నను తరువాతి కవు లెవ్వరు వర్ణించిన ట్లగపడదు. మఱియు వధూవరుల నడుమ తెరపట్టుట, లగ్నసమయమున బరస్పరావలోకనమునకై దానిని దించుట యను నాచారము నీతడు ప్రత్యేకముగా వివాహసందర్భమున దెలుపకపోయినను పార్వతి యలంకరించుకొని వివాహమండపమునకు వచ్చు సందర్భమున కండవడము వెల్వడివచ్చినట్లు వర్ణించినాడు.

"ననిచిన కల్పవల్లి మది
నాగగతిన్ నడపాడివచ్చెనో
యన జనుదెంచె గండవడ
మల్లన వెల్వడి బాలికాలితో
ఘనపటలంబు వెల్వడు వి
కాసితతారకసంభృతేందుతో
ఖనయము గ్రేణిసేయుచు న
గప్రియనందన చెన్నువింతగాన్"

తిక్కన భారతమున నుత్తరా వివాహసందర్భమునను, రంగనాథరామాయణమున సీతావివాహసందర్భమునను తెరబట్టుట,తలంబ్రాలుపోయుట మొదలగు దేశీ

యాచారములు వర్ణింపబడియున్నవి. కాని వీ రెవ్వరు మంగళసూత్రములనుమాత్రము వారు వర్ణించిన వివాహములలో గట్టించలేదు. వీరి కాలమునకు మన దేశమున నియాచారము లేదనవచ్చునా? గౌరనకాలమునకు చంద్రమతి కుత్తుకను మినకున్నట్లు తెలిసికొనియున్నాము. శ్రీనాథుడు దమయంతిపెండ్లిలో వివాహదీక్షాకంకణము చేతులకు గట్టించినాడు గాని, ఆమె కుత్తుకకు మంగళసూత్రమును గట్టించలేదు. కాని కాశీఖండములో (౩ ఆ.)

“ పంచవదనుని కను తీవురించనేని
తత్క్షణమునంద యముయాండ్ర త్రాళ్లు తెగవె”

అని ‘యాంధ్ర త్రాళ్లు తెగుటను’ గూర్చి చెప్పియుండుటచే నా కాలపు టాండ్రకు మంగళసూత్రధారణ మాచారమే యనుట నిశ్చయము. కావున నాంధ్రసారస్వతములో గల వివాహవర్ణనలలో నొలుత మంగళసూత్రములను గట్టించినవాడు పెద్దనయే యన వలసియున్నను, ఈ యాచార మంతకు చిరపూర్వమే దేశమున వ్యాప్తియం దుండెననుటకు మాత్రము సందేహములేదు. దీనినిబట్టి ఆయాకాలములందలి జనుల జీవిత పద్ధతులు, ఆచార వ్యవహారములు మొదలగునవి యప్పటి కవుల కవితాదృక్పథములకు గోచరించిన రీతినే సారస్వతప్రపంచమున వెలయుచుండు నను విషయమును గూడ మనము మెలకువతో గుర్తింపవలసియున్నది. తదనుగుణముగనే యాసారస్వతమున బ్రతిఫలించిన జాతీయ జీవితచరిత్రమునుగూడ బరిశీలించి తెలిసికొన వలసియుండును.

[సశేషము]



# శాకుంతల విమర్శనము

## ౨. పద్య రచనము

= శ్రీ నండూరి బంగారయ్య =

నాటకములలో పద్యము లుండరాదని వాదించువారి సంఖ్య నానాటి కధికమగుచున్నది. బెర్నార్డుషా ఈ వాదమునకు గురుపీఠము. షేక్స్పియరు మొదట పూర్ణముగ పద్యములతోడనే నాటకరచన సాగించినను రానురాను గద్యపద్యమిశ్రితము లగు నాటకములను రచించెను. సంస్కృతమున నున్న నాటకములుగూడ గద్యపద్యమిశ్రితములే.

కవిప్రతిభ నిరవధికము. కేవలము గద్యములోనే వ్రాయవలె ననికాని, కేవలము పద్యములలోనే వ్రాయవలె ననికాని, లేక మిశ్రరచన చేయవలె ననికాని అనుశాసించుటకు ఎవ్వరికిని అధికారము లేదు. అది ప్రతిభాశాలియగు కవికే వదలివేయుట యుక్తము. ఎక్కడను ఒక్క వచనమైన లేకుండ నున్న గ్రీకు నాటకములును ఎంతో రమణీయములుగ నున్నవి. ఎక్కడను పద్యమునకు ప్రసక్తియే లేకుండ రచించిన **Doll's House** (బొమ్మరిల్లు)వంటి నాటకములును మనోహరముగ నున్నవి. గద్యపద్యమిశ్రితములగు షేక్స్పియరు, కాళిదాసు, శూద్రకుడు మున్నగువారి నాటకములును హృదయంగమములుగ నున్నవి. కవిప్రతిభను పురస్కరించుకొని కావ్యము లారాధ్యము లగునుకాని అవలంబించిన నీమములనుబట్టి ఏగ్రంథమును ఎప్పుడును గానేరదు. "అయ్యా, నేను ఒక్క స్వగతమైన నా నాటకమున వ్రాయలేదు, ఒక్క పద్యమైన జొప్పింపలేదు. అందుచే మీరు నా నాటకమును శిరసావహింపవలసియుండును" అని వాదించు రచయిత ఎవ్వరు నుండరనుకొందును. ఉన్నను అట్టి వారికి చెప్పవలసిన సమాధాన మిది: "నీవు కాగితము మీద కలమే పెట్టకపోయినచో ఈ వ్రాసినదికూడ వ్రాసియుండకపోదువుగదా! అప్పుడు నిన్ను మరింతగ శిరసావహించియుందుమే" అని.

### ప్రజాదరణ

తాత్కాలికోద్రేకములు ఎట్లున్నను మొత్తము మీద గద్యపద్యమిశ్రితములగు నాటకములకే అధికముగ ప్రజాదరణమును, సహృదయామోదమును లభించుచున్నవి. గాఢముగ నాలోచించినచో నట్లు లభించుటే యుక్తమని తోచుచున్నది. కొంతకాలము స్థానమున, అస్థానమున పద్యములు రచించిన నాటకములకు విసిగి నాటకమున పద్యములే లేకుండిన బాగుండు ననియు, అట్లే తొట్టివైద్యపు పథ్యమువలె చప్పిడివచనములతో నిండిన నాటకములు చూచి నాటకమంతయు పద్యమయముగనే యుండిన బాగుండు ననియు అప్పుడప్పుడు వినుగుదలచే తోచవచ్చునుగాని నిబ్బరముగ నాలోచించినచో నాటకమున పద్యమును పదభ్రష్ట మొనరింపవలె నని చేయు ప్రయత్నము అవివేకజనితమని యొప్పుకొనకతప్పదు.

### నాట్యశాస్త్ర నిర్దేశము

మనకు లభ్యములయినంతలో ప్రాచీన నాట్యశాస్త్రము లెవ్వియును నాటకమున పద్యప్రయోజనమును నిరూపించినట్లు కానరాదు. కాని నాటకమున పద్యములుమాత్ర మవశ్య ముండదగిన వని యంగీకరించుచున్నవి. ఈ యంశమునుగూర్చి అప్పుడు వాదనయే లేకుండుటచే దానిని సమర్థింపవలసిన యావశ్యకత లేకపోయెనేమో!

## పద్యవైశిష్ట్యము

గద్యమునకు, పద్యమునకు గల గతిభేద మొకటి ముఖ్యముగ గమనింపదగినది. ఎంత కృతహస్తుడైన కవికైనను గద్యముకంటె పద్యము ప్రయత్నసాధ్య మనుట రెండవ విశేషము. చదువరికి పద్యము ముఖస్థ మైనంత సులువుగ గద్యము కాదు. ఈ రహస్యమును గ్రహించి ఇప్పుడు మనము గద్యములో వ్రాయు శాస్త్రములను పెక్కింటిని పూర్వులు పద్యములలోనే వ్రాసిరి. అందుమూలముననైన తమ గ్రంథములు కొంతవరకు శాశ్వతముగ నిలచియుండు నను నమ్మక ముతో. ముద్రాయంత్రము వచ్చినవెనుక అట్టి శ్రమ యనావశ్యక మైనది.

## అస్వాభావికములు కావు

ప్రాచీనాలంకారికులను చక్కగ పరిశోధించిన వారికి నాటకమున పద్యములు అస్వాభావికము లని యంగీకరించుటకు వలనుపడకున్నది. మీదుమిక్కిలి అవి అత్యంతస్వాభావికము లని యంగీకరింపవలసి యున్నది.

యథార్థవాదులకును (Realists), ఆదర్శవాదుల కును (Idealists) నేడు పశ్చిమఖండములలో నడచు చున్న వాఙ్మయయుద్ధములను కావ్యరసమునకు, లోక రసమునకు గల విభేదమును నిరూపించి పూర్వా లంకారికులు ఏనాడో పరిహరించిరి. కాని మన యువకులు సంప్రదాయమును వీడి పాశ్చాత్యరచయితల పాదసేవయే ప్రధానముగ జేసికొనుచుండుటచే మన దేశమున నేడుగూడ ఇట్టి విపరీతవాదము లింకను విన బడుచున్నవి.

పద్యము లుండవలె నను వారి వాదముపై నొక పెద్దబాంబు వేయుచున్నా మనుకొని "ఎవరైన పద్య ములలో నేడ్చెదరా?" యని కొందరు బుద్ధిమంతులు ప్రశ్నించుచున్నారు. ఈ ప్రశ్నకు సమాధానము మరి యొక ప్రశ్నయే. "ఎవరైన వచనములోమాత్ర మేడ్చె దరా?" ఏడుపు ఏడుపే. అది వచనములోను గాదు; పద్యములోను గాదు. కవి ఆ యేడుపునే తన నాట కములోనికి కాపీచేయవలసివచ్చినచో నది యెంత రసాభాసముగ నుండునో యూహింపుడు. లోకమున పిల్లవాడు పోవగ నేడ్చుచున్న తల్లియొద్ద నొక్క నిముషమైన నిలువలేము. అదే యభిమన్యుని మరణము సందర్భమున సుభద్రావిలాప మయినచో పదేపదే చదివి యానందింతుము. కావ్యరసమునకు, లోకరస మునకు గల తారతమ్యమే యది. లోకరసములో నున్న జుగుప్సను పరిహరించి కవి యా భావముల నాస్వాదనయోగ్యముగ, ననగా కావ్యరసముగ మార్చు చున్నాడు. ఇట్లు కరుణరసమునకుగూడ ఆనందమే ప్రయోజన మగుచున్నది. కావ్యరసమునకు, లోకరసము నకు గల యీ విభేదమును గమనింపక షేక్స్పియరు, షా వంటి ఉపజ్ఞాశాలులే పెడదారులను ద్రొక్కుచు వచ్చిరి. కావ్యరసమును ఆస్వాదనయోగ్యముగ నొనర్చుటకును, కావ్యమునకు లక్ష్యమగు మహోర్థమును మానవహృదయములో గాఢముగ హత్తుకొనునట్లు చేయుటకును విదగ్ధుడైన కవి అనేకసాధనముల నవలం బించును. అందు పద్యరచనము, పదరచనము ముఖ్యము లయినవి.

ఉత్తమ మానసికస్థితిలో భావములు తమంతి తాముగ నొకవిధమయిన గతివిభేదముతో నుదయిం చును. దీని కొక చిన్న యుదాహరణ: "నీవు బజారు నకు పోవుదువా?" "ఆఁ." "పాపము పొరుగింటి వారి పిల్లవాడు పోయినాడటరా?" "ఆ." రెండింటి లోను ఉచ్చరించునది "ఆ" యను నక్షరమే. కాని ఎంత స్వర (గతి) భేదముతో నుచ్చరింపబడుచున్నది? మనస్సు రసార్ద్రి మయినప్పుడు మాటకుగూడ గతి భేదము తప్పదు. ఈ రహస్యమునే యింకను సూక్ష్మ ముగ పరిశీలించినచో వేదములు మున్నగు మహోత్తమ వాఙ్మయము స్వరప్రధాన మెందులకు కావలసివచ్చినదో విశదము కాకపోదు. ఈ స్వరప్రాధాన్య సిద్ధాంతములో నున్న సత్యమే పద్యరచనమునందును, పదరచనమునందును గానవచ్చుచున్నది. మనస్సు భక్త్యావేశమున తన్మయ మయినపుడు పాటలు తమంత తాముగ భక్తుని నోటినుండి యుదయించును. అదివర లో నేమియు విద్యాగంధము లేని తుకారామువంటి భక్తు లొక్కమారుగ వేనకువేలు 'అభంగము' లకు

కర్త లయిరని వినుచున్నాము గదా! పద్యము లస్వాభావికములని వాదించువారికి స్వభావమన నేమో తెలియదని చెప్పవలసివచ్చును. పాము కరచినవానికి వేపాకు తియ్యగ నుండునట్లు, పైత్యించినవానికి పంచదార చేదుగ నుండునట్లు విపరీత విమర్శకులకు నాటకమున గద్యము సహజము, పద్యము అసహజము అనిపించుచుండును.

## స్థాయిత్రయము

పరిశోధించినచో నాటకమునందలి భావసంచరణమునకు ముఖ్యముగ మూడు 'స్థాయిలు' కనుపించుచున్నవి. సంగీతమునందువలెనే దీనిని మనము మంద్ర మధ్యమ తారక స్థాయిలని పేర్కొందము. వ్యవహారకాండకు, కేవల కథానిర్వహణకు సంబంధించిన సంభాషణ మంతయు మంద్రస్థాయిలోనిది. ఈ స్థాయిలో పద్యములకు ప్రసక్తి యుండదు. మొట్టమొదట రచించిన Comedy of Errors మున్నగు నాటకములలో నీస్థాయిలో కూడ షేక్స్పియరు పద్యము లుంచినాడు. కాని కాళిదాసునాటకములలో మాత్ర మీ స్థాయిలో నెక్కడను పద్యములు కానరావు. ఇక రెండవస్థాయి మధ్యమస్థాయి. ఈ స్థాయిలో భావము ద్రవీభూత మగుచుండును. కథానిర్వహణము కంటె రససంచారమే ప్రధానము. ఇట్టి స్థాయిలోనే కాళిదాసుపద్యము లన్నియు నున్నవి. ఈ స్థాయిని మనము మరల రెండు భాగములుగ చేసికొనవలసియున్నది: (౧) ద్రుతావస్థ, (౨) ద్రుతతరావస్థ. ద్రుతావస్థలో పద్యములు ప్రయోజనకారులగుచున్నవి. ద్రుతతరావస్థలో పద్యములలో నున్న లయ సరిపోదు. ఇందు భావ మింకను ఆర్ద్రమయి ద్రుతతర గతి నందును. అందుచే పదములు (కీర్తనలు) కావలసివచ్చుచున్నవి. ఇక్కడ సాహిత్యము లాస్యమునకో తాండవమునకో యనుగుణముగ నున్నగాని భావసంచారము నెరవేరదు. విక్రమోర్వశీయము చతుర్థాంకము తిలకించితిమేని ఈ యంశము విస్పష్టము కాగలదు. ఊర్వశీవియోగమున నున్మాదమును ప్రాపించిన రాజు అవస్థను ప్రదర్శించుటకు 'చర్చరీ' మున్నగు నృత్యప్రధానములగు ప్రక్రియలు కావలసివచ్చినవి. భక్తుల భక్తికూడ ఉద్రేకావస్థను ప్రాపించినపుడు కీర్తనలుగాని, కృతులుగాని ప్రవేశపెట్టి తదనుగుణముగ నృత్యమున కవకాశ మీయవలసియున్నది. ఇట్టి ప్రక్రియల నన్నిటిని భరతనాట్యశాస్త్రము పూర్ణముగ నామోదించుచున్నది. ఇక మూడవది తారకస్థాయి. ఈ స్థాయిలో భావము మాటల కందదు. హిమరేఖను (Snow-line) దాటిపోవుచుండును. ఇది రసమునకు ఉత్కంఠదశ. ఈ దశలో భావశబలత, భావసంఘట్టనము సహజములు. అందుచే కవి ఈ దశలో పద్యమును వాడక భావశబలతకు అనుగుణముగ సంక్షిప్తముగు వచనమునో, అసమాపకములగు వాక్యములనో, లేక పూర్ణమగు మౌనమునో పాత్రముచే నాశ్రయింపజేయును. "'హా' యను 'ధర్మరాజతనయా' యను" అని ద్రోణపర్వమున నర్జునవిలాపమున నున్న తిక్కనగారిపద్యము ఈ తారకస్థాయికి చక్కని యుదాహరణము. "భగవతి వసుధే దేహి మే వివరమ్" అను పంచమాంకములోని శకుంతలావాక్యము కూడ ఈ తారకస్థాయికి చెందినదే. ఇక్కడ శకుంతలకు దుష్యంతునితో నిక వాదించి లాభము లేదని తోచినది. అప్పుడుదయించిన అగాధమగు నిస్పృహను ప్రదర్శించుటకు—అనగా తారకస్థాయిలోని భావసంచారమును ప్రదర్శించుటకు— కాళిదాసు "భగవతి వసుధే" అను నొక్క వాక్యమును మాత్రమే సాధనముగా గైకొనుచున్నాడు.

## శాకుంతలములోని పద్యరచనాప్రాగల్భ్యము

వచనమును, పద్యమును ప్రయోజనమును గుర్తించి ప్రయోగించుటలో కాళిదాసు షేక్స్పియరు కంటె కుశలుడు. నాటకీయ పద్యరచనమునకు శాకుంతల ముత్తమనిదర్శనము. ప్రత్యేక ప్రయోజనమును నిరూపింపనిదే శాకుంతలమున నెక్కడను పద్యము రచింపలేదు. భావము మంద్రస్థాయి వదలి మధ్యమస్థాయిని ప్రాపించినపుడే పద్యము గానవచ్చుచున్నది. తగినంత రససాంద్రత, ఉన్నతభావము లేనపుడు పద్యము రచింపబడుట లేదు. ఒకొక్కప్పుడు లోకానుభవమును పురస్కరించుకొని మానవస్వభావమును మథించి తీసిన యమూల్యరహస్యములను నిక్షిప్త

మొనర్చుటకు గూడ, బంగారునగను దాచుటకు దంతపుబరిణి నుపయోగించినట్లు, కాళిదాసు పద్యము నుపయోగించుచున్నాడు.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి య త్సుఖితోపి జంతుః
త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని."

శాకుంతలము నెంత తీవ్రముగ పరిశోధించినను "ఇక్కడ పద్యమునకు మారు వచన ముంచవలసినది" అని కాని, "ఇక్కడ వచనమునకు మారు పద్య ముంచ వలసినది" అనికాని వ్రేలుపెట్టి చూపుట కవకాశము గానరాదు.

## సౌలభ్యము

శాకుంతలపద్యరచనయందు గానవచ్చు విశిష్ట లక్షణములలో సౌలభ్య మొకటి. నాటకీయపద్యరచనమునకు సౌలభ్యము ముఖ్యముగ నుండదగినది. శ్రవ్యప్రబంధములలో నైనచో చదువరి పద్యమును పునఃపునః పఠించుకొనుట కవకాశముండును. దృశ్యములలో చెవిని బడినంతనే పద్య మర్థముకావలసియున్నది. అయితే కొన్నికొన్ని రసములందు ఓజోగుణప్రధానమైన శైలి వాడవలసివచ్చునే యని ప్రశ్న రావచ్చును. రౌద్రరసము, భయానకరసము సంచారముగావింపవలసివచ్చి నపుడు సమాసపూర్ణమగు శైలి యావశ్యకమగుట లేదా? ఆ సమాసములుగూడ భావమును పరిపోషించునవి యగుటచే ఎంత చదువురాని ప్రేక్షకునికైన రససంచారముగాకుండ మానదని సమర్థింపవచ్చును. అయినను దీర్ఘసమాసముల మూలమున భావమును పోషించుకొనుటకంటె వీరరౌద్రభయానకాదిరసములలోగూడ సులభమైన భాష వాడియే భావమును పోషించుకొనుట ఉత్తమకవిలక్షణము. ప్రకృతము శాకుంతలము శృంగారరసప్రధాననాటకముగావున శైలియందలి సౌలభ్యము దాని కమూల్యాలంకార మగుచున్నది. అన్వయకాఠిన్యము మచ్చునకైన నీపద్యములలో గానరాదు.

పద్యము లన్నియు రససాంద్రములు. ఇటీవల తెనుగున బయలువెడలు నాటకములు కొన్నిటిలో ధారాశుద్ధి, సౌలభ్యము, ప్రసాదము మున్నగు గుణము లున్నను రససాంద్రత లేకపోవుచున్నది. నాటక మంతయు బంగారపునగవలె నుండవలెను. అందు యథోచితముగ రచించిన పద్యములు రత్నములవలె నుండవలెను. ఒక్కొక్క పద్యమున ప్రత్యేకముగ నెంతో చెక్కడపుబని, అలంకారపుష్టి లేనిదే కాళిదాసు పద్యమును రచింపడు. శాకుంతలమున పద్యశైలి, వచనశైలి రెండును మృదువులే యయ్యును పద్యశైలికి విశిష్టలాలిత్య మున్నది.

## సమీకరణము

శాకుంతలపద్యరచనమునుండి నవీననాటక కర్తలు నేర్చుకొనదగిన ఇంకొక ముఖ్యలక్షణము 'సమీకరణము' అనునది. ఇటీవల కొందరు సుప్రసిద్ధనాటక కర్తలుగూడ-పిండివంటను ముందుగ సిద్ధముచేసికొని తరువాత సామాన్యభక్ష్యములను వండుకొనునట్లు-నాటకమునం దక్కరకువచ్చు పద్యముల నన్నిటిని ఒకేదిగిని ముందుగ రచించుకొని తరువాత సంభాషణలు నిర్వహించుకొనుచు ఆయాస్థానములందు పద్యముల నదుకుకొనుచున్నారు. లేదా నాటకమునంతను ముందు వచనములో రచించి తరువాత ఉచితముగ నుండునని తోచిన స్థలములలో పద్యములను జొప్పించుచున్నారు. అట్లు చేసినచో 'సమీకరణ' మను గుణమునకు భంగము కలుగును.

సాధారణసంభాషణము వచనములో నడచును గదా. పద్యము అనునది పైకిలేచు పర్వతశిఖరము వంటిది. ఈపర్వతమునకు సమీపమున నున్న వచనములు—అనగా పద్యమునకు ముందును, వెనుకను ఉన్న వచనములు— పర్వతసానువులవలె నుండి పర్వతము యొక్క level (మట్టము)తో హత్తుకొనవలెను. పద్యమునకు ముందున్న వచనము పద్యముయొక్క మట్టము(level)నకు ఎగబ్రాకుటకు సాయము చేయవలయును; పద్యమునకు వెనుకనున్న వచనము పద్యమునుండి దిగబ్రాకుటకు సాయముచేయవలెను. ఈ రహస్యమును గమనింపకయే తెనుగునాటకములలో సర్వసాధారణముగ పద్యరచనము సాగుచున్నది. అయితే ఒక్క యిబ్బందినికూడ మనము గమనింపవలసి

యున్నది. సమర్థుడైన కవికిగూడ వచనధోరణిలో నున్నపుడు పద్యములు రచించుటయు, పద్యధోరణిలో నున్నపుడు వచనము రచించుటయు క్లేశసాధ్యమో, అసాధ్యమో యగుచుండును. నాటకరచనమున నున్న బాధయే యిది. వచనముపైని, పద్యముపైని ఒకేతరగతి స్వాతంత్ర్యమున్న సవ్యసాచులకు దక్క శాకుంతలము వంటి నాటకరచనము సాధ్యముగాదు.

పైని వివరించిన 'సమీకరణము' అను గుణమునకు శాకుంతలములోని అన్ని పద్యములును ఉదాహరణములే. అయినను ప్రతిపాద్యవిషయము విస్పష్టమగుటకు ఒక్క పద్యమును గైకొందును.

"ప్రత్యాదిష్టవిశేషమండనవిధి
ర్వామప్రకోష్ఠార్పితం
బిభ్రత్ కాంచన మేక మేవ వలయం
శ్వాసోపరక్తాధరః
చింతాజాగరణప్రతాంతనయన
స్తేజోగుణా దాత్మన
స్సంస్కారోల్లిఖితో మహామణిరివ
క్షీణోపి నాలక్ష్యతే."

ఉత్సుకుడయిన రాజువర్ణన మిది. ప్రత్యేకముగ చూచినను వర్ణనము మనోహరముగ నున్నది. కాని యీ వర్ణనమును నాటకమున స్థాపించుటలో కాళిదాసు చూపిన వైదగ్ధ్యము గమనింపదగియున్నది.

"కంచుకీ:–(రాజాన మవలోక్య) అహో, సర్వా వస్థాసు రమణీయత్వ మాకృతివిశేషాణామ్. తథాహి–ఏవముత్సుకోపి ప్రియదర్శనో దేవః."

అను వచనము పద్యమున కారోహణసాధనముగను,

"సానుమతీ:—స్థానేఖలు ప్రత్యాదేశవిమానితాపి అస్యకృతే శకుంతలా క్లామ్యతి"

అను వచనము పద్యమునుండి అవరోహణసాధనముగను ఉన్నవి. ఈ రెండు సాధనములును పద్యమునకు ఈడుజోడుగ నుండకపోయినచో ఆరోహణావరోహణములు సుకరములు గావు. "కూర్చుట నూత్నరత్నమునకున్ గనకంబునకున్ దగున్" అనినట్లుగ నాటకమునందలి పద్యరచన యంతయు సమీకరణ మందినది గావుననే శాకుంతలము జగత్తునందలి ఉత్తమనాటకములలో నొక్కటి యయినది. షేక్స్పియరు నాటకములలో—హేమ్లెటు మున్నగు నుత్తమనాటకములలో గూడ—ఒకొక్కప్పుడు ముప్పది పంక్తులు, నలువది పంక్తులు వరుసగా పద్యరచన యుండును. కాళిదాసులో నట్లుగాక వరుసగా రెండు పద్యములకంటె నధికముగ నుండవు. రెండు పద్యము లున్న తావులయినను మిక్కిలి యరుదుగ నున్నవి. ఇట్లుండుటవలన పద్యరచన మెక్కడను వినుగుపుట్టించుట లేదు.

## కాళిదాసు — తిక్కన

కాళిదాసుపద్యరచనమును, తిక్కనపద్యరచనమును పరిపోల్చి చూచినపుడు తిక్కనలో నొక విశేషము పొడకట్టుచున్నది. కాళిదాసుశాకుంతలములో నేపద్యమును దీసికొన్నను "ఇది కాళిదాసుపద్యము" అని గుర్తించుటకు వీలుగ నుండును. శకుంతలనోట నుంచిన పద్యములయినను, దుష్యంతుని నోట నుంచిన పద్యములయినను, కణ్వుని నోట నుంచిన పద్యములయినను అన్నిటిమీద నొకే ముద్ర కనిపించుచున్నది. అనగా పద్యరచనములోని శైలికి Subjectivity పోయి పూర్ణమయిన Objectivity సిద్ధింపలేదు. ఇంకను తాదాత్మ్యసిద్ధిలో కొంత లోప మున్నదా యని సంశయింపవలసి వచ్చుచున్నది. తిక్కనరచనములో నట్లుగాక పాత్రమునుబట్టి పద్యశైలి మారిపోవుచుండును. ఒకేపాత్రమైనను మొదటినుండి చివరవరకు ఒకేశైలిలో మాటాడదు. భావోద్వేగమును పురస్కరించుకొని ఒకే సందర్భమున ఒకే పాత్రముపయోగించు పద్యశైలిలో నెన్నియో గమనభేదములు కానవచ్చుచున్నవి. ఇది భీష్ముని శైలి, ఇది కర్ణుని శైలి, ఇది యశ్వత్థామ శైలి యని గూనవాలు పట్టుటకు తగిన విస్పష్టలక్షణ

ములతో పూర్ణముగ పాత్రముతో తాదాత్మ్యసిద్ధి వహించి యాతని పద్యరచనము ప్రకాశించుచున్నది. ఇది నాటకీయపద్యరచనమునకు పరమావధియే కాని మహాకవులకుగూడ దుస్సాధ్యము. నాటకీయ పద్యరచనమున కుపయోగించు నిట్టి యద్భుతలక్షణము లెన్నో భారతమున గనవచ్చుచున్నవి. వానిని భారతవిమర్శనమున దీర్ఘముగ చర్చించుకొందము. ప్రస్తుత మీ సూచన చాలును.

---

## కలియుగాంత మెప్పుడు ?



సినిమా నటీమణులు తమ చర్మమును ఎట్లు
అందముగా యుండునట్లు కాపాడుకొనుచున్నది

# సాధనాబోస్ చెప్పుచున్నది

సినిమా నటీమణులు తమ చర్మమునుగురించి అలక్ష్యముగా యుండకూడదు. నాయొక్క చర్మమును నేను ఈ విధముగా కాపాడుకొనుచున్నాను. ఈ సబ్బువాడినయెడల చర్మము పరిశుభ్రముగాను నునుపుగాను యుండుట కష్టముకాదు. ఈ సువాసనగలిగిన సబ్బుయొక్క నురుగుచర్మ రంధ్రములనుండి మురికిని పోగొట్టి చర్మమును మృదువుగాను, యౌవనవంతముగాను చేయుచున్నది. మీయొక్క చర్మమును అందముగాయుంచుకొనవలయునన్న యీ కీర్తిగాంచిన నటీమణియొక్క మార్గమునవలంభించుడు. కీర్తిగాంచినసినిమానటులందరులక్స్టాయిలెట్ సబ్బునే ఉపయోగించుచున్నారని జ్ఞాపకముంచుకొనుడు.




# లక్సు టాయిలెట్ సబ్బు

LTS. 89-172 TL LEVER BROTHERS (INDIA) LIMITED



## మీ వెంట్రుకలను కాపాడుకొనే సాధనము

మీ వెంట్రుకలను కాపాడుకొనటం మీ చేతుల్లోనే వుంది... చాలా సులభం. కేశ మూలం పెరగటానికి చాలా తోడ్పడుతుంది. వాటి అందాన్ని కాపాడుతుంది—ఒక సీసా

### కామినియా నూనె (రిజిష్టర్డు)

ఆపని చేస్తుంది... సురపురానిది... దాని అద్వితీయమైన సువాసన — పేరుకు తగినట్లు పని చేస్తుంది.

### ఒట్టో డిల్ బహార్ (రిజిష్టర్డు)

అతి మనోహరమైన అత్తరు — అసాధారణమైనది. దానితో పోల్చదగినది యింకొకటి లేదు.

సోల్ ఏజంట్లు:—

**ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,**

బొంబాయి, 2. No. A

## మీ బిడ్డకు లివర్, స్ప్లీన్ (బల్ల) వ్యాధి యున్నచో



తదితర వైద్యశాస్త్రపు మందులు నిరుపయోగముగయుండిన సమయమందు, యీ భయంకరము లివర్, స్ప్లీను వ్యాధిని జయప్రదముగ నివారణకు తేగల్గినటువంటి ఒక అద్భుత చికిత్స, జమ్మి వెంకటరమణయ్యగారిచే కనిపెట్టబడిన, యీ ఔషధరాజము గత 30 సంవత్సరములలో, వేలకొలది వ్యాధిగ్రస్థ శిశువులను రక్షించి, భారతదేశ మందంతటనున్న సుప్రసిద్ధ వైద్యులచే మిక్కిలి కొనియాడబడినది.

జమ్మిగారి

# లివర్ క్యూర్

వాడుడు

అన్ని చోట్ల అమ్మబడును.

**జమ్మి వెంకటరమణయ్య & సన్స్**

మైలాపూరు, మద్రాసు.

హెడ్ ఆఫీసు: కుంభకోణం. బ్రాంచీలు:- కలకత్తా, బొంబాయి, బెంగుళూరు, తిరుచినాపల్లి, లక్నో, విజయనగరం.

# ఆ వాడిన ఆకులు

[ కథానిక ]

= శ్రీ శివరాజు వెంకటసుబ్బారావు =

( బుచ్చిబాబు )

ఎందుకో ఆ గులాబిమొక్కని చూసినప్పుడల్లా హృదయంలో వేళ్లు పాతుకున్నట్లు సూర్యకాంతమ్మ శరీరంలో నరాలు కదలిక మానుకుంటాయి. ఆ మొక్కని చాలా రోజుల కిందట ఆమె చెల్లెలి మొగుడు చంద్రకాంతం పంపించాడు. మొక్క వేళ్లైతే పాతుకుంది కాని ఎదుగూ పొదుగూ లేదు. ఎంత జాగ్రత్తగా పెంచినా లాభం లేకపోతోంది. ఆ మొక్క తాలూకు గులాబీని తల్లో పెట్టుకోడంకోసం చాలా రోజుల్నించి పూలుకొనడంకూడా మానేసింది. రాత్రంతా దాన్నిగురించే ఆలోచనలు, కలలు. సూర్యోదయంకోసం ఎదురుచూస్తూ, ఆలోచిస్తూ, ఆవులిస్తూ, భర్తగుర్రుని పరీక్షిస్తూ, నిద్రలేక మొహంవాపుతో, కళ్ల మత్తుతో దొడ్లో కొచ్చి, ఎం తెదిగిందో చూసేసరికి, అంతే వుంది—ఎదుగూ లేదు, పొదుగూ లేదు. రోజూ ఉదయం గంటసేపైనా దానికోసం బాధపడడం ఆమెకి అలవాటైపోయింది. ఆ వాడిపోతూ, జీవలేకపోతున్న లేత ఆకులు అతని నిద్రతో బరువెక్కి, బద్ధకించి వాలిపోయిన కనురెప్పలలోని స్థిరత్వాన్ని స్ఫురింపచేస్తూ ఎంతకాలం ఆమెని కలవరపెట్టడం ?

"ఆ మొక్క పీకెయ్యించు. దాని కేదో జాడ్యం పట్టింది. అది పాకిందంటే మిగత మొక్కలుకూడా చస్తాయి తెలిసిందా? పంపినవాడు మంచివాడైతే అది నిక్షేపంలా ఎదుగును. మిగతావన్నీ బతకలా ? నీ చెల్లెలి మొగుకు తాలూకు విషం దానికీ పట్టింది." అని రెండుమూడు సార్లన్నాడు ఆమెభర్త బసవయ్య. ఈ గుడ్డి నమ్మకాన్ని గంటేసి శాస్త్రీయ సమ్మతమైన కారణం తెలుసుకోవాలని నవలలు చదవడం మాని, 'హార్టికల్చర్' గ్రంథాలు చదవడం మొదలెట్టింది. తోట్లోకి బసవయ్య చక్కా వొచ్చాడు. అతను బకాసురుడు లాంటి పెద్దగ్రహం. శరీరం ఆకారంలేని మాంసంముద్దలకి చర్మం తొడిగినట్లుగా వుంటుంది. జుట్టుకీ కనుబొమ్మలకీ మధ్య పరిహద్దులాగ కాస్తంత నుదురు. కనుబొమ్మలు పొదలా ఎదిగి చెవులదాకా పాకినట్లుంటాయి. కందిరీగ కుట్టినట్లుగా కుడికంటికింద వాపు. తేనెటీగల పట్టుమాదిరి అర్థంలేని వొంకరలు తిరిగి వృథాగా అల్లుకున్న క్రాపింగు. గాలికి వూగులాడే ముసిలివృక్షంకొమ్మలలాంటి చేతులు. నవ్వినప్పుడు నవ్వునే వెక్కిరించే వెడల్పుపెదవుల వెనక ఐక్యతలేని పళ్లవరస. ఇంటర్ కాగానే, భార్యలాగే చదువు చాలించి 'ఇన్స్యూరెన్స్' ప్రపంచంలో కృషిచేసినందుకు అధికారులు మెచ్చుకుని, తుదకి మేనేజర్ పదవి—దాంతో పాటు కారూ యిచ్చారు. ఆ కారుకి సరిపడ్డ నిండైన విగ్రహం.

"ఈ మొక్క యింకా పీకలా ? దీని కేదో పురుగట్టింది. మీ చెల్లెలిమొగుడిలో కుళ్లు దీనికీ పట్టుకుంది."

ఇట్లా చంద్రకాంతంపై భర్త ద్వేషం ప్రకటించటం ఆమెకి మొదటిసారి కాదు. అతనితో, ఎప్పుడో పెళ్లిలో తప్ప, బసవయ్యకి పరిచయం కూడా లేదు. లేమివల్ల జనించిన అసూయ బురదలా ఎక్కడపడితే అక్కడే వుంటుంది. భర్తద్వేషానికి అసూయ కారణం అవడానికి అవకాశాలు లేవు. చంద్రకాంతం గొప్ప హోదాలో లేడు; అతని కసలు ఉద్యోగమే

లేదు; అత నంత ఆస్తిపరుడూ కాడు; గొప్ప పండితుడూ కాడు - వొందలమంది మాదిరి అతనూ వో గ్రాడ్యుయేట్; కాంగ్రెస్‌లో పావలా మెంబరుకూడా కాడు. మరెందుకు ద్వేషం? భర్తమనస్సు కాంతానికి అర్థం కాలేదు.

"ఎప్పుడూ చెల్లెలి మొగుడేనా ? మీకు తోడల్లుడన్న విషయం మరిచిపోకండి. పాపం, అత నేం చేశాడు ? వాళ్ళ వూర్నించి ఎవరో వొస్తే యీ పూలమొక్కని మా చెల్లెలితో చెప్పి పంపించాడు." అంది సమర్థిస్తూ. కాంతం బ్రహ్మచారిగుండెలో తుపాను లేవగొట్టేటంతటి చక్కంది కాదుకాని, మాట్లాడేటప్పుడు ఆకర్షణీయంగా వుంటుంది. ఛాయ నలుపే - పూర్ణిమనాటి మెత్తటి, మెరిసిపొయ్యే నలుపు. మాటలతో ప్రకటించలేని భావాలని పెద్ద కళ్ళ కదలికలో చూపిస్తుంది. 'ప', 'వ', 'ఎం' మొదలైన గొంతుముందుభాగంలోంచి వొచ్చే అక్షరాలని వుచ్చరించినప్పుడు పెదవులు కొత్త పొందికని తెచ్చుకుంటాయి. మాట్లాడినప్పుడే ముక్కుపక్కని గీత బుగ్గని కెరటంలా లేవదీసి, తెరచాప చుక్కానీలాగ పెదవులకీ, బుగ్గకీ లయ కల్పుతుంది! మొహంలోని అమాయకత్వానికి నాజూకైన బట్ట, వేషధారణ కొంత కుటిలత్వం కల్పిస్తాయి. 'ప్రీమియమ్‌లు' 'బోనస్సులు' 'డివిడెండ్లు'—యీ లోకంలోంచి భర్తని విముక్తి చేసే శక్తి గులాబిమొక్కకి వుందని ఆమెకి తెలుసు. అదీ కొంత మెరుగే.

"తోడల్లుడని చెప్పుకోడం నాకు సిగ్గుగా వుంది. ఏదేనా ఉద్యోగంలో ప్రవేశించరాదూ?"

"అలా కడతాడుట. ఎదీ—మొన్ననేగా బి. ఏ. పూర్తిచేసింది ? అందరికీ పుట్టగానే ఉద్యోగాలొస్తాయా ?"

"లా కాదు, బల్లు. నా ఆఫీసులో గుమాస్తాపని కోసం లక్షమంది గ్రాడ్యుయేట్లు సిద్ధంగా వున్నారు. వీళ్ళంతా దేశానికి బరువుచేటు."

"అతని ఉద్యోగంసంగతి మన కెందుకు లెద్దూ? వాళ్ళ తంటాలు వాళ్ళు పడతారు" అంది కాంతం.

చంద్రకాంతాన్ని గురించి భర్త మాట్లాడడం తనకి కొంత సంతోషం యివ్వకపోలేదు. ఇన్స్యూరెన్స్ డబ్బామోతకంటె బోలెడు నయం. ఉద్యోగంలో పడ్డతర్వాత మొగాడికి ఆ ఉద్యోగంగొడవే. చంద్రకాంతంలాంటి నిరుద్యోగి ప్రపంచానికి అధికారి. వాళ్ళకి ప్రవర్తనాస్వేచ్ఛ, మానసిక వైశాల్యం వున్నాయి.

"మన కెందుకేమిటి—మనకే. ఫలానావారి ఆయన తోడల్లుడు సందులమ్మట తిరుగుతున్నాడంటే, నాకే నామర్దా. ఊరికే పగలంతా ఊరమ్మటా, రాత్రంతా సినిమాలచుట్టూ తిరిగి, వున్న రెండెకరాలూ సిగరెట్ల ద్వారా ఊదెయ్యడంబదులు నన్నడిగితే ఏదో తంటాలు పడి 'ఖాళీ' చెయ్యిస్తాను—నాఆఫీసులో గుమస్తాగా చేరడం మంచిదంటాను"

"ఇప్పుడు మిమ్మల్ని ఎవ్వరూ అడగలేదు. వెళ్ళండి, ఎవరో వొచ్చినట్లున్నారు" — అంతటి మనిషినీ తన గుప్పెట్లో వుంచుకుని, గాలిలో వూదెయ్యగలనని కాంతానికి తెలుసు. ఆ నమ్మకం ఆమెలోని ఆకస్మిక చైతన్యానికి, మార్పులకి కారణం.

భర్త బైటికెళ్లిన కారుచప్పుడైంది. కాంతమ్మ లోపలికొచ్చి హార్టికల్చర్ పుస్తకం బీరువామీద గిరవాటేసి, చెల్లెలిపెళ్లిఫోటో ముందు పెట్టుకుని కూచుంది. అందులో భర్త లేడు. ఆ కారణంచేతనే దాన్ని చూడడానికి యిష్టపడొచ్చు. అల్లా అనిపించినందుకు నీరసంగా నవ్వుకుంది. ఈ చంద్రకాంతంలో భర్త ద్వేషించేటంతటి విశేషం యేముందో తెలుసుకోవాలనుకుంది. పెళ్ళినాడే అతన్ని గురించి అంతా చిత్రంగా చెప్పుకున్నారు; తనూ ఎన్నో వింది; చెల్లెలికి ఏమీ తెలీదు, అమాయకురాలు. అడిగితే ఏమీ తెలీదంటుంది. ఈగాథల పుట్టుపూర్వోత్తరాలు భావికాలంలో మరుగుపడ్డాయి. వాటిని తవ్వితీసేందుకు ఎవ్వరూ—భర్తకూడా—సాహసించలేదు. ఈగాథల సారాంశం యేమిటి? అతను తుంటరి; చెడ్డవాడు; స్త్రీలోలుడు; నైతికనియమాలు లేవు; సంఘకట్టుబాట్లు, బాధ్యత మొదలే లేవు; రోగాల పుట్ట; మహాపాపి. వీటికి తార్కాణ అతను నిరుద్యోగి కావడమే. ఇవేవీ ఆమె అతనిలో చూడలేదు. ఆరోగ్య

అంతా అతని మొహంలోని వెలుగులోనే వుంది. అతని ముందు నిలబడ్డ కాసేపూ వాతావరణం చీకపై, మైమరుస్తారు. బుర్ర పని చెయ్యదు. అతనితో చెప్పేటందుకు మాటలు కనిపించవు. కుట్ర, కల్మషం, నీతి, సంఘం, మతం — అన్నీ వాటి నిరంతర యుద్ధాలని ముగించి, శాంతికోసం తడుములాడి, అతని నేత్రాలలో ఐక్యం అవుతాయి. అతను మితభాషి. గుర్రంపిల్లలోని శక్తిచాంచల్యం, మూగబలం — అన్నీ అతనిలో మూడగలిగింది. ఏవో పుస్తకాలు చదువుకునేవాడు; ఏవో బొమ్మలు గీసుకునేవాడు. సైకిలుమీద వెళ్లి రాత్రి పదింటికి వొచ్చేవాడు — అత్తారింట్లో. దరఖాస్తు పెట్టమంటే, నవ్వి సరే అనేవాడు కాని పెట్టేవాడు కాదు. తనకి తెలియకుండా అతన్ని ఆదర్శ పురుషుడుగా ఎంచుకుంది కాంతం. వెనక, ఆమె చెల్లెలు ఏదో బొమ్మ తీసుకొచ్చి "బాగుందా, మా ఆయన వ్రాశాడు" అంది. ఆబొమ్మ తనదే నని తెలుసుకుంది, నమ్మింది. "ఎవరే యీ బొమ్మ?" "నాదే" అంది చెల్లెలు. పిచ్చది. వెర్రిబాగుల్ది. ఎప్పుడో, ఎక్కడో తనకీ అతనికీ మూగబాంధవ్యం కుదిరి వుంటుంది. అతన్ని అర్థంచేసుకుంది. అర్థంచేసుకొన్న వాళ్లే అనుభవించడానికి అర్హులు.

భర్త అతన్ని గురించి చూపిన అసూయలోనూ, ద్వేషంలోనూ పేలవభావం, తాత్కాలికహాస్యం పైకివున్నా, వాటివెనక నిజమైన వుద్రేకం, 'కసి' వుంది. దానికి కారణం ఏమిటి? ఈ ఆలోచనలు ఆమెను బాధిస్తున్నా ఆబాధలో ఆనందంకూడా వుంది. కాని దానికి ఆకారం లేదు, పరిపూర్ణత లేదు. ఎవళ్లకీ చెప్పుకోడానికీ లేదు. అవి ఏకాంతాన్ని కోరతాయి; రహస్యాన్ని రాపాడతాయి. ఎంత కాలం యీ చీకటి, రహస్యం? ఆ మొహం ఆమెని పదేపదే కలవరపెట్టడానికి కారణం ఆమె దాని నిజాన్ని గురించి నిర్ధారణకు రాకపోవడం. ఏదో వోనిమిషం అనుకోడం, దాన్ని తోసెయ్యడం, బలవంతంగా మరిచిపోవడం, అది మళ్లా గంటలోనే వొత్తిడి కలిగించడం. సగం సగం సాగించిన ఆలోచనా, నిర్ధారణకు రాని కార్యం — యివి మనుష్యులని పీడించుకుతింటాయి. ఇందులో నించి బైటపడాలంటే బాధించే విషయాన్ని పూర్తిగా వొకేసారి బ్రద్దలు కొట్టడం వొక్కటే సాధనం. ఆఫొటోలోని మొహాన్ని బాగా పరీక్షించింది. దానిలోని లోపాలు, చెడ్డ లక్షణాలు ఏరి వల్లెవేస్తే అతని ప్రతిమ వొత్తిడికలిగించదు. గడ్డం బాగా లేదు: బుజాలు బాగలేవు. చెవు లేం బాగున్నాయి? మీసాలు తీసేసి — ఆడదానిలాగా — అసలు బాగలేదు. ఇది నిజం, దీన్ని గుండెకు నొక్కి, నిబ్బరంచేసుకోవాలి. కాంతం నిట్టూర్పు విడిచింది — ఎడారిలాగ మారింది మనస్సు. ఫొటో గోడని తగిల్చి, గూట్లోనించి హక్స్లీ రాసిన "ఆ వాడిన ఆకులు" అన్న నవల తీసింది. మళ్లా ఆకులు, వాడిపోవడం... తనమీద కోపం వొచ్చింది. బైట సాయిబు 'గులాబీ పువ్వులో' అని కేకవేస్తూ అమ్ముకుంటూ పోతున్నాడు. పుస్తకం గిరవాటెట్టి తలుపు తీసి, మళ్లా చప్పుడయ్యేటట్లు మూసింది. మళ్లా ఆమెమనస్సు ప్రాచీనశక్తుల వైషమ్యాలకి నిలయం ఐపోయింది.

* * *

చంద్రకాంతం భార్యని ఆస్పత్రిలో పరీక్ష చేయించడంకోసం విశాఖపట్నం రావల్సివచ్చింది. అక్కగారింట్లో దిగుదామని భార్య అతన్ని చంపుకు తింది. సంఘంలో తనకి స్థానం స్థిరపడేంతవరకూ బంధువులూ, మిత్రులూ లేరని అత నెంత చెప్పినా ఆమె వినిపించుకోలేదు. పైగా, అఉః రొస్తున్నారని తెలియగానే బసవయ్య తప్పకుండా వాళ్లింట్లోనే దిగాలని ఉత్తరం వ్రాసి, వొచ్చే సమయం తెలుసుకుని స్టేషనుకి కారుకూడా పంపించాడు.

భార్యని ఆస్పత్రిలో చేర్పించిన తర్వాత అతను రోజంతా అక్కడే గడిపేవాడు. డాక్టర్లు రోజుకి నాలుగు గంటలుమాత్రం భార్యదగ్గర వుండేందుకు వొప్పుకున్నా, ఎల్లాగో అక్కడే గడిపేసి, సాయంత్రం బీచివొడ్డున తిరిగి, క్లబ్బులో చీట్లాడి, రాత్రి పదిగంటలికి యింటికి చేరుకునేవాడు. అతనికి మేడమీద మూలగది ఇచ్చారు. భోజనాలదగ్గర మాత్రం అందరూ ఆస్పత్రిసంగతులు మాట్లాడుకునేవారు. భోజనం కాగానే బసవయ్య కారుమీద వెళ్లిపోతూ, చంద్రకాంతాన్ని ఆస్పత్రిదగ్గర దించేవాడు. ఇట్లా ఐదురోజులు గడిచాయి.

కాఫీ తీసుకుని మేడమీద, గదిలో కొచ్చింది కాంతం. చంద్రకాంతం మంచంమీదనుంచి తటాలున లేచి కుర్చీలో కూర్చున్నాడు. తెల్లటి పైజామా, కంటి మెడచొక్కా, పెద్ద తువ్వాలూ, చిందరవందర జుట్టూ—అప్పుడే కమ్యూనిస్టుల సమావేశంనుంచి వొచ్చినవాడిలా వున్నాడు.

"నాకూ కూడా లేవాలా కాంతం?" అంటూ కాఫీకప్పు బల్లమీద పెట్టింది. అత నేమీ మాట్లాడ లేదు. సిగరెట్ ఆర్పేందుకు 'ఆష్ ట్రే' కనిపించక అటూయిటూ చూస్తున్నాడు. కాంతం తల వొంచింది. గుమ్మంలోంచి గిరవాటెట్టాడు.

"కాఫీకి ముందే కాల్చాలా ఆ వెధవసిగరెట్టు!"

అతని పెదవులకేసి చూసింది. సిగరెట్లు కాల్చకుండా వుంటే అవి నిజంగా గులాబీరేకులలా వుంటా యనుకుంది.

"సిగరెట్టు నాపాలిటి దైవం. అది లేకపోతే నాగరికప్రపంచంలో క్షణం బ్రతకలేం—"

"ఎందువల్ల?"

"పొగ, దుమ్ము,క్లోరోఫారం,తారువాసన-నేటి లోకంవేగంతో సమంగా వెళ్లలేక క్రుంగి పోతున్న నరాలకి జీవంపోసే నిప్పుకణం."

"సరే—యివన్నీ నీవొక్కడికేనా యేమిటి? మావారు కాల్చరేం?"

కాఫీచప్పరిస్తూ ఆమెకేసి జాలిగా చూశాడు.

"మీఆయన మహానుభావుడు. మా నవీనత్వం అనే జబ్బు తగల్లే దింకా. అతనికి సమస్యలు లేవు. సందేహాలు లేవు. నోరులేని బాధలూ లేవు. సంసారం, హోదా, సంఘంలో స్థానం, మంచి పెళ్లాం, కారు, ముఖ్యంగా డబ్బూ—అన్నీ వున్నాయి. అవి నాకు లేవుకాబట్టి, సిగరెట్టుతో తృప్తిపడతా.—"

కాంతానికిట్లాంటి మాటలు విని చాలాకాలమైంది. ఎప్పుడో కాలేజిలో ఉపన్యాసకుడి ద్వారా వింది. 'మంచి పెళ్లాం' అనడంలో తను పెళ్లాంగా మంచిదో-వ్యక్తిగా కోరదగిందో అతని తాత్పర్యం బోధపడలేదు ఆమెకి.

"మా చెల్లెలు మంచి పెళ్లాం కాదూ?"

"మొగుడు మంచివాడైతేనే పెండ్లాం మంచితనం లెక్కలోకొస్తుంది."

క్షవరంచుకోణం చాపమీద పరిచాడు.

"మా నవీనత్వాని కివన్నీ వుపకరాలు." — కాంతం వెళ్లి గ్లాసుతో నీళ్లు తెచ్చింది.

"మీకెందు కీ శ్రమ? బంట్రోతు తెచ్చునుగా..."

"చంద్రం! నన్ను 'మీ' రనడం దేనికి?"

"వదినగారు—అందులో చదువుకున్నవారు..."

"చాల్లే—నీదంతా చిత్రం. ఐతే నీ నవీనత్వంలోకి నేనూ వొస్తానా?"

"మీ రట్లా అడిగితే చెప్పలేను. నవీనత్వానికి లక్షణాలు చెబతాను. అందులో వున్నారో లేరో మీరే చూసుకోండి. మొదటిది— ఫలానా పనీ అని వుండకూడదు. ఏవొక్కదాంటోనూ సంపూర్ణమైన పాండిత్యం వుండకూడదు. మతం, దైవభక్తి అసలు పనికిరావు. సంప్రదాయాలు, ఆచారాలు, పెద్దలు, ఆధ్యాత్మికపిచ్చి-వీళ్లు మాకు శత్రువులు. చరిత్రని చింపి పారేశాము. పొందిన వొస్తువుతో తృప్తిపడకూడదు, అనుభవించకూడదు. మార్పు మా మతం. ఈనాడున్న ఆదర్శాలు రేపుండవు. జీవితపు విలువలు లేవు. ఏదో ఆశిస్తాం—అదేమిటో నొక్కి చెప్పలేం. ఏదో బాధపడతాం; అదెవ్వరికీ అర్థంకాకూడదు. తొందర, తమాషా, తారుమారు, తాత్కాలిక తన్మయత,........"

కాంతం ఆవలించింది. నవ్వింది. ఇది సిద్ధంచేసిన ఉపన్యాసంలా వుందికాని, సహజమైన వాక్కా! అతని తెలివిని, చమత్కారాన్ని తను ప్రదర్శించాలని యత్నిస్తున్నాడా? అట్లా యత్నించడంలో వుద్దేశం? ఏదో ఆమెలో కొత్త ఆశ వుద్భవించింది. ఈ ఆశాభవనానికి పునాదుల నిర్మాణం ప్రారంభించాలి. ఏం చెయ్యాలో ఆలోచించడానికి దిగి వెళ్లిపోయింది. అతను భోజనం కాగానే వెళ్లిపోయి, మళ్లీ రాత్రి భర్త వొచ్చింతర్వాత కాని రాలేదు.

*　　*　　*

మొన్నాడు ఉదయానే లేచి బసవయ్య రాత్రికి రానని చెప్పి వెళ్లిపోయ్యాడు. కాంతం, ఏడింటికి

కాఫీకప్పుతో మేడమీది గదికి వెళ్ళింది. అప్పుడే స్నానంచేసిన తడి ఆ తెల్ల సిల్కుచీరలోంచి చల్లదనాన్ని వెదజల్లుతోంది. సూర్యకాంతి మధ్య పాపిడి నుండా నుదుటిమీద గీతలా పడింది. ఆకలి, సంతృప్తి-రెండూ ఆమెబాల్యపుసౌందర్యం మొయ్యలేని శక్తితో కళ్ళద్వారా కలత కనపరుస్తున్నాయి. ముడుచుకున్న పెదవుల మరుగులో సంకల్పం వుంది.

"ఎప్పుడు తీసుకొస్తావు మా చెల్లెలిని?"

"రేపే—ఏమీ భయపడవలసిన జబ్బు కాదన్నారు డాక్టర్లు"

"నువ్వింకా లేవలేదేం?"

అతను మంచంమీదే వోరగా కూర్చుని దిండ్ల మీద మోచెయ్యి ఆనించాడు. నిద్రలేక బరువెక్కిన కళ్లు, యాత్రసాగించి, మోసపోయి, విరామంపొందిన మొహవర్ఛస్సు—అతను వ్యాధిగ్రస్తుడు.

"నా కివాళ వొంట్లో ఏమీ బాగలేదు"

"అయ్యో పాపం! హాస్పిటల్ నే వెళ్లి చూసొస్తాలే...ఏం, తలనొప్పా?"

దగ్గరగా వొచ్చింది. మంచంబద్దీమీద ఆనింది.

"ఫలానా అని చెప్పలేను. మగతగా వుంది — తిండి మాన్తే అదే పోతుందిలెండి"

కాసేపు నిశ్శబ్దం.

"ఆ కుర్చీమీద కూర్చోండి. మీ గల్లా నిలబడ్డం నాకిష్టంలేదు" అన్నాడు నీరసంగా. కూర్చుంది. పాదాలమైకి లేచిన చీరకుచ్చిళ్లను కిందకు లాగింది. చెంపమీద చెయ్యేసుకుని అతని కళ్లల్లోకి దీర్ఘంగా చూసింది. అదరిపాటుతో అతను దృష్టిని మరల్చుకున్నాడు.

"ఐతే చంద్రం ... మా చెల్లెలు వొక బొమ్మ గీసిపించింది. అది నాదే...నేను చెయ్యలేదు—అబ్బ! ఎల్లా అనాలో రావడం లేదు—నేనేటందుకు—కాదు-నేనేటంతటి—బాగా వున్నానా?" సిగ్గుతో కనురెప్పలు వాల్చింది. అతను నవ్వాడు.

"అదా—అది మీది కాదు. మీ చెల్లెల్ని నేర్గా మనసుంచే అట్లా తయారైంది"

"నువ్వు ఏవుద్దేశంతో నేస్తే అల్లా తయారైందో"

"చెప్పాగా నా కుగ్రేశాలూ, అభిప్రాయాలూ లేవని..."

"కాదు, నాదే వేద్దామని సంకల్పించావు"

"కావొచ్చు. నాకు తెలీకుండా నా అంతరంగికం అనేకపన్లు చెయ్యిస్తుంది. వాటిలో యిదీ వొకటి కావొచ్చు".

"నీ అంతరంగికంలో అప్పుడు నే వుండివుండొచ్చు."

"సుప్రసిద్ధమానసికశాస్త్రవేత్త ఫ్రాయిడ్ గారి శిష్యురాలులా వున్నారు"

"నాకు గులాబీమొక్కను పంపించావు. ఈ రెండూ కూడితే ఏం తేల్తోంది?" అని ప్రశ్నార్థకంగా చూసింది.

"విషమపరీక్ష. డాక్టర్ వాట్సన్ గారి నడగాలి......బొమ్మ నాసృష్టి, గులాబీ ప్రకృతిసృష్టి."

"ఈ రెండూ నన్నుగురించి...నాచే ఆకర్షింపబడ్డ సృష్టి..."

అతను పక్కకి తిరిగి సిగరెట్టు ముట్టించాడు. ఇదంతా నిజమైవుండవొచ్చునన్నట్లుగా తెల్లబోయ్యాడు. నీరసంతో మూలుగుతూ దిండుమీద తల ఆనించాడు.

"చంద్రం, నా కెందుకో తెలుసా యింత దిగులు?... నువ్విచ్చిన గులాబీమొక్క వాడిపోతోంది. అది యెదగడం లేదు. మొగ్గవెయ్యడం లేదు—దానికేసి చూస్తే నువ్వే జ్ఞాపకానికొస్తావు. నీపూర్వపు చరిత్ర వాడిపోయినట్లుగా...... ఎంతోమంది నీకు నీళ్లు పోశారు; దువ్వారు; లాగారు— లాలించారు... వాడిపోయ్యావు...... నాకు దాన్నీ, నిన్నూ బతికించాలని......"

అతను భయంతో కళ్లు పెద్దవి చేశాడు. ఆమె లేచి అతనిదగ్గరగా వెళ్లి నుదుటిమీద చెయ్యేసింది. అది కాలిపోతోంది. నివిరింది.

"ఆమొక్క ఎందుకు పుష్పించదో చెప్పవూ?"

"కొన్నికొన్ని గులాబీలు నీళ్లతో పుయ్యవు... దాన్ని రక్తంతో పెంచాలి."

ఆమె వేళ్లు అతని జుట్టులో దాచుకుంది. అతను వాటిని తొలిగించాడు.

"మీ రిట్లా చేస్తే మీనౌకరీ పోతుంది..."

"నా కేం నౌకరీ?"

"భార్యగా వుండడం. హిందూలాప్రకారం వొకసారి స్త్రీని వుద్యోగంలోంచి తొలిగించినతర్వాత మళ్లా ఎవ్వరూ కుదుర్చుకోడానికి వీల్లేదు, ఆ మొదటి యజమాని బ్రతికివున్నంతవరకూ."

"నౌకరీ పొట్టకోసం. కాని హృదయం, ఆత్మ?"

"అవి మాకు లేవు. బిహేవియరిస్టు వాట్సన్ దొరగార్ని అడగండి. శరీరం ప్రమాదంనుంచి కాపాడు కునేందుకు వాటిని కల్పించుకుంది."

"నాకుంది."

"అది వున్నవాడినే చూసుకోండి. మీభర్తగారికి చాలా విశాలమైన హృదయం వుండి వుంటుంది—శరీరం లాగే."

కాంతానికి కోపం వొచ్చింది. భర్తంటే యితనికీ అసూయ; ద్వేషం. పురుషులందరూ అంతే ఎందుకో. కాని ఆ అసూయకు కారణం తను కాదు.

"కాదు చంద్రం—నీకు హృదయం వుందను కున్నాను. నిన్ను నేను అర్థంచేసుకున్నాను".

"అది భ్రమ. అర్థంచేసుకునేందుకు నాలో ఏమన్నా మహత్తరరహస్యం వుంటేగా. మాకు హృదయాలు లేవు — బుర్ర లున్నాయి, శరీరా లున్నాయి. బుద్ధి వుంది, జ్ఞానం లేదు. పావలోవ్ (Pavlov) ని అడిగితే అదీ లేదంటాడు. మేం అంత ర్జాతీయ అజ్ఞాతవాసులం; రాజకీయ జంతువులం; ఆర్థికపశువులం; సారస్వత చిలకలం; చరిత్రాత్మక గబ్బిలాలం; మరమనుషులం. నేను పెట్రోలువాసన, సిగరెట్ పొగ; ఫ్యాక్టరీరొద, ఐడ్రోఫారంకంపు — నీయిష్టం, మానవుణ్ణిమాత్రం కాను..."

ఇదంతా ప్రగల్భంగా, వంచింపుగా తోచింది ఆమెకు. మరోరాయి విసిరింది: "ఇవన్నీ నువ్వు కావొచ్చు. మరి నేను...నాప్రేమ..."

"అవి భాషకి సంబంధించిన సమస్యలు. రిచర్డ్సు (Richards), ఆగ్డన్ (Ogden) దొరగార్ల నడగాలి. ఆమాటలో ఎంత యథార్థం వుందో, ఎంత విలువ వుందో, ఎంత పరిణామం వుందో నాకు తెలీదు."

"నా సౌందర్యం."

అతను లేచి కూర్చుని ఆమెకేసి తీవ్రంగా చూశాడు.

"మేం సౌందర్యానికి చలించం. దీన్ని పూర్వీకులు వర్ణించి వర్ణించి నుంపతెంచారు. నిజంగా చూసేప్పటికి దాన్లో కొత్తదనం పోయింది. నేను ప్రేమించడం మరిచిపోయి చాలాకాలమైంది. హెలెన్, అనార్కలీ, క్లియోపాట్రా, శకుంతలా, గార్బోలాయ్ —వీళ్లే మా కలలని బాధిస్తారు..."

కాంతానికి కోపం మరింత యెక్కువైంది. ఇవన్నీ నిజంగా అన్నవో, పరిహాసానికో తన కర్థంకాలేదు. ఈ పిచ్చధోరణినిబట్టే, అంతా యితన్నిగురించి అట్లా అనుకుంటా రనుకుంది. అత నితో వాదించింది, బ్రతిమలాడింది. జరిగిపోయిన సంగతులు తవ్వింది. అతను కత్తిమీద హాయిగా నడకసాగాడు. ఉడుకులోన్ సీసాకోసం కిందకెళ్లింది. తెచ్చి గుడ్డమీద పోసి నుదుటిమీద వుంచింది.

"నన్ను మీ రిట్లా తాకడం దారుణం. అందులో బాధ లున్నాయి."

"నీ కిట్లాంటి అనుభవం లేనట్టు మహా!"

"లేక కాదు. అవి వేరు. అవి మూణ్ణాళ్లముచ్చట కాదు. పిల్లలు లేని స్త్రీ నాతో కాలక్షేపం చెయ్యడం కాదు. సంఘాన్ని వెక్కిరించడం కాదు. మా పిచ్చిలో కూడా కొంత తర్కం, మార్గం లేకపోలేదు. మీ విషయం వేరు. ఇదొక మంట—జ్వాల. వేళ్లు పెడితే మండి, భస్మమైపోతాను. పాపానికి వేతనం మృత్యువు. నాకు కొంత కాలం బతికి సూర్యోదయాన్ని చూస్తూ ప్రేమతో వొణికిపోవాలనుంది."

పక్కకి తిరిగి మూలగడం మొదలెట్టాడు. చారు కాచి తీసుకొస్తా నని వెళ్లిపోయింది కాంతం.

*　　*　　*

మధ్యాహ్నం మూడుగంటలైంది. ఓవల్టీన్ పట్టుకుని కాంతం మేడమీదికొచ్చింది. అతను నిద్రపోతున్నాడు. కళ్ల కింద తడి కనిపించింది. ఉడుకులోనుదో-అనురాగానిదో తెలీదు. హెలెన్, క్లియోపాత్రా, శకుంతల ఆమెను పీడుంచుకు తిన్నారు. ఏదో చెయ్యమని పురికొల్పారు. నిద్రలో వున్న శరీరానికి, బుర్రకీ మహత్తరమైన రొడబాటు. గాలిలేని ప్రకృతిమాదిరి నిశ్చల సౌందర్యాన్ని ప్రకటించుకుంటుంది. యుగాలనాటి కొండశిఖరాలు, సెలయేళ్లు, భూమిలో మరుగుపడ్డ మానవుడి ఎముకలు, వేళ్లుపాతుకుని పుష్పించలేని గులాబీమొక్క-కాంతాన్ని ఐక్యతకి రగిల్చాయి. సంసార సంస్థ సోడిబ్యాన్ని నిలబెట్టిన తెర చిరిగింది. ఆమె భార్య కాదు; వొదినగారు కాదు. అనంతవ్యక్తిత్వంతో మండిపోతున్న నరాల కుప్ప; అమరతకోసం అంతరాయాలని మంటగలిపిన సృష్టికర్త. అధరాలని అతని బుగ్గకి తగిల్చింది. రెప్పలు పైకి కదిలాయి; పక్కనుంచి మసక ప్రవాహంలా జారింది; ఇంద్రియాలలో రక్తం పిచ్చిగా తిరుగాడుతోంది.

"ఛి, ఛీ! సిగరెట్టు కంపు;......"

అతని నోరు కప్పింది. పెనుగులాడాడు.

"కాంతం! మాకు అమరత నిచ్చేది ఉడుకులోన్ కాని అధరాలుకావు. అది లేకపోతే యీ పాపపు పెదాలవాసనలో పెట్రోల్, తారు వేగం, గొడవ, హోరు, రొద, టి. బి. దుమ్ము-వొక్కక్షణం వుండలేను."

కాంతంశరీరంలోని మూలలు, వొంకర్లు, కోణాలు-అన్నీ ముక్కలై, యీడగిలపడిపోయాయి. తను ఏదో ప్రాచీనప్రపంచంలోకి వెళ్లింది—అక్కడినుంచి యీదౌర్భాగ్యుడు కిందికి గెంటాడు. అతన్ని మంటలో పడేసి చర్మం వొలవాలనిపించింది; కోసి రక్తం తీసి గులాబీమొక్కకి పొయ్యాలని వుంది — ("కొన్నికొన్ని గులాబీలకి రక్తం పోస్తేకాని పుష్పించవు") పెనుగులాటలో ఓవల్టీన్ కప్పు కిందపడి పగిలింది.

"అయ్యో - సాయంత్రం బజార్లో మరోటి కొంటాలెండి—మీవారితో చెప్పొద్దు."

కాంతం కసితో చూసింది అతన్ని. ఆశాభవనం గాజుకప్పులా కూలి ముక్కలైంది.

"మీ చెల్లెల్ని యీవాళ తీసుకువెళ్లొచ్చునన్నారు. కారు సిద్ధంగావుంటే యిప్పుడే వెళ్లివొస్తా." అన్నాడు.

కాంతం చరచరా మెట్లు దిగి వెళ్లింది. బైట కొచ్చింది. కారుడ్రైవరు ఎనమండుగురు పిల్లల్ని పోగుచేసి, 'చడుగుడి' ఆడిస్తున్నాడు. కారు సిద్ధంచెయ్యమని చెప్పిండి. మరోకప్పుతో మళ్లా పైకెళ్లింది.

"ఏదో చప్పుడైందే?" అన్నాడు చంద్రకాంతం.

"నాచేతుల్లోనే అద్దం పడి పగిలింది." తను అద్దంలో మొహం చూసుకున్న విషయం చెప్పినందుకు పెదవి కొరుక్కుంది.

"ఫరవాలేదు. మావారి డబ్బంతా యింటో కప్పులకీ, అద్దాలకీ అవుతోంది."

"చాలామంది మొగాళ్ల కంతే లెండి. కోతిని పెంచుకునేవాడు అది పగలగొట్టే అద్దాలకేనా ఖర్చు పెట్టొద్దా—అని వొకాయన న్నాడులెండి."

ఈవాక్యం వినిపించుకోకుండానే దిగి వెళ్లిపోయింది కాంతం. హాస్పిటల్‌కి తనూ సిద్ధమైంది. కార్లో వెళ్లారు. చంద్రకాంతం భార్యని కార్లో ఎక్కించుకుని సముద్రపు వొడ్డునే వొస్తుంటే బసవయ్య కనిపించాడు. అతనూ కార్లో ఎక్కాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. బసవయ్యమాత్రం కార్ల ఇన్సూర్యెన్సునిగురించి డ్రైవరుతో గుక్కతిప్పుకోకుండా లెక్చరిచ్చాడు.

"ఇదుగో-రేపు సముద్రస్నానం చేద్దామా-చాలాకాలమైంది చేసి-?" అన్నాడు బసవయ్య.

"అమ్మో! నాకు భయం" అంది మరదలు.

"మీరొద్దు. మేం మొగాళ్లం వెళ్తాం." ఎవళ్లూ సమాధానం చెప్పలేదు. రాత్రి చాలాసేపు మాట్లాడింది సూర్యకాంతం భర్తతో.

* * *

మొన్నాడు ఉదయం ఆరుగంటలకి నలుగురూ కారుమీద సముద్రపుటొడ్డుకి వెళ్లారు. కారు దిగి

దూరంగా యిసకలో ఫర్లాంగుదూరం నడిచి, చాప పరిచారు. తువ్వాళ్లు, రెండు గొడుగులు తీసుకొచ్చి డ్రైవరు కారుదగ్గర కెళ్లిపోయ్యాడు. ఎర్రటిముద్ద నీటిఅంచుమీద లేచింది. మంచునుండి విముక్తిపొంద డానికి యిసుకకణాలు కాంతిలో విప్పారుకున్నాయి. ప్రకృతి తన అలంకారాన్ని అలజడిలోనూ, పక్షుల పిచ్చిపాటలతోనూ ప్రోగించుకుంటోంది.

బసవయ్య, చంద్రకాంతం నీళ్లదగ్గరకి నడిచి పోయ్యారు. కాంతం, చెల్లెలూ యిసుకలో కూడుం పుల్ల ఆడుకుంటున్నారు.

"నా కీత రాదు, నీ కొచ్చునా?" అని అడి గాడు బసవయ్య.

"సముద్రంలో ఈతేం ప్రయోజనం? ఐనా నా జీవితానికి విలువలేదు. భీమాకూడా చెయ్యించలేదు"

బసవయ్య బిగ్గరగా నవ్వి చొక్కా తీసి నీళ్ల ల్లోకి నడిచాడు. పదిహేనుగజాలు వెళ్లి మూడుసార్లు మునిగాడు.

"లోతు లేదే — రా ఫరవా లేదు" చంద్ర కాంతం దగ్గరగా వెళ్లాడు. బసవయ్యని చిన్న కెర టాలు కదప్పలేవు. చంద్రంకాళ్లకి యిసక తగలడం లేదు. నీళ్లల్లోకి నూస్తుంటే చిత్రమైన అనుభవం కలుగుతుంది. మంచు కరిగి కొండశిఖరం విరిగిపడ్డట్టూ, పాదాలకింద భూమివిడి ఎక్కడికోతీసుకెడుతున్నట్లూ, లోకం గిరగిర తిరుగుతూ శూన్యత్వంలోకి గిరవాటెట్టి నట్టూ భయమేస్తుంది. మానవుడి అల్పత్వం, అనావశ్య కత — అన్నీ తెలుస్తాయి సముద్రంలో మునిగినవాడికి.

పెద్ద కెరటం చిన్నవాటినినురుగుతోసహాలాంగ తీసుకొనిఇసికగుహలను పెల్లగించి, వొడ్డునబ్రద్దలై, కిరీటం లాంటి నురుగుని చీరమాదిరి ఆరేసిందికాని బసవయ్యని అంగుళం కదపలేదు. కాని అతనికి లోపలికి జారు తున్నట్లు అనుమానం తట్టింది. ఒడ్డువెంపు నడిచాడు. శక్తిని పోగొట్టుకున్న పెద్దకెరటం ఇసుకతో దొర్లు తుంటూ అతన్ని పదిగజాలు తీసికెళ్లింది. ఇంకా నడి చాడు.

"ఇక్కడకూడా భూమి తగుల్తోంది.." అన్నా డు చంద్రకాంతం నురుగులా తేలిపోతూ.

కెరటాలు అల్పగంతులు, నాట్యం మానుకుని, పెద్దపెద్ద నీటి ఆవరణాలను పూరించుకుని, లోలోపల భయంకరంగా కదులుతున్నాయి. పాముపడగలా నాలుకలు జాపుకుంటూ క్రూరంగా బసవయ్యదృష్టిని తారుమారు చేస్తూ తీసుకుపోతున్నాయి. అతను ప్రపంచానికి దూరమైపోతున్నాడు. నీళ్లు తాగు తున్నాడు. చేతులను రెక్కలువిరిగిన పక్షిలా కొట్టు కొంటున్నాడు. ఒడ్డు కనిపించదు. మనుషులు కని పించరు. ఆకాశం, సముద్రం అంతా వొకటే — తన నిర్మూలానికి కలిసి పెనుగులాడుతున్నాయి.

"చం-ద్రం ... దా — బా...అందు..." ఏవో ధ్వనులు చేశాడు. బాధలో వున్నవాడి మూగభావ — జీవం నిశీథంలో శ్మశానవాటికలో అరిచే కడసారి అరుపు. చంద్రకాంతం వొచ్చి యితనిదగ్గర పడ్డాడు. బసవయ్య జుట్టుని పళ్లతో పట్టుకున్నాడు; చేతులతో అతని మెడ గట్టిగా బిగించి, అతని కళేబరాన్ని మీదేసుకుని వెల్లకిలబడి వూపిరి బిగించి, గుప్పిళ్లతో నీటికన్యస్తనాలపై కొడుతుంటే, వొక పోకిరీకెరటం విప్లవం చేసి బైటపడి, అవ్యక్తులని వొడ్డుకేసి ఐదుగజాలు వూపి గిరవాటెట్టింది. భూమి తగిలింది. ఒడ్డున పడ్డాడు బసవయ్య. అతని పొట్టమీద అదుగేసి తొక్కాడు చంద్రకాంతం. శరీరాన్ని 'నూలీసు' చేశాడు.

సూర్యకాంతం దూరాన్నించి చూసి, గబగబ నడిచి చక్కా వొచ్చింది.

"ఏమీ లేదు — ఆయనకి అలుపొచ్చింది" అన్నాడు చంద్రకాంతం.

"అంతేకదా — ఏదో అని హడిలిపోయాను."

అతను తన భర్తని ఏమన్నా చేశాడేమోనని కాంతం భయపడింది. అసూయతో బాధపడుతున్న పురుషుడు ఎంత ప్రమాదమైనా చెయ్యగలడు. చంద్ర కాంతం సముద్రంలో కొట్టుకునిపోతే ఎంత బాగుం డును! ఏమిటి తనకీ ఆలోచనలు!

"చంద్రకాంతం లేకపోతే నాపని యీపూట హుళక్కే" అన్నాడు బసవయ్య ఆయాసంతో.

అంతా యింటికి చేరుకున్నారు. ఆసాయంత్రం బెడతానని చంద్రకాంతం భార్యని ప్రయాణం కట్టమన్నాడు. బసవయ్య బలవంతంమీద మొన్నాడు వెళ్లడానికి నిశ్చయించుకున్నారు. రాత్రి భోజనానికి బసవయ్యకోసం కాచుకుంటూ చంద్రకాంతం హాల్లో కూర్చున్నాడు. అతని భార్య స్నానాని కెళ్లింది — తొట్టిస్నానం. గంటకికాని రాదు. మల్లెపూలు కొప్పులో సర్దుకుంటూ కాంతం చక్కా వొచ్చింది.

"నువ్వు లేకపోతే మావారు కొట్టుకుపోదురుటగా—"

"సరే, నే లేకపోతే ఆయన స్నానానికే వెళ్లి వుండడు..."

"ఆదయ నామీదా, ఆయనమీదా?" అంటూ వీధితలుపు మూసింది.

"నా కెవళ్లమీదా దయాదాక్షిణ్యాలు లేవు. ఆయన బ్రతకడంవల్ల ఇన్స్యూరెన్స్ ప్రపంచానికేనా వుపయోగం వుంది. నావల్ల ఏం ప్రయోజనం వుంది లోకానికి?"

"నాకుంది"

"అది నీస్వార్థం. పైగా ఆయన కొట్టుకుపొయ్యాడంటే నీపని ఏమౌతుందో తలుచుకుంటే భయమేస్తుంది. అంతేకాని నాకు త్యాగంలోనూ, పరోపకారంలోనూ నమ్మకం లేదు..."

కాంతంలో రేకెత్తిన ఆశాపుష్పం వాడింది.

"చంద్రం...నువ్వు కావాలి—వొక్కనిమిషం నన్ను నీచేతుల్లో పట్టుకోవూ?"

"నువ్వు ఆటవొస్తువ్వికావు. స్త్రీవి. నా కుద్యోగం లేకపోవడంవల్లకదా నా కీపని కల్పించావు. లేదు, ఒదినగారూ, నాకు ప్రేమించేటందుకు తీరుబడి లేదు. ఆ విలాసం మీబోంట్లకు. ఉద్యోగం, ధనం, సంసారం, సంఘంలో స్థానం, పిల్లా మేకా పోరూ పొందూ లేక హాయిగా కావలసినంత విశ్రాంతి వున్న మీకు అది తగిన కాలక్షేపం. భారతదేశంలో తిండి లేదు. నాగరిక ప్రపంచంలో ప్రేమ లేదు. అందుకనే నవీన యువకుడికి శాంతి లేదు"

"ఈదేశంలో నాగరికత లేదంటే నవ్వొస్తుంది. పోనీ నాకేనా లేదంటూవా?" అని అడిగింది కాంతం.

"ఆకలి తీరని దేశానికి నాగరికతతో నిమిత్తం లేదు. నా కాకలి తీరలేదు. బాధగా వుందని లోకానికి బిగ్గరగా చెప్పకునేవాడు నాగరీకుడు కావొచ్చు. ఆకలిబాధ తగ్గింతర్వాత ఘనవంతులు నాగరికతలో విలాసాలతో స్వేచ్ఛగా వ్యవహరిస్తారు. స్వేచ్ఛాజీవితం అవలంబిస్తేనేకాని నవీనులుకారేమో నన్నభయంవల్ల ఘనవంతులు, ఘనవంతులభార్యలు నాగరికతని ఆచరణలో పెడతారు."

కాంతానికి వొళ్లు మండింది. భర్తతో చెప్పి యీ దౌర్భాగ్యుణ్ణి సముద్రంలో ముంచలేకపొయ్యానన్న విచారం కలిగింది.

"చంద్రకాంతం, నేను నిన్ను పరిశోధించానే గాని నిజంగా నిన్ను ప్రేమించానను కున్నావా?"

"నన్ను నువ్వు నిజంగా ప్రేమించావని నమ్మేటంతటి శుంఠని కాను. పైగా యీ వేగంగా కదిలిపోయే ఆధునిక ఆర్థికయంత్రం చక్రాలకింద ప్రేమ, సౌందర్యం, సత్యం—అన్నీ ముక్కలు ముక్కలై పొయ్యాయి. వాటిని అతికించాలంటే జిగురుబుడ్డి కొనేటంతటి డబ్బుకూడా లేదు నాదగ్గర. నీ కది చేతకాదు."

ఇంతలో వీధితలుపు చప్పుడైంది. అంత బిగ్గరగా తలుపు తట్టేది బసవయ్యతప్ప మరొకరు కారని కాంతానికి తెలుసు.

మొన్నాడు సాగనంపడానికి బసవయ్య, భార్యా కారులో స్టేషన్ కి వెళ్లారు. సూర్యకాంతం, చెల్లెలూ బండిలో కూర్చున్నారు. చంద్రకాంతం ఇంజన్ దగ్గర నిలబడి దాని పొగరుమోతుబలాన్ని పరీక్షిస్తూ నుంచున్నాడు. బసవయ్య గార్డుతో మాట్లాడుతున్నాడు—భీమా చెయ్యమని చంపుకుతింటూ.

"ఏమో—మొన్న సముద్రంలో మీ బావ లేకపోతే నీ మొగుడుపని ఏం జరుగును..."

ఇంతలో బసవయ్య చక్కా వొచ్చాడు.

"అదేమిటి, తలక్రిందులు చేసి చెబుతున్నావు? అతను లేకపోతే నే నేమాదును..."

మళ్లా గార్డు సంజ్ఞచేస్తే వెళ్లిపోయ్యాడు. బండి కదిలే టైమయింది. చంద్రకాంతం పెట్టెదగ్గర కొచ్చాడు.

కాంతం బండిలోంచి దిగింది.

"ఇదిగో చూడూ" అన్నాడు చంద్రకాంతం, భార్యని సంబోధిస్తూ. "మీ బావతో యితర మొగాళ్లను గురించి చెడ్డగా చెప్పొద్దని కొంచెం చెబుదూ"

"ఎవరితో?" అంది అతని భార్య.

"అదే, మీ అక్కతో. కొంతమంది స్త్రీలకి చెడ్డ మొగాళ్లంటే చాలా మోజు కాబోలు."

రైలు కదిలింది. బసవయ్య తన అరటి బొంద లాంటి చేతిని వూపాడు.

ఇద్దరూ కార్లో యింటి కొచ్చారు. కాంతం కార్లోంచి దిగి గబగబా తోటలో కొచ్చింది. చంద్రం పంపిన గులాబీ మొక్కమీద వో మొగ్గ లేచింది. కాంతం ఆ మొక్కని వేళ్లతో సహితంగా పెరికి, దూరంగా గోడవతల గిరవాటెట్టింది. పాదంతో ఆ స్థలాన్ని చప్టాలా చేసింది. బసవయ్య ఆ పారేసిన మొక్కను చేత్తో తీసుకుని దొడ్డివెంపునుంచి చక్కా వొచ్చాడు.

"ఇదేమిటి, యీ మొక్కని ఎవరు పారేశారే? పువ్వుకూడా పూసింది?"

"నేనే. దాని కేదో అతనిలాగే జాడ్యం. మీరు చెప్పిన వన్నీ నిజమే నండీ—అతను చాలా..."

"ఏమీ లేదు. చాలా మంచివాడు." అని బిగ్గరగా నవ్వుతూ ఆ మొక్కని మళ్లా పాతటానికి సంకల్పించాడు.

"క్రాక్ అంటాను." అంది.

"క్రాక్ కావొచ్చు—కాని మంచివాడే."



# సార్జెంటు విద్యాప్రణాళిక

= శ్రీ వేదుల జగన్నాథం =  

"యుద్ధములు చేయుటకు వచ్చే ధనము దారిద్ర్యము, నిరుద్యోగము, అవిద్య, రోగము మొదలగు శాంతిసమయములోని శత్రువులతో పోరుటకు ఏకారణమువలన రాదో అనే సమస్య నాకెప్పుడూ ఆశ్చర్యం కలిగిస్తూ ఉంటుంది. హిట్లరు నోడించుట కెంత విరివిగా ధనము వ్యయము చేయుచున్నామో అంతధారాళముగా పై శాంతికాలపు శత్రునిర్మూలనముమీద ఖర్చుపెట్టినచో మానవ పురోభివృద్ధికి మనము నిశ్చయముగా తోడ్పడినవారమవుతాము" అని వైస్రాయి వేవెల్ ౧౯౪౩ సెప్టెంబరు నెలలో ప్రకటించాడు. సార్జంటు విద్యాప్రణాళిక కీ వాక్యాలు మూలబీజాలు. నిరక్షరాస్యతానిర్మూలనం, జాతీయవిద్యాశిక్షణ ఈ ప్రణాళికయొక్క పునాదులు. ఇంతకు పూర్వ మిట్టి ప్రయత్నాలు చెయ్యబడకపోలేదు కాని ఫలించలేదు.

జాతీయవికాసమునకు నిర్బంధ ప్రాథమిక విద్య జీవగఱ్ఱ యని గ్రహించి, వెంటనే దేశమంతటా నిర్బంధప్రాథమికవిద్య నుచితముగా నెల్లప్రజల కొసగుట కేర్పాట్లు చేయవలసిన దనియూ, అట్లు చేయుటకు సలహా నిచ్చుటకు ఒక కమిటీ నేర్పరుపవలసిన దనియూ ౧౯౧౦ సంవత్సరం ఢిల్లీ ఎసంబ్లీలో కీ. శే. గోఖలే ఒక తీర్మానమును ప్రతిపాదించాడు. మరుచటి సంవత్సరంలో ఒక బిల్లును ప్రవేశపెట్టాడు. కాని గవర్నమెంటువా రామోదించలేదు. తర్వాతకూడా ఇట్టి ప్రయత్నములు విజయవంతము కాలేదు. అందుచే నేడు ఇండియాలో మద్రాసు మొదలగు కొన్ని రాష్ట్రములలో కొన్ని లోకల్ బోర్డు ప్రాంతములలోమాత్రమే నిర్బంధోచిత ప్రాథమికవిద్య అమలులో ఉంది. వర్తమాన ప్రపంచములో ప్రతి నాగరిక దేశములోనూ నిర్బంధ ప్రాథమిక విద్య ప్రభుత్వ ముచితముగా నిచ్చును. ఇంగ్లాండు, అమెరికా మొదలగు దేశాలలో నిరక్షరాస్యులు లేనేలేరు. విప్లవపూర్వ ముండెడి ౯౦ % నిరక్షరాస్యతను విప్లవానంతరం పది సంవత్సరాలలో నిర్మూలించి సోవియటు రష్యా వన్నె గడించింది. ఇట్టి పరిస్థితులలో ఇండియాలో నేడును నూటికి ౮౫ గురు నిరక్షరాస్యు లున్నారని చెప్పుట కడు శోచనీయము. ఇంతవరకు ప్రభుత్వముచే విద్య ఒక భోగముగా పరిగణించబడింది గాని, జాతీయజీవనమున కత్యవసరమనియూ, జాతివికాసమునకు మూలదీపిక అనియూ పరిగణింపబడలేదు. ఈ లోపము తొలగించుట సార్జంటుప్రణాళికయొక్క ప్రధానోద్దేశము

ఆ ప్రణాళికలోని విషయములను కూలంకషముగా చర్చించుటకు ముందు దానియొక్క ప్రధాన సూత్రములను పేర్కొనుట ఉచితము. అవి ఏవన,

(౧) భారతదేశములోని బాలబాలిక లే ఇతర దేశమువారికిని తీసిపోరు. సరియైన జాతీయవిద్య నొసగినచో వ్యక్తిగత లాభము పొందుటయేగాక జాతీయ వికాసమునకూ, సంఘపురోభివృద్ధికి సాయపడెదరు.

(౨) జాతి మత వివక్షతలు లేక బాలబాలికలెల్లరకూ సమానావకాశము లొసగవలెను. ప్రతి బాలబాలికకూ కనీస విద్యకును, ఉచిత విద్యార్థుల కున్నత విద్యకును అవకాశము లేర్పాటుచేయవలెను.

(౩) ఆరుసంవత్సరములు మొదలు పదునాల్గు సంవత్సరముల మధ్యగల ప్రతివ్యక్తియును స్కూలుకు పోవునట్లు నిర్బంధముచేయవలెను. ఈవయస్సులో విద్య ప్రభుత్వబాధ్యతపై ఉచితముగా నీయవలెను.

## ౧. సార్జంటు విద్యాప్రణాళిక నిర్ణయించిన ఉపాధ్యాయుల కనీసజీతములు

| | మాసమునకు | వర్షాంతపు ఇంక్రిమెంటు | ద్వివర్షపు ఇంక్రిమెంటు |
|---|---|---|---|
| ప్రాథమికపూర్వవిద్యాపాఠశాలలోని, ప్రాథమికపాఠశాలలోని ఉపాధ్యాయులకు ... ... ... | 30 | 1—35 | 3—50 |
| మాధ్యమికపాఠశాలలోని ఉపాధ్యాయులకు, ఉన్నతపాఠశాలలలోని పట్టభద్రులుకాని ఉపాధ్యాయులకు ... | 40 | 2—80 | |
| ఉన్నతపాఠశాలలలోని పట్టభద్రులయిన ఉపాధ్యాయులకు... | 70 | 5—150 | |

ప్రధానోపాధ్యాయులకు:—(పురుషులకూ, స్త్రీలకూ సమానమే)

| ప్రాథమికపాఠశాలలు:— | పాఠశాలతరహా | సామాన్యోపాధ్యాయులకంటె అదనము | | |
|---|---|---|---|---|
| ,, | 1 లేక రెండు తరగతుల తరహా | 10 రూపాయలు. | | |
| | | జీతం | ఇంక్రిమెంటు | మొత్తం |
| ,, | 3, 4, లేక 5 తరగతులు | రూ. 52 | రూ 4 | రూ 70 |
| ,, | 6 మొదలు 10 తరగతులు | ,, 60 | ,, 4 | ,, 80 |
| ,, | 10 తరగతుల పైన | ,, 80 | ,, 4 | ,, 100 |
| మాధ్యమికపాఠశాలలు:— | | | | |
| ,, | 3 లేక 4 తరగతులు | ,, 80 | ,, 4 | ,, 100 |
| ,, | 4 మొదలు 8 తరగతులు | ,, 90 | ,, 4 | ,, 110 |
| ,, | 8 తరగతుల పైన | ,, 104 | ,, 10 | ,, 180 |
| ఉన్నతపాఠశాలలు :— | | | | |
| ,, | 250 మంది విద్యార్థుల వరకున్నచో | ,, 175 | ,, 10 | ,, 255 |
| ,, | 250 మొదలు 500 మంది విద్యార్థులున్నచో | ,, 250 | ,, 10 | ,, 350 |
| ,, | 500 ల మంది విద్యార్థులకుపైనున్నచో | ,, 350 | ,, 15 | ,, 500 |

దైనందినకార్యభారము ప్రధానోపాధ్యాయుల భుజములపై నుంచరాదు. అట్టి కార్యము చేయుటకు ప్రాథమికపాఠశాలలలో నెల 1 కి రూ 5 లు; మాధ్యమికపాఠశాలలలో రూ 10 లు; ఉన్నతపాఠశాలలలో రూ. 20 లును ఇతర ఉపాధ్యాయున కిచ్చి చేయించవలెను.

## ౨. సార్జంటు విద్యాప్రణాళిక నమలులో పెట్టుట కగు ఖర్చుశాతముల మొత్తము.

| | |
|---|---|
| ఉపాధ్యాయుల జీతములు మొదలగునవి ... ... ... | 70 % |
| పాఠశాలాభవనములు, ఆటస్థలములు మొదలగువాటికి చేయు అప్పునిమిత్తం ... | 5 % |
| ప్రత్యేకపాఠశాలలకు, మధ్యాహ్నభోజనములకు, ఆరోగ్యసేవకు ... ... | 10 % |
| పరిపాలన సిబ్బందీ ఖర్చు ... ... ... ... | 5 % |
| పుస్తకములు, పరికరములు, మరమ్మత్తులు, పోషణఖర్చులు మొదలగువాటికి ... | 10 % |
| మొత్తం ... | 100 % |

(౪) బీదలైనను ప్రతిభగల ప్రతివిద్యార్థికిని ఉన్నతవిద్యగాని, వృత్తివిద్యగాని, విశ్వవిద్యాలయ కోర్సులుగాని అనుసరించుట కవకాశములు కల్పించవలెను. అట్టి బీదవిద్యార్థుల పోషణనిమిత్తమై వేతనము లొసగవలెను.

(౫) పాఠశాలలనుంచియు, కాలేజీలనుంచియు బయల్వెడలువారికి ఉపయోగకరమైనవియు, తగినవియు ఉద్యోగములు చూపుటకు ఉద్యోగశాఖలను స్థాపించవలెను.

(౬) భావిపౌరుల ఆరోగ్యమును భద్రముగా కాపాడుటకు పాఠశాలలో ఆరోగ్యపరీక్ష గావించి, బాలుర దేహదార్ఢ్యము పెంపొందించుటకు ఆరోగ్య శాఖలను స్థాపించవలెను.

(౭) శారీరక మానసికలోపము లున్న వారికి విద్య నొసగుటకు ప్రత్యేకసంస్థలు స్థాపించి తగిన శిక్షణ పొందిన ఉపాధ్యాయులను నియమింపవలెను.

(౮) నిరక్షరాస్యతను తొలగించుటకు ౧౪-౪౦ సం. మధ్యవారికి వయోజనవిద్యావిధానముక్రింద శిక్షణ గరపవలెను.

(౯) పాఠశాలను విడిచిన యువకులు విరామ కాలము సుపయోగముతో వినియోగించుటకు సదవకాశములు, సత్కాలక్షేపమార్గములు, సంఘప్రయోజనకార్యములు వృద్ధిపరుపవలెను.

(౧౦) దూరదృష్టితో, విశ్వాసముతో, ధైర్యముతో జాతీయవిద్యాప్రణాళిక నమలులో పెట్టుటకు తగిన ప్రభుత్వశాఖలను ప్రారంభించవలెను.

(౧౧) అట్టి ప్రణాళికను సాగించగల ఉపాధ్యాయులను సత్వరముగా తయారుచేయవలెను.

ఈసూత్రములపై ఆధారపడిన జాతీయవిద్యావిధానము నమలులో పెట్టవలె నన్న తగినంతమంది ఉపాధ్యాయులు కావాలి. ౧౯౪౦-౪౧-వ సం.లో ౬౪౦ ట్రయినింగుస్కూళ్లుమాత్రమే ఇండియా మొత్తం మీద ఉన్నాయి. వీటిలో సాలీనా ౧౯౦౦౦ మంది ఉపాధ్యాయులుమాత్రమే తయారవుతున్నారు. పట్టభద్రులకు ట్రయినింగుకాలేజీలు ౨౨ మాత్రమే ఉన్నాయి. వాటిలో ప్రతి సం.రము ౧౩౦౦ మాత్రము శిక్షణ పొందుతున్నారు. ఇట్టి పరిస్థితులలో దేశమంతటను జాతీయవిద్య నమలులో పెట్టుట దుర్లభము. ౧౦౦ కి ౪౨ మంది ట్రయినింగులేని ఉపాధ్యాయు లున్నారని ౧౯౩౮-౩౯-వ వార్షికనివేదిక తెల్పుతూంది. ఇప్పుడున్న ట్రయినింగుకూడా చాలా అసంతృప్తికరముగా ఉంది. ఉపాధ్యాయవృత్తికి తగనివారు చాలామంది ఆవృత్తిలో ప్రవేశిస్తున్నారు. ప్రతిసంవత్సరమూ విరమించే ఉపాధ్యాయుల ఖాళీలను నింపుటకుమాత్రమే ఇప్పుడున్న ట్రయినింగు విద్యాలయాలు సరిపోతాయి. అంతకు ఎక్కువ కావలసినచో క్రొత్త ట్రయినింగుసంస్థలను బహుళముగా స్థాపించాలి.

సకలశాఖలలోనూ విద్యనొసగుట కిండియాలో ౨౨,౦౦,౦౦౦ మంది ఉపాధ్యాయు లుండాలి. అందులో ప్రాథమికపూర్వవిద్య (Pre-Primary), ప్రాథమిక (Primary) విద్యలనొసగుటకు ౧౨,౨౦,౦౦౦ లును, మధ్యమతరగతి (Secondary) విద్యనొసగుటకు ౬,౨౦,౦౦౦ లును, ఉత్తమతరగతి విద్య (High-School) కు ౩,౬౨,౦౦౦. ఇరవై రెండులక్షలమంది ఉపాధ్యాయులను తయారుచేయుట కథమం ముప్పై ఆయిదు సంవత్సరములైనా పడుతుంది. ఎంత త్వరితముగా ఇంతమంది ఉపాధ్యాయులను తయారుచేయగలమో అంత త్వరలో జాతీయవిద్య నమలులోకి తీసికొనిరాగలము. మొట్టమొదటి ౫ సం.లును ట్రయినింగు సంస్థలు స్థాపించుటకు సరిపోవును. ఆరవ సంవత్సరమునుండి ఎడతెగకుండా ఉపాధ్యాయులను సరఫరా చేయుట కవకాశము లుండును. మొదటిదినములలో అభివృద్ధి ఇప్పటి ఉత్తమపాఠశాలలలోనీ, కాలేజీలలోనీ విద్యార్థుల నెంతమందిని ఉపాధ్యాయవృత్తికి ఆకర్షించగలుగుతామో దానిమీద ఆధారపడి ఉంటుంది. ఆతర్వాత రోజులలో క్రొత్తగా పెట్టబడే హైస్కూలు, కాలేజీలనుంచి వచ్చు పెచ్చు విద్యార్థులనుంచి ఉపాధ్యాయుల సంఖ్య నధికముచేయ వచ్చును. మొత్తము ౨౨ లక్షలమంది ఉపాధ్యాయులను పూర్తిచేయవలెనన్న ౩౯ సంవత్సరములైనా పడుతుంది. ఒకపర్యాయము దేశమంతటా విద్యా

విధాన మల్లుకొనినపిమ్మట ఉపాధ్యాయులు చని పోవుటవలనగాని, విరమించుటవలనగాని వచ్చే ఖాళీల సంఖ్య ౪౪౦౦౦ దరిదాపులో నుండును. అందుచే ట్రయినింగుసంస్థలలో ఉండే అదనపుసంఖ్య ఉన్నత విద్యాపథములలోకి మళ్లించవలసిన అవసర ముంటుంది.

పట్టభద్రులు కానివారికి ట్రయినింగుసంస్థలు మూడురకములుగా విభజింపవచ్చును: (౧) ప్రాథమిక పూర్వవిద్యా తరగతి, (౨) ప్రాథమికవిద్య, మాధ్యమిక విద్యా తరగతులు, (౩) ఉత్తమవిద్యాతరగతులు. మాధ్యమికవిద్యను గరపే ఉపాధ్యాయులకు మూడేళ్ల ట్రయినింగును, మిగిలినరకములవారికి రెండేళ్లపాటును ట్రయినింగు అవసరము. హైస్కూలులో ఉండే పట్టభద్రోపాధ్యాయులకు ఒక సంవత్సరము ట్రయినింగు సరిపోవును. వారికి ట్రయినింగు కాలేజీలలోగాని, విశ్వవిద్యాలయ శిక్షణశాఖలలో కాని ట్రయినింగు నీయవచ్చును. నేటి ట్రయినింగుసంస్థలకు జతపరుపబడిన పాఠశాలల కుద్యాసనచెప్పి ఆయా ట్రయినింగుసంస్థల పరిసరప్రాంతములలో నున్న అన్ని విద్యాసంస్థలలోనూ ట్రయినింగయే ఉపాధ్యాయులకు బోధనావకాశము లేర్పరచాలి.

ఒకొక్కక్క ట్రయినింగు పాఠశాలలో ౩౦౦ మంది ఉపాధ్యాయులు తర్ఫీదగుట కవకాశము లుండవలెను. అనగా ప్రతిసంవత్సరమూ ౧౫౦ మంది కొత్త వారిని చేర్చుకోవచ్చును. కొఱత రాకుండగా ఉపాధ్యాయులు తగినవారు లభ్యమవవలె నన్న శిక్షణ కాలములో ఎట్టివిధమైన రుసుమును వారివద్దనుండి వసూలుచేయరాదు. ఒకొక్కక్క ఉపాధ్యాయునిపై ఖర్చు సాలుసరికి ౨౫౦ రూపాయలగును. ట్రయినింగు కాలేజీలలోను, విశ్వవిద్యాలయ శిక్షణ శాఖలోను ౨౦౦ మంది ఉపాధ్యాయులకంటె ఎక్కువ ఉండకూడదు. వారి వద్దనుండికూడా ఎట్టి రుసుమును వసూలు చేయరాదు. వారి ఒకొక్కక్కరికి ఖర్చు సాలీనా నాల్గు వందల రూపాయ లవుతుంది.

ఏ ఆదర్శవిద్యావిధానములో నైనను పురుషోపాధ్యాయులకంటె స్త్రీఉపాధ్యాయినుల సంఖ్య ఎక్కువగా ఉండాలి. ఎందుచేత ననగా, ప్రాథమిక పూర్వ తరగతులలో అందరును, ప్రాథమిక తరగతులలో ౩/౫ వంతును, మాధ్యమిక తరగతులలో ౧/౩ ను ఉపాధ్యాయినులే ఉండాలి. మొదటి సంవత్సరములలో ఉపాధ్యాయినులు లభ్యమగుట కష్టమగును. కాని కాలము గడిచినకొద్దీ స్త్రీలు ఉత్తమ విద్యలు పొందిన పిమ్మట ఈకొఱత తీరును.

ఉపాధ్యాయుల ట్రయినింగున కగు ఖర్చు శిసలుగా నిర్ణయించుట కష్టమయినను ౨౨ లక్షలమంది ఉపాధ్యాయులను తయారుచేయుటకు ౩౫ సం.ల లోను ౧౬౦ కోట్ల రూపాయ లవునని అంచనా వేయవచ్చును. అనగా సాలీనా ౪.౫౬ లక్షల రూపాయలగును.

[సశేషము]





# శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి యొక్క
# సంగీత సుధానిధి




కర్ణాటక సంగీత మాధుర్యమును దక్షిణమున సింహళమునందును, ఉత్తరమున బొంబాయిలోను తన మధుర కంఠస్వరమునందు రసము లొలికేటట్లు పలికించి, అఖిలభారత ప్రఖ్యాతి బడయుచున్న కోకిలగాన శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మియొక్క సంగీత సుధానిధియే ఈ "హెచ్. ఎం. వి."

.........రికార్డు సంపుటము.........



"హెచ్. ఎం. వి." గ్రామఫోను వ్యాపారులందరియొద్ద దొరుకును

**N. 18680**
ఎన్నగాను రామభజన — వంతువరాళి

**N. 18685**
సరగున పాలింప — కేదారగౌళ

**N. 18218**
కణ్ణాడు త్తాగిలుం — సింహేంద్ర మధ్యమము

**N. 18208**
మాదవ్యై — వసంత

**N. 18205**
కండదుండో
వానత్తిణ మీదు

శ్రేష్ఠమైన సంగీతము

# "హిస్ మాస్టర్స్ వాయిస్"

ఉత్కృష్టమైన రికార్డింగ్

Samuel

**హైఫిడెలిటి సూదులు**

ఒక సూదిచేత పెక్కు రికార్డులను పాడించవచ్చును
10 సూదులు గల పాకెట్ 1.కి వెల రూ2/4

స్త్రీకి సంతానం సహజమైన కోరిక



# లోధ్ర



దానిని సఫలత నొందిస్తుంది

లోధ్ర అంతటా దొరుకును

కేసరికుటీరం లిమిటెడ్.
మదరాస్



## చందా వివరాలు

### దినపత్రిక ఆదివారపు సంచికతోసహా

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం చందా | ... | రు. | 36 | 0 | 0 |
| అర్ధసంవత్సరం చందా | ... | | 18 | 8 | 0 |
| 3 మాసముల చందా | ... | | 9 | 6 | 0 |
| నెల చందా | ... | | 3 | 4 | 0 |

### ఆదివారం వెలువడే వారపత్రిక

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం చందా | ... | రు. | 9 | 12 | 0 |
| అర్ధసంవత్సరం చందా | ... | | 5 | 0 | 0 |

### భారతి (సచిత్ర మాసపత్రిక)

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం చందా | ... | రు. | 6 | 0 | 0 |
| అర్ధసంవత్సరం చందా | ... | | 3 | 0 | 0 |

విడిప్రతి 8 అణాలు.



# డోంగ్రేగారి

బాలామృతము
బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును.

# అయోమార్గ విమర్శ

= శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు =



ఒకనాడు ఒక రైల్వే సంధిలో రైలెక్కి కూచున్నాను. వెడుతున్నానో వస్తున్నానో! – బహుశా వస్తున్నాను గావును, అవునవును వస్తున్నాను. ఇటేం డౌన్! సాయంత్రం పొద్దు బాగా వాలిపోయింది. కిటికీకి చేరువుగా ఒకమూల కూచున్నాను. కొత్త ఉమ్మేసుకున్నా చేసినా, ఎప్పటికప్పుడు మారిపోతూన్నట్టు గోచరించే పొలాలూ గట్రా చూసినా ఇదైనా, శూన్యంకేసి నిదానిస్తూ ఆలోచించుకున్నా నిద్దరోయినా, కిటికీదగ్గిరసా ఉంటేనే నయం అని, ప్రతీవాళ్లకీ ఏమో గాని, నాకు అనిపిస్తుంది. ఎక్కడికక్కడికే! ఆ ఉన్న దిక్కుమాలి చెరలో ఆ కిటికీదగ్గిర జానెడు స్థలం దొరకడం కొంచెం స్వాతంత్ర్యం. ఆవేళ ఖాళీగానూ ఉంది. అన్నట్టు అప్పుడు ఇప్పటంత రైలురద్దీ లేదు, అజ్ఞెంటూ లేదు, పేళ్ళాడ్డాలూ లేవుగా! పెట్టిలో జనం పోనిపోనిగా ఉన్నారు గాని, నన్నెరుగున్నవాళ్లెవరూ మాత్రం లేరు. అయినాసరే నా వార్తాపత్రిక నేను పైకి తియ్యలేదు. తీస్తే శోభ ఏమిటంటే, మనల్ని ఎరగని ఆంధ్ర ధనికులుకూడా పేపరు 'ఒక్కమాటు' కోరి దానంపట్టి చదువుతారే కాని మానసిక క్షుద్బాధ పరాయివాడి ఖర్చుమీద తీర్చుగోడం అధమాధమం అనే సంగతి ఆలోచనే చెయ్యరు. మరి పుస్తకాలు పైకి తీసినా అంతే! తెలుగువైతే, తెలుక్కి దిక్కు లేదు గనక, అడక్కుండానే తీసుగోడానికికూడా ఇతరులకి హక్కుందిట. ఇంగ్లీషువైతే, ఇతరులు అడిగి మర్యాదాగా బలవంతపెట్టి గడుసుగా చదువుకుని తమరు దిగి వెళ్లిపోయేదాకా మాత్రం అట్టే పెట్టుగుని, వందనాలతో వాపసు చేస్తారు. అందు కని, వింత భాషలో పుస్తకం చూస్తూండడం తెలుగు రైల్లో కర్తవ్యం. సరి, రైల్లో చదువుకోసం అంటూ భాషలెక్కడ నేరుస్తాం గనక! ఆ మామూలు పుస్తకాలకే అట్టలువేసి మాటెట్టుగుని ఎల్లానో తంటాలుపడతాం. ఏమైతేం, రైల్లో పుస్తకాలు విస్తారంగానే చూడచ్చు, చూస్తూంటాను. సరి, ఆ రోజున, ఒక ఉర్దూ గణితం గావును పైకి తీసి, సంచీకట్టులోంచి ఓకిల్లీ కట్టి వేసేసుగుని, పుస్తకం విప్పి చూస్తూ కూచుంటిని గదా, అవతలకాను ఎదరకిటికీదగ్గిర నే నెప్పుడూ ఎరగని ఇద్దరు వ్యక్తులు నా పుస్తకం పైఅంచుమీంచి నాకు గోచరించారు. ఒకఅతను పేనుమీసంతో సళాకుగా ఉంటే రెండోఅతడు కుదిమట్టంగా ఒక్కురవ్వ పిప్పళ్లబస్తాలా ఊరుకోడమేకాక ముక్కుకింద వక్కల్లాంటి పరకమీసం కూడా పెట్టించాడు. మొదటి ఆతడి జుట్టు కోతకొచ్చి వాలిపోయి పడుకున్న పైరులా ఉంటే, రెండో అబ్బిది ఖరాగా ఉంగరాలే. మొదటి ఆసామీ దగ్గిర కోరడా ఉంది, రెండో ఘటందగ్గిర మెలికెలుతిరిగిన కొంకి బెత్తం ఉంది. ఇద్దరూ కూడా ధూమపానం చేస్తున్నారు. వాయువు నోటితో గ్రహించి యథాశక్తిగా కుంభించి ముక్కుతో వొదిలేస్తూ వేదోక్తంగా వాళ్లు చేసిఉంటే వాళ్ల రోగాలు హరించి వాళ్ల క్షుద్బాధకూడా తగ్గిపోవలిసిందేగాని, ఆచరణ యావత్తూ అక్షరాలా యథావిధిగా ఉన్నా, అప్రత్యక్షవాయువుబదులు వాస్తవిక ధూమం వాళ్లు స్వీకరించడం వల్ల ఫలితాల గురించి నాకు సందేహం తోచింది. చఫ, నేనెవణ్ణి వాళ్ల ఆనందం కాదన

డానికీ, విమర్శించడానికీ అనుకుని నేను యథార్థంగా పుస్తకం చదువుకోడం ప్రారంభిద్దాం అని యత్నించేసరికి సళాకు అబ్బాయి నాకేసి చూస్తూ పిప్పళ్లబస్తాని మోచేత్తో మెల్లిగా రెండుమూడుసార్లు అదమడం మొదలెట్టాడు. ఇదేదో గ్రంథంలా ఉందనుకుని, నేను కిటికీకేసి తిరిగి ముఖం పక్కకి పెట్టుగుని వాళ్లు వ్యవహరించుకునేటందుకు లైక్క్లియర్ ఇచ్చేశాను. అనగా వాళ్ల సంగతి కనిపెట్టడానికి వీలైనంత లైన్క్లియర్! వాళ్లు చేసుకున్న సంజ్ఞల్నిబట్టి తమరనుకున్న మనిషి నేనే అయినట్టు వాళ్లు ఖాయపరుచుకున్నారని నాకు అనిపించింది. వాళ్లు తమరి మనస్సులో ఎవర్నో అనుకుని నన్ను చూసి పొరబడుతున్నారనికూడా నాకు వెంటనే బోధపడింది. వాళ్ల చేతుల్లో కర్ర లున్నాయి. ఉంటేం, లైలుగదా. కానీ, మనమూ వాళ్లకి ఆశాభంగం కలక్కుండా వాళ్ల కోరికప్రకారమే నటిద్దాం, ఒకవేళ కర్మవశం చేత వాళ్లు కర్రలు తిరగేసి వాదతమకంలో నన్ని రుంజావాయించినట్టు వాయించే ముహూర్తం రాగానే నిజం చెప్పేద్దాం, అని నే ననుకున్నాను. నాకు బోధపడేటట్టు వాళ్లిద్దరూ ముందు ఈరీతిగా ఉపోద్ఘాతం ప్రారంభించారు :

స—అల్లా పదరా, మొహం ఈడిచి కనుక్కుందాం.

బ—ఉండరా, నిమ్మళం.

స—నిమ్మళం ఏమిట్రా, చీరేస్తాను. భయమా? ఏం చేస్తాడు ?

బ—చోరికాడు, ఇప్పుడేం చెయ్యగలడులే! అయినాసరే నిదానించు.

స—నేన్నిదానించన్రా ! మాటా పడి,ఛాన్సూ వొదులుకుని నువ్వు కూచో !

బ—అబ్బ ! ఏమనిరా అడగడం ?

స—సరే, శాస్త్రం చెప్పినట్టుంది.

బ—మనికి శాస్త్రం రాదుగా, మనిది కళగా!

స—అదే, మాకళగురించి ఎందుకు విమర్శించావంటాను. నిరుత్తరుడై ఊరుకోకూడదంటాను.

బ—కళగనకనే విమర్శించావంటే !

స—నీతాఖతేమిటి, నువ్వెవడవ్ అని అడుగుదాం.

బ—కళాసృష్టికిలాగే కళావిమర్శకి కూడా తాఖతంటూ లేదు, ప్రతీవాడూ పనికొస్తాడంటే !

స—సరిసరి. నువ్వప్పుడే వైరిదగ్గిర వకాల్తీ పుచ్చుకున్నావా ఏమిటి ?

బ—కాదురా ! విమర్శకుడికి హక్కు లున్నాయిగనక, ఆహక్కులన్నీ సాధించుకున్నానని ఆయనంటే !

స—విమర్శకుడికి హక్కు లుంటాయన్న మాట నిజమేకాని, నువ్వు విమర్శకుడవని నీతో ఎవరు చెప్పారని మనం అంటే !

బ—మంచిరోజు చూసి నేనే అనుకున్నానని ఆయనంటే!

స—అయినా సరే చిక్కొచ్చింది, జవాబు చెప్పాలని మనం అంటే ! తీరిపోదూ ? నువ్విక్కడే కూచో మీనమేషాలు లెఖ్కెడుతూ !

అంటూ సళాకు నాసరసని వచ్చి కూచున్నాడు. బస్తాఅబ్బాయికూడా అనుబంధంచేత ధైర్యం తెచ్చుగుని వచ్చి నే కూచున్న కానులోనే ఎదటి చెక్కమీద అధిష్ఠించాడు.

స—(నాతో) ఎందుకయ్యా, మీకు మామీద ఈర్ష్య ! (అని కొరగడా గుప్పిడిలోంచి కమ్మచ్చు లాగాడు.)

నా కిల్బిషసంతం నామీదగాని, వాళ్లమీదగాని పడకుండా నేను నోరు పైకెత్తి, 'లేదు' అనడానికి యత్నించి బ్రహ్మాండంమీద 'లేదు' అనేటట్లుగా దాన్ని ఉచ్చరించి, నాహృదయంలో ఈర్ష్య ఎంతమాత్రమూ లేదని ఇంకా స్పష్టంచెయ్యడానికి చెయ్యి తిప్పి, మీరిద్దరూ ఎవరు అని అడగడం వ్యక్తం అయేలాగు ఒకరితరవాత ఒకర్ని చూపిస్తూ, కుడిగుప్పిడి ఊగించాను.

స—(బస్తాతో) చూడరోయ్! వీడి ఫార్సు, మన్ని ఎరగనే ఎరగట్ట.

బ—ఎరక్కపోడం ఏం రోగంరా, నిక్షేపంలా ఎరుగును.

స—మామీద అనృతాలు రాయడానికి నీకు మేం చేసిన ద్రోహం ఏమిటయ్యా?

నే—(మూతి పైకిపెట్టి) నేను,గొప్పవాణ్ణి, నాకు హుక్కుం 'డి'.

స—అయినా సరే మామీద నీఅభిప్రాయం కావాలని దేశం ఎప్పు డేడిసింది?

నే—(పైకే చూస్తూ) నీకళ? (అనే మాటలు మాత్రం పలకగలిగి, 'కావాలని మట్టుకు దేశం ఎప్పు డేడిసింది?' అని అర్థం అయేట్టు సంజ్ఞ చేశాను)

స—నాకళ నీకు ఒక్కడికే బాగుండకపోతే ఏం కొంపమునిగింది? తక్కినవాళ్లకి బాగుండకూడ దంటూ శాసిస్తావా? ఇష్టంగా భోంచేస్తూన్న వాళ్ల దగ్గిర కెళ్లి పదార్థం ఏడిసినట్టుందంటూ కక్కుగోడం ఎందుకూ తిననివాడూ, లేచిపోకా?

పల్చపల్చగా ఉన్న జనం అంతా మేం కూచు న్న భాగంలోకి వచ్చి సర్దుకున్నారు. వాళ్లిద్దరూ నన్ను తకాయిస్తూంటే నేను కిల్లీతోపాటు నీళ్లు నము లుతున్నానని తక్కినవాళ్లు అభిప్రాయపడుతూన్నట్టు నాకు గోచరించింది. నేను తగ్గ సమాధానాలు చెప్పి వాళ్లని తెగ్గొట్టాలని నిశ్చయించుకుని, గర్జించి సకిలించి కిల్లీ యావత్తూ ఉమ్మేశాను. దిక్కుమాలి ఈదురుగాలి మూలాన్ని నా మొహంనిండా చినుకులు పడ్డాయేమో, కళ్లుకూడా కలికం వేసినప్పటికిమల్లే భగ్గుమన్నాయి. నాకు నిజంగా మనిషి కొచ్చినంత కోపం వచ్చేసింది. అగ్గైపోతూ, నేను తీవిగా కూచుని, సళాకుతో—

నే—ఏమిటండీ మీరు నన్నడిగేది?

స—మాకళమీద అసంపూర్ణంగా, అసంద ర్భంగా, అర్థకుసిగా, అధ్వాన్నంగా, అర్థంచేసుకో కుండా మీరు ఎందుకు రాశారని.

నే—నేనేమీ రాయలేదే!

స—బరితెగి రాసి అబద్ధాలుకూడా ఎందు కయ్యా! నాజూకుగా విషం కక్కుతున్నాననీ, సూక్ష్మక్రమతో సూక్ష్మకాలంలో పేరు లాగాలని యత్నించాననీ అనరాదూ తీరిపోతుంది!

బ—పోనీ చేతగానితనంవల్ల అని ఒప్పుగోకుం డదూ!

స—జనాదరణకి ఏది లక్ష్యమో దాన్ని ఛీఛీ అనేస్తే తద్వారా జనదృష్టిలో పడచ్చునని గావును తమరి సంకల్పం!

నే—కాదు, నా సంకల్పం వేరు.

స—వేరు కాదు. జనదృష్టిలో పడడానికి కాక పోతే నీ ప్రకటన లెందుకూ?

నే—నా సరదా ఉండబట్టలేక.

స—మంచి సంగతే. సరదాలు ఊళ్లోనా మరీ!

ఏదో స్టేషను రావడంవల్ల రైలాగింది. నేను ఒక సోడా పుచ్చుగుని, కిల్లీ కట్టుగోడానికి యత్ని స్తూ, వాళ్లు దిగవలిసింది ఆ స్టేషనేమో అని కనుక్కు న్నాను. నన్ను గోదావరివంటిచోట దింపండీ తమరు దిగరన్నాడు బస్తాఅబ్బాయి. బాగా అన్నాడని మెచ్చుగుందాం పోనీ అంటే, నామీదే అన్నా డాయిరి! వాళ్లు నన్ను వొదిలేలాగ కనపడలేదు. ఏమిరా దారీ అని నేను చూస్తూండగా, కొందరితో పాటు, సూటువేసుగున్న ఓ టోపీఆయన మా పెట్టె లోకి వచ్చి మాకు ఎదర అవతలకొసులో కూచు న్నాడు. నా ప్రతికక్షులు ఆయన్ని ఎరుగున్నట్టు దాఖలాగా ముఖాలు విప్పారు. ఆయన 'ఇదుగో, ఇంటికేనా!' అన్నాడు. సళాకు అవునన్నాడు. వాళ్లు కుశలప్రశ్నలు కానిచ్చుగుంటున్నారు. నేను కిల్లీ కసబిసా కోపంగా నమిలిపారేసి, వాళ్ల కళ ఏమై ఉంటుందా అని బుర్రచించుగుని, వాళ్ల మొహాల మీది కళనుబట్టి వాళ్లది టాకీకళగాని, గ్రామఫోను కళగాని అయివుంటుందేమో (అప్పట్లో రేడియోకళ లేదు గనక గావును) అనుకున్నాను. అల్లాయితే వీళ్లు నామీద తప్పకుండా పొరపాటువల్లే విరుచుకు పడ్డా రనుకున్నాను. ఒకవేళ నటులేమో అంటే వాళ్లు నన్నుగాని, నేను వాళ్లనిగాని గుర్తించుగోలేని అవస్థ రాదని నాకు తెలుసు. గానమో, కవనమో

వాళ్లి కళ అనుకోడానికి నాకు ఆస్కారం కనిపించలేదు. ఈ కాన్వేపట్లోనూ ఆ టోపీఆయనకికూడా వాళ్లు తమ ప్రస్తుతపు పని బోధపరిచి, ఆయన్నికూడా తమలో కలుపుగుని ముమ్మరంగా తయారయారు. ఇక్కడికి ముగ్గుర్నీ కూర్చొపుట్రా ప్రభో అనిపించి, నేను వాళ్లు అనుకునేవాణ్ని కాను అని చెప్పేసి బయటపడదా మనుకున్నాను. కాని, వాళ్లు నమ్మకంగా కూడబలుక్కున్నట్టు, ఒకడు ఆగేసరికి రెండోవాడు, వాడు మానేసరికి మూడోవాడు, వాడు తగ్గేసరికి మళ్లీ మొదటివాడు ఇల్లాగ్గా ఉప్పు అందిపుచ్చుకుంటూ చక్రక్రమంలో తెంపులేని ధోరణిలో పడిపోయి నన్ను దుయ్యబట్టుగుని, నోటికొచ్చినట్టు తడుపుకోకుండా మాటలూ, చేతికొచ్చినట్టు స్వేచ్ఛగా ఆయుధాలూ (మొదటివాడు కొరడా, రెండోవాడు కొంకి బెత్తమూ, మూడోవాడు గొడుగు టోపీ) ప్రయోగిస్తూ వ్యవహరించి, నాకు ఊపిరి సలపకుండా, మెడ నిలవకుండా చేసేశారు. వాళ్ల మాటల్లోని క్రమం మాత్రం వొదిలి వృత్తాంతం పోగుచేస్తే, ఇల్లా ఉంది:

స—చటుక్కున చెప్పండి! మీ ఉద్దేశం ఏమిటి? విమర్శించడం అంటే అభిమానంకొద్దీ పీలు చేసుగుని వందిలా పొగిడి, లేకపోతే అసూయకొద్దీ కసాయిలా నరకడమా? దూదినిలా ఏకడమా, పందిలా బాదడమా, శవాన్నిలా పాతెయ్యడమా? కళాకర్త మచ్చుమాపడమా? దోషాలగురించి తంటసం పట్టించడమా? పాతసూత్ర శవ ప్రమాణాలతో కళాజీవాన్ని కొలవడమా? పాతఅర్థమూ, కొత్తఅర్థమూ ఏదీ తేలకుండా ఉండే పారిభాషికపదాలు ప్రయోగించి మాట్లాడడమా? ఒకేఉదాహరణతో సూత్రించడమా? 'మంచి' 'చక్కని' 'అందమైన' 'సుందరమైన' 'బాగా ఉండే' 'ఉచిత' వంటిపదాలు బతికున్నవాళ్లందరికీ కూడా మీ ఒక్కరికే ఎంతఅర్థం ఇస్తాయో అంతే అర్థం ఇస్తాయనుకుని భ్రమించి వాడెయ్యడమా? ఇల్లాయితే బాగుండేది,అల్లాయితే ఘనందుగా ఉండేది, జాకీ దిగితే ఆట నెగ్గిఉండేది, పాడి ఆడిఉంటే బేస్తు నెగ్గేది అన్నట్టు జరిగిన యథార్థం జరిగినరీతిగా జరిగి ఉండకూడదని వాపోవడమా? మొగపెళ్లివారితనం అభినయించడమా?

బ—అందుకనే, నన్నడిగితే,కళావిమర్శ వ్యర్థం. కళకీ, ఆరగించేవాళ్లకీ మధ్య ఇరుక్కోడం బత్తెంలేని వరకం. మధ్యనుండి యథార్థం చెప్పచ్చునంటారా? చూడండి. ఉన్నది ఉన్నట్టా, ఉన్నది లేనట్టా, లేనిది ఉన్నట్టా, లేనిది లేనట్టా, 'చెకుముకిశాస్త్రి' చెప్పినట్టూ! ఉన్న కళని ఉన్నట్టు మీరు చెప్పలేరు అదే చెప్పాలిగాని. మీరు చెప్పబూనడం హాస్యాస్పదం, చెప్పడం అసంభవం. కళాశరీరాన్ని ముక్కలకింద కోసి మరోరూపంలో అజ్ఞానులకి వడ్డించి ఎల్లా ఉందనడం ఘోరనేరం. ఉన్నది లేనట్టు చెప్పడం స్వామిద్రోహమూ, మాత్సర్యమూగనక అది కళాభిలాషులకి తెలిసిపోయే దౌర్జన్యం. లేనిది ఉన్నట్టు బట్రాజుతంతుగా చెబితే, విమర్శ ఏకమొత్తంగా కుక్కముట్టుగుపోతుంది. లేనిది లేనట్టు చెప్పడం మొదలెడితే ఆయుర్దాయాలు చాలవు. ఉండేసింది చెప్పడానికి విమర్శ కేవలచరిత్రకాదు, ఉండబోయేది చెప్పడానికి కేవలజ్యోతిషం కాదు, ఉండవలిసింది చెప్పడానికి కేవలశాసనం కాదు, ఉండతగ్గది చెప్పడానికి కేవలనీతిపాఠం కాదు, నాయిష్టం అనడానికి ఇంట్లో ముచ్చట కాదు.

టో—ఉండాలి ఉండాలి. విమర్శ అంతగా అనవసరం అని నేను నమ్మను. దాని ఉదయం కళాతరంగం పూర్తిఅయినతరవాత! కళకి భావన ఎల్లాగో విమర్శకి విచక్షణ అల్లాగ. కళ బాల్యసూచకం, విమర్శ వృద్ధత్వచిహ్నం. కళ జనకం అయితే విమర్శ జన్యం. దీర్ఘ మనన, కళాకర్తహృదయావగాహన గురించి నిరంతరాలోచనా, నిదానం, సుముఖత్వం, హృదయవైశాల్యం, అహంకారరాహిత్యం, కళలో ఉండగల ప్రత్యేకమాహాత్మ్యన్ని కనిపెట్టడానికి ఓపికా, మన్నించడానికి వినయమూ,సాటించడానికి కుతూహలమూ, చెప్పడానికి తాళికా, తోడగడానికి భాషా గల వ్యక్తిచేసే కళావిమర్శ కూడదనే మానవు లుండరనుకుంటాను. అటువంటిది వీరివల్ల కానంత మాత్రాన్ని అపనే కూడదని చెప్పిపారెయ్యడం సమంజసం కాదు.

ఈసమయంలో నాకు మరి కోపం ఆగక, తారస్థాయిలో మనమూ అందుకుందాం అని లేచాను. ఇంతలో కైలాగితే కూచోపడ్డాను. తక్షణం మళ్లీ లేచి 'ఏయ్ సోడా' అని కేకేసి, "ఉండండి, మీమాటేమో గాని నాకు దాహం వేస్తోంది" అని పెట్టెగుమ్మందగ్గిరికి పరిగెట్టి సోడా కొట్టించి పుచ్చుగుని, డబ్బులిచ్చేసి గబగబా వచ్చి కూచోడంలో మొహం మహజోరుగా పెట్టేశాను.

నే—అయ్యా! ఒకటిరెండుమూడులారా! ఏమిటి మీ నిర్బంధం? నన్నేం జెయ్యమని తమ సెలవు? తమరి దస్తరాలు కట్టేసినట్టేనా? ఏం జెయ్యమన్నారు?

స—ఇంకా చెయ్యమని కాదు. వెనక తమరు చేసినదాన్నిగురించే! మామీద కుళ్లు మీలోపల ఎందుకు పుట్టి పెరిగిందీ అని.

నే—నాలో కుళ్లు చిన్నమెత్తైనా లేదు. నే సత్యం చెప్పేస్తున్నాను. నేను మీమీద ఏమీ రాయలేదు. మీరు నన్ను చూసి ఎవరో అనుకుంటున్నారు.

స—అదుగో మళ్లీ! నాలికా తాటిపట్టేయ్యా? మీ పేరు ఫలానాకాదూ?

నే—అవును.

స—అయితేమరి ఇహనేం? మేం పొరపాటు ఎక్కడ పడ్డామూ? సమాధానం చెప్పండి, లేకపోతే క్షమాపణేనా కోరుకోండి.

పూర్వవిషయం ఏదీ నాకు స్ఫురించలేదు. వాళ్ల పేర్లు కనుక్కోడానికి నాకు అసహ్యం వేసింది. నే ప్రకటించిన ఉమ్మడివాక్యం ఏదో స్వంతానికి అన్వయించుగున్న వ్యక్తు లేమో వీళ్లు అనుకున్నాను. అయినా, పోత్తిపుణ్యానికి క్షమాపణ కోరుకోడానికి నామనస్సుని నేను నచ్చగొట్టలేక ఇల్లా అన్నాను:

నే—నేను తప్పు చెయ్యలేదుగనక క్షమాపణ కోరుకోను. కాస్కోండి, వినండి. విమర్శ నాయిష్టం. మీయిష్టం మీదయితే నాయిష్టం నాది. నాపని నాకు జన్మహక్కు! మీరు ఉన్నవే చూడలేనివాళ్లయితే, నేను లేనివికూడా చూడగలను. కళకి చీడ పడితే నేను చూస్తూ ఊరుకోలేను. అభిరుచులు పాడవుతూంటే నేను భరించలేను. నేను ముళ్లడొంక ఛేదిస్తాను, కుళ్లుచెత్త కడిగేస్తాను, 'అంగవ్రాతములో చికిత్సకుడు దా దుష్టాంగంబు ఖండించి'—జాగ్రత్త. నాదృష్టిలో కళాకర్త మొదటి ముద్దాయీ, వాడి కళ రెండో ముద్దాయీ కాగా, వాదీ, వాదిప్లీడరూ, ప్రతివాదీ, ప్రతివాదిప్లీడరూ, సాక్షులూ, ఉత్తరసాక్షులూ, దక్షిణసాక్షులూ, పంచాయతీజడ్జీ — ఇవన్నీ నేనే, లక్ష్మణకవే అవతలకథలో లక్ష్మణుడూ, రాముడూ, ఆంజనేయులూ అవుతూన్నట్టు. ఘోరకృతులు చేసిన కళాకర్తని నేను ఉరితీసిపారేసి ఆంధ్రజనానికి వాడివల్ల రాగల అపాయం తొలగిస్తాను. నన్నాశ్రయించడాన్నిబట్టి నేను కళాకర్తల్ని పైకి తీసుగురాగల్ను. అవసరాన్నిబట్టి నేను తప్పుల్ని గొప్పచెయ్యగల్ను, లేకపోతే ఒప్పుల్ని కప్పెట్టగల్ను. కళాకర్తలంతా తరవాతతరవాత వారసత్వంగురించి తన్నుకుచావకుండా ప్రతీవాడికీ తలోజాగా కేటాయించి, వాళ్లకి చీడీలు కట్టేసి ఉచితస్థలాల్లోకి వాళ్లని జేరేసి, నా అనుజ్ఞ లేకుండా వాళ్లు పైకి ఎగరడానికిగాని, కిందికి పడడానికిగాని వీళ్లు తగ్గిపోయేటట్టు వాళ్లని మేకుబందీ చేసి పారేస్తాను. ఎక్కడేనా బావగాని వంగతోట దగ్గిర కాదన్నట్టు, కళాకర్త నాకు ఎంత దగ్గిరచుట్టం అయినాసరే,ఎంత ఎరుగున్నవాడైనా సరే కళలో పస లేనప్పుడు నిర్మొహమాటంగా వాణ్ణి తెగ విమర్శించి విమర్శించి వొదిలిపెడతానుగాని ఊరుకోను. అందుకని గుంజు లేనివాళ్లకి నేనంటే తార్! నాకు సన్మానం జరిగినప్పుడు 'కుకృతికుతార్'అనే బిరుదం నాకిస్తే నేను అభ్యంతరం చెప్పనని చాలామంది అనుకోడమూ, ఊహించుగోడమూ నాకు తెలుసు. నా తాఖీతుగురించి మీరు దుఃఖించకండి. నాఅంత జ్ఞాని విమర్శపాటి చెయ్యడా? అందులోనూ కళావిమర్శ చెయ్యడానికి ఆ కళ రానక్ఖర్లేదు అనికాదు నేనదేది, ఆ కళ వచ్చి ఉండకూడదు అనికూడా నొక్కుతాను. అప్పుడుగాని ఆ కళయొక్క అసలు నిగ్గు తేల దంటాను. పాసం విమర్శించడానికి పాఠం చెప్పని ఇనస్పెక్టరే తగునని నా అభిప్రాయం. తెలుసుగానవిమర్శకి హైందవేతరుడు చాలు, తెలుగుచిత్రవిమర్శకి ఆంగ్లయ్య ఉండాలి,

తెలుసుకవితావిమర్శకి అరవయ్యారు నిరాక్షేపణంగా ఉండచ్చు, సరి తెలుగునాటకప్రదర్శనవిమర్శకి స్పృహలేనివాడు మరీలకప్కన సరిపోతాడు. సత్తా లేకపోతే మీరు కళ మానుకుని మరోపని చూసుగోండి. మీరు చవటకళ సృష్టిచేసినన్నాళ్లు నేను తీవ్రవిమర్శ మానను. ఎక్కే గుమ్మమూ దిగే గుమ్మమూ మోస్తరై మీరు ఎవరిదగ్గిరికి ఎన్నిసార్లు వెళ్లి ఎంత ఏడుచుగున్నా, నా వాతలు నే పెట్టితీరతాను. మరి నే దిగే స్టేషను వచ్చేస్తోంది. జ్ఞాపకం పెట్టుగోండి.

స—చాల్లేవయ్యా! ఆకారమా నీ కాధారం? నామాలా నీకు ముఖ్యం? నీమాలా నీకు శరణ్యం? రూపాలా నీకు జీవం? ఆత్మఘోషణా నీ ఆంతర్యవృత్తి? వ్యక్తిదూషణా నీపరమావధి? సంకుచితత్వమా నీజ్ఞానం? నీచసాపత్యాలు తెచ్చా నువ్వు ఒకడి ఔన్నత్యం స్థాపించడం! నీమనస్సులో ఉందని నువ్వు అనుకునేదా నీకు ప్రపంచంలో సందర్శించవలిసిన కళ? నువ్వు కళాచార్యుడివా అల్పులకి కళోపదేశం అడక్కుండా చెయ్యడానికి!

బ—అయ్యా! కళాప్రారంభకుణ్ణి విమర్శించడం పిచ్చిగమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించడం. కళావర్తకుణ్ణి విమర్శించడం చెవిటివాడికి శంఖూదడం. కళారాధకుణ్ణి విమర్శించడం కుమ్మరవీథిని సూదులమ్మడం. కళాజీవిని విమర్శించడం పొట్టమీద కొట్టడం. స్థిరపడ్డ కళాకర్తని విమర్శించడం ఏటికి ఎదురీదడం. కంటూన్న కళాకర్తని విమర్శించడం చెవులోని జోరీగఅవడం. అల్పుడైన కళాకర్తని గొప్పగా విమర్శించడం వాడితోపాటు అధోలోకానికి టిక్కట్టు కొనుక్కోడం. ఊరుకుంటే చాలా సంగతులు సవ్యంగా పరిష్కారం కాగలవ్. ఉత్తమకళాకర్తకి విమర్శ మోకాలిబంటి. అధమకళాకర్తని అనామకంగా విడిచిపెట్టడం ఉభయతారకం.

టో—అబ్బ! నువ్వు విమర్శ అంటే చెడు అర్థమే లాగుతున్నావయ్యా! అదేం ధర్మం! విజ్ఞానాన్ని బట్టి అన్నిటిలోనూ మాత్సర్యం తగ్గించుగోవాలి. విమర్శ అంటే, వెనకటికిమల్లేనే నెత్తిమీద మొట్టికాయ కాదు, మొహంమీద చెప్పు కాదు, కంఠానికి ఉరి కాదు, నోట్లో పుండు కాదు, వీపుమీద చరుపు కాదు. "బాహ్యస్థితిగతులవల్ల తన చిత్తవృత్తిలో గలిగిన పరివర్తనలు అన్యహృదయాలకి కలిగించాలనే సదుద్దేశంతో కళాకర్త చేసే ప్రకటనని వ్యాసంగం చేసుగోడమే" విమర్శ. కళాకర్తయొక్క భావనాశక్తికీ, విచక్షణకీ సమత సమర్థించడం విమర్శ. ఆంతరబాహ్యచరిత్రల్ని పరిశీలించి, ఏదైనా కృతి జనించడానికి దేశకాలపాత్ర సందర్భాలు ఎట్లు పరిపక్వం అయినాయో, మరి ఆ కర్తే ఆకృతి రచించడానికి పరిస్థితులు ఎట్లా అనుకూలించాయో కనిపెట్టడం విమర్శ. అనేకకృతులు రచించడపు పనిలో కళాకర్త పడిఉండేటప్పుడు వాటిని విడివిడిగా దేనిమట్టుకి దానిని సమగ్రంగా ఆస్వాదించడపురీతి చెప్పడానికి ఒక్కొక్క కర్తకి వ్యవధీ, ఒక్కొక్కకర్తకి నేర్పూ, ఒక్కొక్క కర్తకి ధైర్యమూ, ఒక్కొక్కకర్తకి నిర్మొహమాటమూ చాలవుగనక అటువంటి పని చెయ్యగలగడానికి విమర్శ అవసరం అంటాను. కళని విమర్శించేవాడు కర్తయొక్క నిజమైన అవస్థగ్రహించడానికి కర్తవంటివాడై, తరవాత ఎంతో శోధ పడ్డమీదట కర్తయొక్క హృదయస్థితి వహించగలిగితే, అక్కడికి అతడికి ఇల్లలకడం అయి, స్వంతపని యావత్తూ మరి ముందుంటుంది. ఒక సార్థకకళలోని ప్రతిభ కర్తే వచ్చి చూపించేకంటే మరొకరొచ్చి ప్రకటించినప్పుడు కూడా ప్రజల్లో కళాసక్తీ, కళారాధనా హెచ్చుతాయేగాని తగ్గవు. నిశ్చయమైనతేజస్సు గల కళ తనచుట్టూ గల అనేకజనాజ్ఞాన మేఘాలవల్ల మాటుమణిగిపోయినప్పుడు వాటిని పటాపంచలుచేసి ఆకళయొక్క తేజోలాభం ప్రపంచానికి కలగచేసే ప్రయోజనం విమర్శ. కర్తయొక్క హృదయ విహారాన్ని కర్తకంటేకూడా ఎక్కువ వివరాలతోకూడా గుర్తించగలిగాడా ఇతడూ అనిపించగలవాడు అన్నదే విమర్శ. క్రౌర్యం లేని స్వాతంత్ర్యమూ, మెట్టవేదాంతం లేని జ్ఞానమూ, మొట్టికాయలు వెయ్యడపు సరదా లేని ఇంగితజ్ఞానమూ, పటాటోపం లేని పాండిత్యమూ, చాటుచాటు శౌర్యం లేని త్రికరణశుద్ధీ, స్వాతిశయం లేని దర్జా,

కాకిచూపు లేని దృష్టీ, మేష్టరీతనం లేని అధికారమూ, ఉచోద్యం లేని హృదయమూ విమర్శకుడు కనపరుస్తాడు. నవ్యసృష్టిని పోల్చుకోగలిగి, నవ్యవిషయాల్ని స్వీకరించగలిగి గూఢంకాని హృద్యభాషలో కళ దొరికే చోట్లు ఇవిగో అని చెప్పడమేకాక, చెప్పగానే జనానికి విశ్వాసంకూడా కలిగించగలిగి నెగ్గినవాడు చెప్పిందే విమర్శ.

ఇప్పటికి నా ప్రయాణం చాలావరకు అయిపోయింది. మరి తరవాత స్టేషన్లో నేను దిగిపోడమే. నాకు ధైర్యం వచ్చింది. టోపీ ఆయన ఏదో శ్రమపడి ఏకరువుపెట్టాడుగాని, అదంతా నాకూ తెలుసు. అదంతా పుస్తకాల్లోదే, ఎటొచ్చీ ఏది ఎక్కడిదో అతడు చెప్పలేదు, టైం ఇస్తే నేను చెప్పేస్తాను. చివరముక్కలు నేనే అనేసి ఆ రైల్వేసారస్వత గోష్ఠి ముగించెయ్యాలని నాకు అనిపించింది.

నే—(టోపీ ఆయనతో) స్వామీ, తమ పేరు?

టో—దాసు.

నే—నమస్కారం. మీతో నేను ఏకీభవించను. దేశాభిరుచి పాడైపోయింది. కొన్నికొన్ని మంచికృతులున్నా వేళాకోళపురకం ఎక్కువైనాయి. వాటికి గౌరవం రాకుండా చెయ్యడం పని నామీద, నా భుజస్కంధాలమీద పడ్డది. ఒక్కొక్క కృతిలో లక్షదోషాలున్నా, మరి ఏమీ లేకపోవడమున్నా. పాడుకృతులకి తెగప్రచారం. వాటిల్లో నియమాలు బొత్తిగా లేకపోడం. అయినా సరే, జనం అల్లాంటి అసమర్థుల్ని పాటించి గౌరవించడం నాకు పరమాసహ్యం వేసి, జనం యెడల జాలికొద్దీ ఈ పాడుపనికి దిగాను. కలేజా ఉండి మొగతనం ఉంటే సమాధానం చెప్పండి.

టో—మీరు చెప్పారుగా! మేమూ నిమిషంలో చెప్పచ్చుగాని, ఒకొక్క సమాధానంవల్ల అల్ప విమర్శకి అనవసరపు గొప్పతనం వస్తుందేమో అనే భయంవల్ల మాట్లాడక ఊరుకోడం జరుగుతూంటుంది.

ఇంతలో మావూరు స్టేషన్ తాలూకు 'కులీ, కులీ, కులీ!' వినబడింది. రైలాగింది. నేను దిగేసి దాసుగారితో,

నే—సెలవండి. తమకి సోడా కావాలా?

టో—చిత్తం, అక్కర్లేదు.

నే—(కడమ ఇద్దరితో) మీరు సోడా పుచ్చుకుంటారండీ?

స—ఎంతమాత్రం వద్దు. మీ సమాధానరసంతో మాకు నోరూరి తృష్ణ పోయింది.

నే—(వాళ్లకి నమస్కరించి) అయ్యా! మళ్లీ మనం ఎప్పుడు కలుస్తామో! కొంచెం నిదానించి చెబుతారా, ఒక సంగతి అడుగుతాను.

స—అడగండి.

నే—మీమీద నే రాసింది మీ రెక్కడ చూశారూ?

స—మద్రాసు ఫలానా పత్రిక ఫలానా సంచికలో!

నే—ఉందా ఇక్కడ?

స—లేదండీ!

నే—నేను ఏరచనా పంపించలేదండీ, ఎల్లా అచ్చుడిందోగాని అచ్చుపడ్డ రచనా? మీరు టాకీవారా?

స—అవునండీ. మా పేర్లతో ఉంటేనే! స్పష్టంగా మీ ఇంటిపేరు ఉంటేనే!

నే—నా పేరుందా?

స—లేనట్టుందండోయ్! (బస్తాతో) ఏరా?

బ—లేదు.

నే—పేరులేకుండా ఫక్తు ఇంటిపేరా! అల్లా చెప్పండి మరి! ఆవ్యక్తి మరొకరు అయిఉండాలి.

స—మీకు దగ్గరవాడా?

నే—ఏమో! ఏ తూర్పు-పడమర సంబంధమో!

స—నిజంగానేనాండీ?

నే—నిశ్చయంగా.

బ—అల్లాయితే మీరు మమ్మల్ని క్షమించాలి. ఇందాకట్నించీ జరిగిందానికంతకీ బొడ్డుతుమ్మాలూ! మరి మమ్మల్ని విమర్శించింది మీరే అయినట్టు సమాధానం మొదలెట్టారే!

నే—ఏంచెయ్యనూ! మీరంతా అటకాయించేసరికి చేతావాతా అయినంతమట్టుకి తంటాలుపడ్డాను. కాని, ఏప్రమాదంవల్లనైతేం మీపరిచయభాగ్యం నాకు కలిగింది. కృతజ్ఞుణ్ణి. ముఖ్యంగా దాసుగారికి.

బ—అయితే, ఆయ నెవరో అల్లా ఇంటిపేరెట్టుగోడం ఎందుకండీ!

నే—ఇందుకే! లాభం ఏమన్నా ఉంటే జమకట్టుగోడానికిన్నీ, నష్టం వస్తే ఖర్చురాసెయ్యడానికిన్నీ ఏమో! లేక, అహంకారం చంపుగున్నా మమకారం వదల్లేకగావును.

బ—ఐతే చిక్కేనండీ. చాలారచన లున్నాయే అల్లాంటివి! వాటిల్లో అభిప్రాయాలన్నీ మీ నిశ్చితాభిప్రాయా లనుకుంటున్నాం!

నే—మరి అనుకోకండి. అటువంటి విమర్శనాశక్తి నాకు లేదు. మరి రైలు కదుల్తుంది. సరి, ఈ ఇనపదారివిమర్శ చాలుగానండి, ఇప్పుడిక హృదయాలు కుదటబడ్డాయిగనక సోడా పుచ్చుగోరూ?

ముగ్గురూ—అవశ్యం.

అనగా, వాళ్లకి సోడాలిప్పించి, కిళ్లీలుకూడా ఇప్పించి నేను నమస్కరిస్తూండగా రైలు కదిలిపోయింది.



నేడే చూడండి!



C. హొన్నప్ప భాగవతర్
U.R. జీవరత్నం
V.N. జానకి
T.R. రామచంద్రన్
నటించిన
అరవ
టాకి
పద్మా పిక్చర్స్ వారి
S.I.P.
రిలీజ్
S.I.
PUBLICITIES


# దేవకన్య

# Times have changed !



## TIME-KEEPERS

*in Shakespeare's Day*

రోజులు మారినవి

షేక్సుపియర్ నాటియొక్కయూ

నేటియొక్కయూ గడియారాలు



*& present day*



ఎక్‌స్ట్రా "ఎఫ్"

18 క్యా॥ సాలిడ్‌గోల్డు, హెవీకేసు .... రు. 280

రెగ్యులర్ అరబిక్ లేక న్యూస్టయిల్‌డయల్ అదే ఖరీదు



ఎక్‌స్ట్రా "హెచ్"

18 క్యా॥ సాలిడ్‌గోల్డు, హెవీకేసు .... రు. 345

వెస్టెండ్ వాచ్ కంపెనీ,

బొంబాయి .. — కలకత్తా.

షేక్సుపియర్ మహాకవి గడియారాల మొదటిదశను చూచాడు. అప్పుడు స్క్రూలు లేవు. గడియారంభాగాలకు పిన్నులు, రివెట్లు వేశేవారు. గీర్ కటింగు చేతితో బహుమోటుగా చేసేవాళ్లు. బ్యాలెన్సు స్ప్రింగుకు పంది వెంట్రుకలువాడేవాళ్లు. నేడో, గడియారాలు గత నాలుగువందలయేండ్ల పనితనం, పరిశోధన, విజ్ఞానముల అనుభవముతో తయారైనవి. ప్రాచీన, అధునాతన పరిశోధనాలు అన్నీ వెస్టెండ్ గడియారాల్లో మిళితమై వున్నవి. కావలసినవాళ్లకు కేటలాగుఉచితం.

రవాణాల ప్రతిబంధకంవల్ల ప్రకటించిన రకాలన్నీ సప్లయి చేయలేకపోవచ్చు. ఐనా, సాధ్యమైనంతవరకు, స్టాకులో వున్నవాటిని ఆర్డర్ల ప్రకారము పంపుతుంటాం.

# West End Watch Co

**Bombay** **Calcutta**

# పొంతనముల పద్ధతి

= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు = 

వివాహమునకు ముందు కన్యావరులకు పొంతనములను జూచుట మన దేశమందు సామాన్యాచారము. పరస్పరము ప్రీతిసౌహార్దములతో వారు దాంపత్యధర్మమును చక్కగా నిర్వహింపఁగల్గుదురా యని కనుఁగొనుటకే యీపొంతనముల పద్ధతి యేర్పరుపఁబడినది. కన్యనక్షత్రము, వరుని నక్షత్రము చెప్పినచో మన మాహూర్తికులు క్షణములో వ్రేళ్లెంచి వీరి కిన్ని గుణములు వచ్చునని చెప్పఁగలరు. సాధారణముగ వాడుకలో నున్న కూటములను, ఆనుకూల్యము పరిపూర్ణముగ నుండుపట్ల వానికివచ్చు గుణముల గరిష్ఠసంఖ్యయును ఈ క్రిందిజాబిత మాపఁగలదు:—

| కూటములు | గుణములు |
|---|---|
| ౧. వర్ణకూటము | ౧ |
| ౨. వశ్యకూటము | ౨ |
| ౩. దినకూటము | ౩ |
| ౪. యోనికూటము | ౪ |
| ౫. గ్రహకూటము | ౫ |
| ౬. గణకూటము | ౬ |
| ౭. రాశికూటము | ౭ |
| ౮. నాడీకూటము | ౮ |

మొత్తము ౩౬ గుణములు.

ఇవిగాక రజ్జు, స్త్రీదీర్ఘ, మాహేంద్రకూటములున్నుగా మఱికొన్ని కూటములు గ్రంథములలో వర్ణింపఁబడినవి. కాని వాని కంతగా ప్రచారము కానరాదు. పైని యెనిమిది కూటములకుఁ గల మొత్తపు గుణములు ౩౬ లో ౧౮ కి (౧౦౦ కి ౫౦ వంతున) తక్కువకాక గుణములు వచ్చినచో సామాన్యముగా పరీక్షాఫలము తృప్తికరముగా నున్నట్లెంచఁబడుచున్నది. కన్యానక్షత్రముతో వరుని నక్షత్రమును పోల్చి చూచుట యీ కూటముల పద్ధతికి మూలతత్త్వము. అనఁగా, కన్యజన్మకాలికచంద్రస్థానముతో వరుని జన్మకాలికచంద్రస్థానమును పోల్చి యా రెంటికిని రకరకములగు సంబంధములను గుర్తించుట.

జాతకములో తొమ్మిది గ్రహము లున్నవి. పైగా అన్నింటికి ప్రధానమైన లగ్న మొక్కటి కలదు. ఇన్నిటి మధ్యమున చంద్రు నొక్కనినిమాత్రము పొంతనములలో నుపయోగించుట చాలునా యను సందేహమున కవకాశమున్నది. కాని యీ ప్రశ్నకు మన ప్రాచీను లిట్లు సమాధానమిచ్చిరి:

"జన్మలగ్న మిద మంగ మంగినాం
మేనిరే మన ఇ తీందుమందిరమ్,
సౌహృదంతు మనసో ర్న దేహయోః
మేలక స్తదయ మిందుగేహయోః"
(వివాహబృందావనము)

మానవులకు జన్మలగ్నము దేహము; చంద్రరాశి మనస్సు. సౌహృదము మనస్సులకేకాని దేహములకు సంబంధించినది కాదు గనుక పొంతనములను చంద్రస్థానములకే చూడవలయును. ఇది పై సూత్రభావము. ఈ యుక్తి సమంజసముగనే యున్నది. దాంపత్యవిషయమున సౌహార్దమునకే హెచ్చువిలువ యుండవలయు ననుటకు ఎవరి యాక్షేపముగాని యుండదు. కాని ఇతరవిషయములే అక్కరలేదా?

"శారీరం లగ్నవశాత్ సుఖదుఃఖం మానసం శశాంకవశాత్" అను సూక్తి ననుసరించి మానసికసుఖదుఃఖములు జన్మచంద్రునినుండియు, శారీరకసుఖదుఃఖ

ములు జన్మలగ్నమునుండియు సూచింపఁబడునుగదా? ప్రశంసలోనున్న కన్యావరులకు పరిణయబంధము కలిగెనేని తత్ఫలముగ వారి శారీరకసుఖదుఃఖము లెట్లుండఁగల వను చింతయే మన కక్కరలేదా? అక్కరలేదను దంపతులు—మునుపటికాలపు మాట మన మెఱుఁగము—ఈకాలమున నెంద ఱుందురో చదువరులే యూహించుకోఁగలరు.

"మీసామీప్యమువలననే నాకు మానసికానందము పరిపూర్ణముగా లభించుచున్నది. అదియే చాలును. నన్నుమాత్రము మీరు స్పృశింపవలదు" అని చెప్పుచు భర్తహస్తము తన దేహమును తాఁకనీయక జాగ్రత్తతో మెలఁగిన యొకానొక విద్యావతియగు తరుణివృత్తాంతము నేను వినియున్నాను. విద్యావంతుఁడగు భర్తకు సరసాలాపములతో సకలోపచారములు—శయ్యోపచారముతప్ప— సలుపుచు, స్పర్శసుఖమును మాత్రము నిరాకరించుచున్న విచిత్రవ్యక్తి యామె. ఇంచుమించుగ నిట్టి యాదర్శములతోనే భిన్నాశయములు గల భర్తకు విసుగెత్తించి, కడకు తానును విసిగి, మఱియొక విదుషీమణియగు యువతి విడాకులు పంచుకొన్నది. ఇట్టి విజాతీయవ్యక్తులు పలువురు బయలుదేరిరేని సృష్టికర్త తన పదవికి రాజీనామా ఇయ్యవలసియుండునేమో! దంపతు లిరువురును సమానాదర్శము గలవారైనచో వారి కథ ఇతరులకు తెలియుట సామాన్యముగ సంభవింపదుగాన అనేకు లట్టివా రుందురని యూహించుట సాహసమని కొంద ఱనవచ్చును. ఇందుకు లోకమే ప్రమాణమని నా మనవి. పోనిండు.

"సోమాత్మికాః స్త్రియస్సర్వాః పురుషాః భాస్కరాత్మకాః" అను వసిష్ఠవాక్యము ననుసరించి స్త్రీసామాన్యకారకుఁ డగుటచే చంద్రునినుండియే స్త్రీలనుగూర్చిన ఫలముల నూహించుట చాలు నందురేమో. పురుషులు సూర్యాత్మకులుగదా; కూటములలో సూర్యుని నేల యుపయోగింపరాదు? మఱియు దాంపత్యధర్మముల కవసరములైన కళత్రసౌఖ్యము, సౌందర్యవిలాసములు, శృంగారరసికత, కామకళ మున్నగువానికి కారకత్వము గల శుక్రుఁ డున్నాఁడు; వీర్యపాటవము, సామర్థ్యము, కామము మున్నగు గుణములకు కారకుఁడగు కుజుఁడు గలఁడు. కన్యావరుల జాతకములలో ఈ గ్రహముల యొద్దికకూడ గమనించుట అసంగతమనికాని, అనవసరమనికాని యనవచ్చునా? నా యెఱిఁగినంతలో చంద్రుఁడొక్కఁడు తప్ప ఇతరగ్రహముల యానుకూల్య ప్రాతికూల్యములను మనవారు గమనించుట కానరాదు.

నాకుఁ దోఁచినంతలో దీని కొక కారణమున్నది. 'పవనపర్ణాంబు భక్షులై నవసి యినుపకచ్చడాల్ గట్టుకొని' లోకకల్యాణమునకై శాస్త్రములను వ్రాసిన ఋషులో, గృహస్థాశ్రమములో నుండియు నిష్కామకర్మయోగపరతంత్రులై అస్ఖలితబ్రహ్మచర్యముతో కాలముగడపిన తపోధనులో నిర్ణయించినవి మన ప్రాచీనముహూర్తశాస్త్రసూత్రములు. ఇట్లనుటచే ఇవి నిస్సారము లని, నిరుపయోగము లని నా యాశయమని తలఁపరాదు. ఏ ఫలితము లామహానీయుల కభిమతములో, ఏ గుణములు వారికి మెప్పో, ఏ సాంఘికనీతిసూత్రములు వారి కాదర్శప్రాయములో, ఏ ధర్మములను వా రీలోకమున స్థాపింపనెంచిరో, వాని ననుసరించి యా మహానుభావులు మంచిచెడ్డలను నిర్ణయించి తదనుగుణముగ సూత్రములు వ్రాసిరి. కావుననే వివాహపు పొంతనములలో మనఃకారకుఁ డగు నొక చంద్రునిదప్ప ఇతరగ్రహములను వా రెన్నుకొనరైరి.

"అనుకూలాం విమలాంగీం
కులజాం కుశలాం సుశీలసంపన్నామ్,
పంచలకారాం భార్యాం
పురుషః పుణ్యోదయా ల్లభతే"

(స్నుషావిజయము)

అనుట మన ప్రాచీనుల యాదర్శము. రూపలావణ్యములు, లలితకళాప్రావీణ్యము, విలాసవైదగ్ధ్యము, సరససల్లాపచాతుర్యము-ఇత్యాదిగుణము లంతగా వారి యభిమానమునకు పాత్రములు కాలేదు. పైగా 'భార్యా రూపవతీ శత్రుః' అని చెప్పిన శాసనకర్తలు సైతము కలరు! వివాహమునకై కన్యను నిర్ధరించుపట్ల ముఖ్యముగా వారు కోరినది శీల మొక్కటే. ఆశ్రమ

ములలో నుత్తమము గృహస్థాశ్రమము; దాని కాధారము శీలవతియగు భార్య-అని వారి నిశ్చయము. కావుననే

"సర్వాశ్రమాణా మాస్థేయం
గృహస్థాశ్రమ ముత్తమమ్,
యత స్తదపి యోషాయాం
శీలవత్యాం స్థితం తతః"
అను నారదవాక్యము.

శీలమున కగ్రతాంబూల ముండవలెననుట నిర్వివాదాంశమే. కాని శీల మొక్కటిమాత్రము తృప్తికరముగా నుండుపట్ల ఇతరలోపము లున్నను పరిగణింపఁబనిలేదనువారు, అందును జామాతృపట్టమునకు తల యొగ్గు నవనాగరకతరుణులు ఇప్పటి కాలమున పలువురు లేరని నాథయము.

చెప్పవచ్చిన దేమనఁగా; కన్యావరులకు పరస్పరచంద్రరాశిధర్మములనుబట్టి యానుకూల్యసౌహార్దము లూహించుటమాత్రము కాక, కాలానుసారముగ పరస్పరముగ లగ్నమైత్రిని, ఇతరగ్రహముల యానుకూల్యమునుగూడ గమనించుట ఇప్పటికి హెచ్చు లాభకారి యనుట.

పాశ్చాత్యపద్ధతిలో మనవలె కూటములు లెక్కించు నాచారము లేదు. లగ్నములకు పరస్పరానురూప్య మున్నదా ; అన్యోన్యముగ జాతకము లందలి గ్రహములకు మిత్రదృష్టి కలదా అని గమనించుట వారి వాడుక. అందును ముఖ్యముగా రవిచంద్రులకును, కుజశుక్రులకును అన్యోన్యముగ మిత్రదృష్టియుండుట మానసిక శారీరకసుఖముల కవసరమని వారి మతము. మఱియు ఒకరి జాతకమందలి శుభగ్రహములు మఱియొకరి రవిచంద్రులపైననో, కేంద్రస్థానములందో నిలుచుట దంపతులకు సౌభాగ్యసూచకముగా వారెన్నుదురు. అట్లే ఒకరి జాతకమందలి పాపగ్రహములు మఱియొకరి జాతకమందలి ఉదయరవిశశాంకులపై పడిరేని ప్రమాదకరమని వారి సూత్రము. అనుభవములో ఈ సూత్రములకు విలువ కలదని మనమును కనుఁగొనవచ్చును.

సతీపతులకు పరస్పరాకర్షణము ప్రధాన మనుట నిర్వివాదాంశము. ఏమియు నెఱుఁగని యేగర్భాష్టమ మందో కన్యకు వివాహముచేసి నాఁటినుండి దీక్ష పండుగలు, దీపావళులు, దేవీనవరాత్రులు, గౌరి నోములు, వసంతపూర్ణిమలు మొదలగు సన్నివేశము లెన్నో కల్పించి, వధూవరులకు నానావిధములగు వేడుకలతో పరస్పరము పరిచయమును, విశ్వాసమును, ప్రణయమును క్రమక్రమముగా, చిన్నచిన్న మోతాదులతో అభ్యాసముచేయించుట మన తాతలనాటి సామాన్యాచారము. దీనిచే కన్యావరులకు సౌహార్దము క్రమముగ నాటుకొని యది గట్టి పరస్పరాకర్షణముగా పరిణమించుచుండెడిది. కాని పరిస్థితు లిప్పుడు తారుమారైనవి. శారదాచట్టమువలననేమి, కాలవైపరీత్యప్రభావమువలననేమి, పాశ్చాత్యసాంఘికరీత్యాను కరణముచేనేమి మన ప్రాచీనవైవాహిక పద్ధతులలో మార్పు లనేకములు వచ్చినవి. మన కిష్టమున్నను, లేకున్నను వస్తుస్థితిని కాదనలేము. ఇప్పటి వధువులు 'కన్యలు' కారు; వరులు 'బ్రహ్మచారులును' కారు. వివాహము లన్నియు ప్రౌఢావివాహములే. వివాహానిషేకములకు వ్యవధి కానవచ్చుటయే కష్టముగనున్నది. వివాహములన్నియు ఇంచుమించు గాంధర్వములే. కావుననే ఈకాలమున పరిణయయోగ్యతవిషయమున ప్రధాన పరీక్ష వధూవరుల పరస్పరాకర్షణము. సౌహార్దము కలుగునో కలుగదో, తరువాతిమాట!

ఒక వ్యక్తికిని మఱియొక వ్యక్తికిని గల పరస్పరాకర్షణము వారి జన్మకాలికగ్రహలగ్నములకుఁ గల అన్యోన్యసంబంధము ననుసరించియుండును. వివాహము రెండుజీవితముల నొక్కటిగాఁ జేయు బంధముగదా. అనఁగా జ్యోతిషదృష్టిలో కన్యావరుల రెండుజాతకములను ఒక కుండలిలో నిమిడ్చి వాని కైక్యము కలిగించుట. రెండు జాతకముల నిట్లు శోధించినపుడు ఒకరి స్పష్టగ్రహలగ్నములకును, మఱియొకరి స్పష్టగ్రహలగ్నములకును గల మిత్రశత్రుదృష్టియోగములను తాజకమతానుసారముగా గ్రహించితిమేని, ఆ వ్యక్తులకు సంబంధించిన పరస్పరాకర్షణశక్తియొక్క స్వరూపస్వభావము లిట్టివని విశదమగును.

వ్యక్తులకుఁ గలుగు పరస్పరాకర్షణము రెండు విధములు: (౧) స్నేహబద్ధము, (౨) అస్నేహబద్ధము. ఈ రెండువిధములలో నొకటియు లేనివారు వివాహబంధమునకు లోనగుట యసంభవమని అనుభవములో మనము సులభముగాగుర్తింపఁగల్గుదుము. అనఁగా గ్రహలగ్నములకు పరస్పరజాతకములలో ఔదాసీన్యము గల స్త్రీపురుషులు దాంపత్యధర్మ మనుభవించుట యసంభవము. మిత్రదృష్టిబద్ధులగు దంపతులు క్రమక్రమముగ ధర్మైక్యమును సంపాదించుకొని సర్వవిధముల సుఖమనుభవింతురు. శత్రుదృష్టిబద్ధులగు భార్యాభర్తలు కొండంత యాశతో ఒకరినొకరు సమీపించి భిన్నాదర్శముల నవలంబించుకతమున పరస్పరసామరస్యసౌహార్దముల నార్జింపలేక సుఖదూరులై యుందురు. ఆలింగనాభిలాషియగు అర్థికిని, ఆమోదనాభిలాషియగు ప్రత్యర్థికిని పరస్పరాకర్షణమందుఁగాని, పరస్పరాభిముఖ్యమందుఁగాని భేదము లేక ఆదర్శమందు మాత్రమే భేదముండుట అంద ఱెఱిఁగినదే. కావుననే పరస్పరముగ గ్రహలగ్నముల కమిత్రదృష్టి గలవారు సైతము వివాహబంధమునఁ జిక్కుకొనుటలో వింత లేదు.

వివాహముల విషయమున పొంతనములు చూచు మామూలుపద్ధతిమాత్రమే చాలదనియు, పరస్పరగ్రహలగ్నసామరస్యముసైతము సంపాదించుట యిప్పటి పరిస్థితులలో మిక్కిలి ప్రయోజనకారి యనియు సహృదయులకు విన్నవించుటయే నాయభిలాష. ఉదాహరణమునకై ఒక్క జాతకమును జూపుదును:—

ఈ ప్రక్క కాలములో క్రిందనున్నది ఒక స్త్రీజాతకము.

| | | | |
|---|---|---|---|
| ల ౨౨-౧౦ శు ౨౨-౦ గు ౨౦-౩౯ కే ౩-౧౬ | ర ౧౧-౫౧ కు ౨౦-౫౫ | బు ౧-౨౪ | ఇంద్ర ౧౧-౬ |
| | నిరయనకుండలి | | |
| శ ౨౪-౨౫ | | | చ ౫-౨౨ |
| వరుణ ౪-౧౪ | | | రా ౩-౧౬ |

సామాన్యముగా చూచినచో ఉత్తమజాతకములలో లెక్కింపఁదగిన దీజాతకము. పలువు రట్లే చెప్పిరి. లగ్నాధిపతి గురువు ప్రబలుఁడై లగ్నమునందే కలఁడు. వానితో నున్న శుక్రుఁడు ఉచ్చగ్రహము. ధనస్థానమున స్వక్షేత్రవాసియగు కుజుఁడును, ఉచ్చరవియును గలరు. లాభాధిపతి లాభమందే యున్నాఁడు.

సప్తమభావమునుగూర్చి విచారించినచో, సప్తమాధిపతి బుధుఁడై మిత్రక్షేత్రమున నున్నాఁడు. కాని రెండింట కుజదోష మున్నదనియు, శుక్రుని కష్టమాధిపత్యదోషము పట్టినదనియు చెప్పవచ్చును. ఐననేమి? ఈ రెండు గ్రహములును స్థానబలముచే శుభములే యనుటకు వీలున్నది.

ఈజాతకమునకు సాయనకుండలి యిది:—

| | | | |
|---|---|---|---|
| కే ౨౫-౮౬ | గు ౧౩-౯ శు ౧౮-౩౦ ల ౧౮-౮౦ | ర ౮-౨౧ కు ౧౪-౨౫ బు ౨౩-౫౩ | |
| శ ౧౯-౫౫ | సాయన కుండలి | | ఇం ౩-౩౬ |
| X ౧౧-౦ | | | చ ౨౪-౫౦ |
| వరు ౨౯-౮౪ | | | రా ౨౫-౮౬ |

నిరయనకుండలిలో ఉత్తమరాశిస్థితిగల గురుశుక్రరవికుజులు నలువురును తమ బలము నిచట కోల్పోయినారు. దుఃస్థానాధిపత్యము శుక్రునకుఁబోయి గురువునకు వచ్చినది. రెండింటి కుజదోష మిందును గలదు. కాక, కుజశుక్రులకు పరివర్తన మబ్బినది. మొత్తముమీఁద సాయనకుండలిలో జాతకము దుర్బలముగా పరిణమించినది. అది యట్లుండె.

ఈ జాతకురాలు ఒక సుమారుపాటి అగర్భ శ్రీమంతులయింటః బుట్టినది. మంచి చతుర. రూప లావణ్యములకు కొదవలేదు. లగ్నములో నున్న గురు శుక్రుల కామాత్రము ఫలమైన వలదా? పంద్రెండు సంవత్సరముల వయసులో ముప్పదేండ్లు చెల్లిన యొక నడిప్రాయపువాని కిచ్చి పెద్ద లీమెకు పెండ్లి చేసిరి. అతని కది నాల్గవ వివాహ మనుకొందును. వరుఁ డుత్సాహప్రభుమంత్రశక్తులు గల దక్షుఁడు; మంచి రసికుఁడు; మేధావి; తిండిగుడ్డలకు కొదవలేదు. వివాహము మహావైభవముగా జరిగినది.

ఈ వరుని సాయనజాతకకుండలి యిట్లుండును :—

| | | | |
|---|---|---|---|
| | చ ౫-౫౮ | ఇం ౨౯-౫౮ | |
| కే ౧౭-౫౭ | సాయనజాతక కుండలి | | శు ౧౬-౫౨<br>శ ౨౫-౪౩ |
| | | | బు ౦-౫౭<br>ర ౧౫-౨౬<br>రా ౧౭-౫౭ |
| ల ౨౩-౦ | | న ౯-౩౪<br>గు ౨౭-౫౬ | X ౨౭-౩౦<br>కు ౨౬-౪౨ |

[అయనాంశలు ౨౨ భాగల ౧౬ లిప్తలను తీసివేసినచో నిరయనకుండలి వచ్చును.]

కన్యావరనక్షత్రములకు కూటములు సాధించినచో ౧౯ గుణములు వచ్చినవి. షష్ఠాష్టమదోష మున్నదిగాన రాశికూటమునకు పరీక్షకులు గుణముల నీయలేదు. కాని పురుషరాశి సమరాశి యగుటచే

"పుంజన్మయుగ్మరాశిశ్చేత్
ప్రీత్యై షష్ఠాష్టమం భవేత్"

అను నపవాదసూత్రముచే నైదోష మంటదు. కాన, గుణములు దాదాపుగా ౨౮ వచ్చును. కనుక శాంతనము బాగుగా కుదిరినట్లే నిశ్చయించినారు పెద్దలు.

వివాహానంతరము రెండేండ్లలో జాతకురాలు తన సంసారమును జేరుకొన్నది. కాని "నానాటికి తీసికట్లు నాగంభొట్లూ" అనునట్లు, క్రమక్రమముగా అత్తవారింటి స్థితి క్షీణింపఁజొచ్చినది. ఆహారవిహారములలో ఆమె క్లేశ మనుభవింపఁజొచ్చెను. అతిసుకుమారగాత్రి యగుటచే (లగ్నమున నున్నవారు గురుశుక్రులుగదా) ఆమె కీమార్పు భరించుట కష్టమయ్యెను. ఏదో నెపముతో అప్పుడప్పుడు పుట్టినింటికిఁ బోవుచు నెలల కొలఁది అందే నిలుచుచువచ్చి, తుదకు - అనఁగా ఐదారేండ్లకే - ఈ దారిద్ర్యకష్ట మనుభవింపఁజాలనని సంసారమునకు స్వస్తి చెప్పి, ఆమె పుట్టినిల్లు చేరుకొనెను. పీడ వదలినట్లుగా భావించి భర్త యామె ప్రస్తావమునే మఱచెను. సంభవించిన క్లేశమునకు పుట్టినింటివారు చాల పరితాపపడి ఆమెవిషయమున మిగుల కనికరము చూపిరి. క్లేశమునకు కారణభూతుఁడని భర్తనుసైతము నిందించిరి. అతిసుకుమారి యగుట చేతను, సంతానపు తగులము లేమిఁ జేసియు, పుట్టినింటి యాదరవు గల్గుటవలనను జాతకురాలు తన కష్టములు మఱచి నెమ్మదిగా నచట కాలక్షేపము చేయఁగల్గెను. పిలిచినపుడు పోయి ఏదో రుచించినంత, భోజనమో, అల్పాహారమో ఆరగించుచు, వేంకటపార్వతీశ్వరుల నవలలో, కృష్ణమాచార్యుని నాటకములో, పంతుల వారి ప్రహసనములో, జంఘాలశాస్త్రిగారి యుపన్యాసములో చదువుకొనుచు సంసారమును మఱచి యామె నిశ్చింతగా దినములు గడుపుచువచ్చినది.

కాని, కాల మొకతీరున నుండదు. ఏండ్లుగడచు కొలఁది పరిస్థితులు మాఱుచువచ్చెను. పనిపాటులకు మరగని యీమెనిశ్చింతజీవనము పుట్టినింటివారికి గుచింపలేదు. ఏటుపోటుమాటలు రాసాగినవి. వివేకవతియగుటచే ఈమార్పు గుర్తెఱిఁగి, పుస్తకములు కట్టిపెట్టి, ఇంటిపనిపాటులు చేయుట యలవఱచుకొనెను. రానురాను భారమంతయు నీమెమీఁదనే వ్రాలినది. రేయుంబవళ్లు దుడిసి, క్లేశముచే కృశించుచున్ననేమి, పాపమనువారు కానరాలేదు. కొన్నేండ్లిట్లు కడచు కొలఁది, పతిసుతధనహీనయగు తన పుట్టినింటి నివాసము ఆమెకే అసహ్యమైనది. "ప్రియుములేని కూడు

పిండపుకూడు రా" అను వేమనసూక్తియందలి సత్యమప్పుడామెకు బోధపడినది. "ఇన్ని కష్టము లిక్కడ పడనేల? నాయింటికే పోయినచో ఇంకేమి లేకున్నను 'నా'యను పదార్థమైనను అచటఁ గలదుగదా" అని యామెకు పదునాలుగేండ్ల యనుభవముమీఁద స్ఫురించినది. తరువాత సాధ్యమైనంత త్వరలో నా తన్వి భర్తృసాన్నిధ్యమును జేరుకొనఁగల్గెను.

దైవగతి చాల విచిత్రము. అప్పటికి కొన్ని సంవత్సరాలక్రిందటనే జాతకురాలి భర్త ప్రారబ్ధవశమున గొప్ప రుగ్ణతపాలై బ్రతికినన్ని దినాలును పడుక వదలి కదలలేని పరతంత్రజీవితము గడపవలసిన యవస్థకు వచ్చియుండెను! పడుకయొద్ద పాకీపని చేయవలసిన భాగ్యము తప్ప పాప మాసువాసినికి వేఱుసుఖ మచట కానరాలేదు! ఏననేమి? మనఃపూర్వకముగ ఆ సాధ్వి ఈ దాస్యము నంగీకరించి భర్తకు నిరంతరసేవ చేయుచు తృప్తితో కాలము గడపుచువచ్చినది. లగ్నమందున్న గురుమహాశయుఁడు ఈమె కీయఁగలిగిన సౌభాగ్య మింతేకాఁబోలు! ఐదాఱు సంవత్సరము లిట్లు సేవచేయించుకొని, ఋణము తీఱెనేమో, జాతకురాలి భర్త యీలోకమును చాలించుకొనియెను!

దాంపత్య జీవితమున శారీరకమానసికసౌఖ్యములు జాతకురాలి కెంత యబ్బినవో చదువరులే యూహించుకోఁగలరు. పొంతనములా కుదిరినవి; నక్షత్రములా అనుకూలించినవి; జన్మలగ్నమందో ప్రబలులగు శుభగ్రహములు గురుశుక్రు లున్నారు; కాని ఇన్నింటి ఫల మేమి?

వివాహమువలన — అనఁగా భర్తృజాతకము నుండి—జాతకురా లేమి సంపాదించుకొన్నదో పరీక్షింతము. నీచుఁడగు కుజుఁడు చతుర్థకేంద్రమునకు వచ్చినాఁడు. గృహిణీత్వము నేతిబీరకాయ యైనది. పరమనీచభాగయం గున్న శుక్రుఁడు షష్ఠస్థానమున సాక్షాత్కరించినాఁడు. దీనిచే సంసారసౌఖ్యమునకు జలాంజలి. సంతానస్థానమున నున్న చంద్రునకు భర్తజాతకమందలి మృగతృష్ణాస్వభావుఁడగు ఇంద్రగ్రహము నుండి చతుర్థకేంద్రగుప్త శత్రుదృష్టి వచ్చినది. సంతానభాగ్యము గగనకుసుమమైనది. చాలదని, పిడుగువంటి వరుణగ్రహము భర్తృస్థానము నాక్రమించినాఁడు. పిడుగురామునివంటివాఁడు భర్త యని తెలుపుటయే కాక, ఈ యోగము దంపతుల సంయోగవియోగముల పౌనఃపున్యమును సూచించుచు, జాతకురాలి వివాహము ప్రమాదముపాలని తెల్పుచున్నది. ఉడుతభక్తి యన్నట్లు, తన జాతకమందలి వరుణగ్రహమును జాతకురాలు భర్తగారి లగ్నకేంద్రమునకు పంపినదని చదువరులు గుర్తించియే యుందురు. ఉభయత్ర వరుణగ్రహప్రేరితమైన యాకర్షణమే యీ వివాహమునకు ముఖ్యకారణము. చాలనందుకు శుక్రునిపై వరుణగ్రహక్రూరదృష్టి అన్యోన్యముగా తటస్థించినది. ఇట్టి స్థితిలో నీమెవైవాహిక జీవిత మిట్లు కడగండ్లపాలగుటలో నాశ్చర్యము లేదు.

కేవలవరుణగ్రహప్రేరితమైనఅన్యోన్యాకర్షణమే ఈ దాంపత్యమునకు నిదానమనుటకు పచ్చిదౌ తార్కాణ కానవచ్చును. చూడుఁడు! వెదకి వెదకి నిర్ధరించిరా యనునట్లు, పురుషజాతకమందలి రవిస్థానమునకు కేవలము సమసప్తకప్రత్యక్షశత్రుదృష్టిస్థానమున (కుంభము ౧౫ర్తి భాగలో) వరుణగ్రహమున్న దినమందే, అతని జాతకమందలి వరుణగ్రహము వివాహలగ్నమునకు (మేషము ౧౦ వ భాగ) సప్తమకేంద్రములో నుండఁగల గడియయందే వీరి వివాహము జరిగినది! వరుణగ్రహజనితమగు నాకర్షణఫలముగా సిద్ధించిన వివాహ మిది యనుట కింతకన్న ప్రబలసాక్ష్యము వలయునా? సమానధర్మములగల పదార్థములొకటి నొకటి యాకర్షించునందురు. ఈ సూత్ర మిచట బాగుగా నన్వయించినది.

ఇప్పటి కింత చాలును. మనవారి శాస్త్రసంప్రదాయములకన్న పాశ్చాత్యపద్ధతు లుత్తమములని నా వాదము కాదు. వారి పద్ధతులనుగూడ గమనించి గుణమున్నచో గ్రహించుట తప్పుకాదనియు, కాలానుసారముగ నట్టిపద్ధతి శాస్త్రదృష్టిలో నవసరమనియు మాత్రమే నా యాశయమని సహృదయులు గమనింతురుగాక.

వివాహప్రకరణమున గర్గమహాముని ఇట్లు సెలవిచ్చెనఁట:—

# అతడు దృఢంగా వుండేటట్లు చూచుట నా వంతు!




ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలుసికొన వలెను డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయ బడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము 4 అణాల బిళ్లలు *Dept* B110 *P O Box No 63, Bombay* పంపుడు



తల్లులారా! మీ సంసారానికి వంట వండేటప్పుడు మీపైన యెంత బాధ్యత వున్నదో మీరు గ్రహించారా? మీరు తెచ్చిన వంట సామాగ్రిని వండే విధానంతో మీ పిల్లలకు మీరు శక్తిని ప్రసాధించి మంచి బలముగల వారినిగానైనా చేయగలరు — లేక ఎందుకూ పనికిరాకుండా వుండే దుర్బలులుగాను, నీరసంగా వుండే వారిలాగానైనా తయారు చేయగలరు.

ఆహార పదార్థములు "బలము నివ్వగలుగుటలో" అనేక రకములుగా వుంటవి — మీరు బాగా గమనించండి. కొన్ని మంచి పుష్టినివ్వగలవు — మరికొన్ని ఆకలిమాత్రం ఆపి, రుచికరంగా వున్నట్లుండి, బలముమాత్రం ఇవ్వలేవు అందుచేతనే బాగా యింతో అంతో తిన్నప్పటికీ చాలా మంది నిస్సత్తువగా వుంటానికి కారణం. అయితే అన్ని ఆహారపదార్థములు ఎక్కువ సత్తువ నిచ్చునట్టివిగా చేయుటకు వీలున్నది. విటమిన్లతో నిండిన డాల్డాతో ఆహారంవండుట యీ విషయంలో తప్పక తోడ్పడును. ప్రకృతి సిద్ధంగా కావలసిన ముఖ్యమైనటువంటివీన్నీ, శక్తినివ్వగలిగి నటువంటివీన్నీ "ఆహార పదార్థములు" డాల్డా యివ్వగలదు.

డాల్డా ఆహారాన్ని ఎక్కువ బలమును యిచ్చునట్లు చేయగలదని మేము నిర్ధారణ చేసితిమి.



విటమిన్లతోనిండిన డాల్డా బలమునకు

MVM. 32 23-40 TL.

THE HINDUSTAN VANASPATI MANUFACTURING CO., LTD.



నాకు ఇప్పుడెంతో సౌఖ్యముగా
నున్నది!
ఒక్క మోతాదు 'సిసుసాన్'
తోంమెంతసులువిచ్చినది!
రాత్రియెంతమంచి నిద్ర-
పట్టినది!

సిసుసాన్

కడుపు నులినొప్పులకుమందు.
శిసువులకు బలదాయికము.

ఆంధ్ర ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్
బెజవాడ, వారి దివ్యౌషధము.

అత్యద్భుత కుష్ఠురోగనివారిణి

కుష్ఠు, బొల్లి, సుఖరోగములకు గ్యారంటీ చికిత్స
గుణములేనిచో పైకము వాపసు ఇచ్చుటేగాక
బహుమానం రూ. 500/-

| | |
|---|---|
| మావద్ద చికిత్స పొందు యేవ్యాధికైనను రక్త పరీక్ష గ్యారంటీ ఇవ్వబడును. | మద్రాసు, బొంబయి, పోర్చుగీసు గవర్నమెంటు డాక్టర్లచే శ్లాఘింపబడినది. |

రెడ్డి అండ్ కో., (రిజిష్టర్డు.)
(బంగారుపతకాంకితులు)

హెడ్ ఆఫీస్:—
గోపాలపురము తా॥ గో॥ వయా తణుకు.

స్థాపితము:—1920

స్థాపకులు:—డా॥ యం. సుబ్బారెడ్డి.

కుష్ఠువులకు చికిత్స లేదను ప్రతీతిని రద్దుపరచి, స్వంతహాస్పిటలు నిర్మించి నిర్భయముగా, కుష్ఠు, బొల్లి, సుఖరోగముల నిర్మూలించుచున్న సంస్థ— ఇండియాకంతటికి, మాసంస్థ ఒక్కటియే!

దగ్గు
ఉబ్బసము
ఆయాసముమరియు
సకలమైనశ్వాసకోశవ్యాధుల
మీదను




అమోఘముగా
పనిచేయును

కాశ్మీర్ దగ్గుల నివారణి
అన్నిచోట్లదొరకును

సోల్ ఏజంట్లు : గిరిజా & కో, రాజమండ్రి

"ఉత్తమం మధ్యమం చైవాధమం చ త్రిధా భవేత్
ద్వయో ర్జాతకసంయుక్త ముత్తమం తు విధీయతే.
నక్షత్రమాత్ర మేవాత్ర జ్ఞాత్వా కార్యం తు మధ్యమమ్
యోగమాత్రం ద్వయో ర్జ్ఞాత్వా కార్య మత్రాధమం
భవేత్."

కేవలము నక్షత్రానుకూల్యమువలన నిర్ధరించు వివాహ ముత్తమము కాదనియు, కన్యావరు లిరువురి జాతకములను మేళవించి నిర్ణరించుట యుత్తమపద్ధతి యనియు పైవాక్యము చెప్పుచున్నది. ఇది యొకవిధముగా పాశ్చాత్యపద్ధతి కన్వయించునుగదా! అట్లుగాక వేఱుపద్ధతి యేదైనఁ గలదేని, సహృదయులగు శాస్త్రజ్ఞులు దానిని లోకకల్యాణమునకై బహిరంగపఱుతు రని నాయాశ.

---

# మధ్యాహ్నమల్లిక

— శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రి —

౧

"ఏ ఉదయరాగముల బులకించుచున్న
పద్మినియు కమ్మతావుల బ్రబలుగాక,
ఏ మసకచీకటుల వికసించుచున్న
కుముదినియు క్రొత్తవలపుల గులుకుగాక !—

౨

"నట్టనడిమింట సూర్యుడున్నట్టివేళ
మింటికి న్మంటి పెన్మంట లంటువేళ
నేను కను విచ్చినాను;-నాపైని దూకు
ప్రళయ ప్రజ్వలదగ్నిగోళముల కేమి !—

౩

"ఈ భయంకరశక్తుల నెదిరినిలచి
యేను నశియించిపోవుట కిచ్చగింప;
ఓపినంతకు నాయంత నొదిగియొదిగి,
పూటయగుగాక, కాలము బుచ్చవలయు—

౪

"—'ఓ ప్రతాపరాశి, ఓ అనంతప్రభా,
శక్ర నీల గగన చక్రవర్తి,
నీదుసోకు తాకి నింగినీలము తెలి
నురుగు లురలు నుదధికరణి మెరసె'—

౫

"పట్టుపడమైన కవితా ప్రవర్తనమ్ము,
కావ్యమిట్టిది మన్నింపగలడు ప్రభుడు;
నిప్పులుమిసెడు కనుల గన్పింపగలదు
చోద్యముగ సుధాశీతలజ్యోత్స్న నుంత—

౬

"అనుచు పేరాస జిక్కి తదాదరమ్ము
నందుకొన జూపు బరపితి నతనివంక;
గడ్డువారిన తనదు దుర్గర్వమేమొ,
కనికరముజూపు చిన్నె యొక్కటియు లేదు—

౭

"—'సంద్రమందలి నావల చాలువోలె
నీ కిరణరాశి నీలాల నింగిమీద
ఏలుబడి సేయుచున్న; దీ నేలయెల్ల
పరిసరమ్ముల కొదిగి నీపాలబడియె—

౮

"—'ఇందు నేనొక అణుమాత్రమేని గాను,
ఇందు నాశక్తి లవలేశమేని లేదు;
నన్ను మన్నించుమా శరణంటి నాథ,
మిన్ను మన్నేలు నీకీర్తి వన్నెకెక్కు!'

౯

"అని అనాథవోలె ఆర్తనాదముల వె
న్నంటి వేడుకొనెదు నన్ను జూచె
చిచ్చు కంటిలోన జిరునవ్వు మంటలు
కదలి పొదలుచుండగా నియంత—

౧౦

"అగ్గిలో బుగ్గియై హతమారనున్న
నన్ను నే నొక్కసారి కన్నార గంటి;—
లేకుమాయదు, సిగయును సోక; దే
ప్రభావమో—చాలదయగలవాడు లేడు!—

౧౧

"పరువమదుగని నాకు నే గరువమొంది
లేని కనుసన్నలో దలద్రిప్పుచుండ,
కడుపులో బెట్టుకొని నన్ను గన్న తల్లి
సైచనివిధాన కొరకొర జూచె నపుడు—

౧౨

"—'ఓసి పసిదాన, నీ బ్రదుకొక్క క్షణము;
దీనికై జాతియున్నతి దిగవిడుతువె?
నీకు నాధారముగ నున్న మాకుగాక,
యెటుల నిలతువు? రాలిపోయెదవుగాక!

౧౩

"—'ఈకరకుటగ్గిలో మ్రగ్గి యెల్లవార
మలమటింపగ నీకు సౌఖ్యమ్ము గలదె?
ఆకసమ్మును బట్టి వ్రేలాడునట్టి
తెగువగా కిది యేటి మేల్తెరువు? బిడ్డ—

౧౪

"—'మిడిసిపడి తన్నుదరిగొని మ్రింగజూచు
కటికిచీకటిదొరమాట గనదు తరణి;
చీకటిని జీల్చి, అమృతమ్ము జిలికి జగతి
నోషధీశుడు పాలింపనున్నవాడు!'—

౧౫

"ఈ అయోమయవేదాంత మేమియగునొ?
ఏమికానున్నదో? జగమెల్లరకును —
స్వార్థబుద్ధికి నాకు గోచరముకాదు,
ఇంక బానిసబ్రదుకు ముగించుకొనెద!"

---

# మన ఆట-పాటలు

= శ్రీ మలపాక వేంకటాచలపతి =

విద్యావిధానంలో మన తండ్రుల కాలము, మన కాలములలోపుగనే అనేకమార్పులు వచ్చాయి. దినమూ వస్తూనే ఉన్నవి. విద్యాబోధకులకు ఒకటే సమస్య 'శేష ప్రశ్న'గా ఆదినుంచి వస్తూంది—"బాలబాలికల దృష్టి చదువువైపు చెదరకుండా నిల్పడ మెట్లా?" అని. పశ్చిమ దేశాల్లో విద్యాసంస్కర్తలు 'రూసో' కాలం నుంచి క్రొత్తమార్గాలు త్రొక్కినారు. దాని ఫలితంగా బాలుడు అభివృద్ధిపొందని వృద్ధుడు కాడనీ, అతని మన స్సతికోమలమనీ, సామాన్యమానవుని కుండే రస వికారాదు లతనికి లేవనీ తెలియబడ్డది. అందుచేత పశ్చిమ దేశాల్లో బాలుని కఠినపరీక్షలకు గురిచేసే విద్యావిధానము మార్చబడి, బాలుని మనోగత అభిప్రాయాలు, ఐచ్ఛికముల ననుసరించి విద్యాబోధన ప్రారంభింపబడింది. కాని 'ఫ్రీబెల్' అనే ఆయన కాలమువరకు ఆటపాటలకు విద్యావ్యాప్తిపై గల ప్రభావము గుర్తింపబడినట్లు కన్పడదు. ఇతడు బిడ్డలకు సహజమును, నైసర్గికము నగు ఆటద్వారా విద్యను నేర్పవచ్చునని గ్రహించెను. ఇతడే మొదట 'ఆటపాటల'ను (Play_songs) వ్రాసి ఆటవస్తువులను తయారుచేసి పిల్లలకు విద్య ప్రారంభించాడు. ఇతని కాలమునుంచి కిండర్ గార్టన్ (Kindergarten) పద్ధతి ప్రాముఖ్యత వహించి విద్యాసంస్కర్తల అభిమానపద్ధతి అయ్యెను.

మన ఆంధ్రదేశములోకూడ ఈ ఆటపాటలు అనాదినుంచి ఉన్నవి. కాని వాటి విలువ గ్రహించినట్లు కన్పడదు. దీనినిబట్టి చూస్తే 'ఫ్రీబెల్' యొక్క పద్ధతి క్రొత్తది కాదని తెలుస్తుంది.

విద్యయొక్క పరమావధి మానవవికాసమని మనవారూ, పాశ్చాత్యులూ అంగీకరించిన విషయమే. విద్య మానవునికి సంపూర్ణత్వ మిచ్చేదని చాలమంది ఒప్పుకుంటారు. అట్టి సంపూర్ణత్వముకోసమే మన ఆచారవ్యవహారాలలో, నోములలో, వ్రతములలో, చిన్నప్పటి ఆటపాటలలో, తల్లి శిశువు నోదార్చే జోలపాటలలో విద్యాతత్త్వ మిముడ్చబడి ఉన్నది.

'ఫ్రీబెల్' (Froebel) తన ఆటపాటల్ని శిశువు యొక్క మొదటి సంవత్సరాన్నించి ఆరవ సంవత్సరమువరకు వ్రాశాడు. అతని ఉద్దేశము బిడ్డల్ని సరిగా పెంచగల తల్లులే ఈ ఆటపాటల్ని ఉపయోగించగలరని. కాని ఆట అనేకరూపాలతో వృద్ధులవరకు అభివృద్ధి చెందిఉన్నది. ఆబాలగోపాలము ఆనందించగల ఆట 'నాటకము'—కవియొక్క, సాహిత్యముయొక్క తుదిఫలము. ఆట ఏవిధముగా బాలకుణ్ణి ప్రభావితుణ్ణిగా చేస్తుందో నాటకముకూడ అట్లాగే అందర్నీ ప్రభావితుల్ని చేయగలదు.

శిశువు ఆటలను, పాటలను సులువుగా అనుకరించగల దని మన స్తత్త్వజ్ఞులు తెలుసుకున్నారు. ఆవేశపూరితమైన బాల్యము, అచిరకాలమునకు పూర్వమే వదిలిన నిత్యానందమయ స్వర్గలోకము ఆనందలహరిని అమృతమయ గాన, నృత్యములతో రెట్టించి రెట్టించి పాడి తన భావాన్ని వ్యక్తపరుస్తుంది. తండ్రి శిశువుకు కొంచెము బిస్కత్తు పెట్టినపుడు "ఇంకా కావాలీ ఈ, ఈ" అని రాగము తీస్తూ కాళ్లగజ్జెలు ఘల్లుమనేటట్లు గంతులు వేస్తుంది శిశువు. ఇది అనుభవైకవేద్యము. ఇట్టి పిన్నవయసుస పాటలతో నేర్పబడిన జ్ఞానము, ఆటలతో నేర్పబడిన నడత చిరస్థాయి, ఆనందదాయకము. శిశువు లావేశపూరితులే కాకుండా, అనుకరణబద్ధులుకూడను. అతిచురుకైన వారి యింద్రియములూ, అంతకన్న నిశితమైన వారి మెదడూ చూడబడే విషయాల్ని, చెప్పబడే జ్ఞానాన్ని అతిసులువుగా గ్రహి

స్తవి. కనుక ఈకాలములో వారికి బోధపడే విషయా ల్ని, అభిప్రాయాల్ని, నేర్పవలసిన్ని తల్లిదండ్రులు పరిశీలిస్తూ తగుజాగ్రత్త తీసుకోవాలి. కనుకనే ఈవయసున నేర్పబడు కథలు, ఆటపాటలు ఎట్టివిగా ఉండాలి అనేది విద్యాబోధకులు నిర్ణయించాలి.

ఇప్పుడు మన ఆటపాటలలోని ప్రాశస్త్యాన్ని చూతము.

మొదట మన తల్లులు మనకు నేర్పే ఆటపాటలలో ఒకటి 'ఏనుగుపాట.' తల్లి తన శిశువును సాచిన తన కాళ్లమీద కూర్చుండబెట్టుకుని—

"ఏనుగమ్మ ఏనుగు
ఏవూరు వచ్చింది ఏనుగు
ఈవ్వాడ వెళ్లింది ఏనుగు
ఉప్పునీరు త్రాగింది ఏనుగు
మావూరు వచ్చింది ఏనుగు
మంచినీరు త్రాగింది ఏనుగు"

అని పాడుతూ శిశువుయొక్క మెడ పట్టుకుని ముందుకు నెట్టుతుంది; శిశువు కాళ్లు బిగదన్ని మరల వెనుకకు వస్తుంది. ప్రారంభదశ దాటగానే ఈ పాట వినడం తడవుగా శిశువు ముందుకూ వెనకకూ ఊగటం ప్రారంభిస్తుంది. ఇది ఒక శరీరసాధన (bodily exercise). ఏనుగుయొక్క సతతచలనగుణము ఈపాటలో యిముడ్చబడిఉన్నది.

పసిబిడ్డమొదలుకొని పండుముసలివరకు చంద్రుడాహ్లాదకరుడే. (ఒక్క విరహుల్ని మినహాయించాలి కాబోలు!) సారస్వతంలో చంద్రుడు చాలాభాగ మాక్రమించుకున్నాడు. ఇట్టి చంద్రుణ్ణి తల్లి బిడ్డకి చూపిస్తూ—

"చందమామ రావే జాబిల్లి రావే
కొండెక్కి రావే గోగుపూలు తేవే
భమిడిగిన్నెలో పాలుపోసుకుని
వెండిగిన్నెలో పెరుగుపోసుకుని
ఒలిచిన పండు ఒళ్లో వేసుకుని
ఒలవని పండు చేత్తో పట్టుకు
అట్లా అట్లా వచ్చి అబ్బాయినోట్లో వేయవే"

అని పాడుతూ 'అం' తినిపిస్తుంది. శిశువుకూడా తదేకదీక్షతో చిట్టిచేతులతో 'చందమామ'ని పిలుస్తూ అల్లరి చేయకుండా 'బువ్వ' తింటాడు. అన్నం తినే టప్పుడేకాకుండా చంద్రుడు కనపడినప్పుడల్లా శిశువు తన చేతులతో పిలుస్తాడు. ఈపాటవల్ల క్రమంగా బిడ్డని సౌందర్యగ్రహణశక్తి, ఊహా, ఆకాశమునందలి జీవులనుగూర్చి తెలుసుకోవాలనే ఆసక్తి, తద్వారా భగవంతునివైపు దృష్టి కలగడానికి అనేకావకాశాలున్నవి. 'ఫ్రీబెల్'యొక్క మొదటి బహుమానపు శరీరవ్యాయామ మిక్కడ కలుగుతుంది.

ఇదేవయస్సులో, అనగా రెండేళ్లలోపువ బిడ్డకు భోజనపదార్థాలు తెలిపే 'చక్కిలిగింత' ఆట నేర్పవచ్చు. "పప్పు పెట్టి, కూర వేసి, పిండివంటలు వేసి...అత్తారింటికి దా రేదంటే ఇట్లా, ఇట్లా..." అంటూ తల్లి తన చేతివేళ్లని శిశువుఅరచేతినించి చంకవరకు నడిపించి గిలిగింత పెట్టుతుంది.

బిడ్డకి రెండేళ్లు వచ్చి బాగా కూర్చోటం అలవాటైనతర్వాత 'కాళ్లగజ్జె' ఆట నేర్పవచ్చు. ఆ పాట యిది :

"కాళ్లగజ్జె — కంకాళమ్మ
వేగుచుక్క — వెలగ మొగ్గ
మొగ్గ కాదు — మోతినీరు
నీరుకాదు — నిమ్మలవాయ
వాయకాదు — వావిలికూర
కూర కాదు — గుమ్మడిమీసం
మీసంకాదు— మిరియాలపోతు
పోతు కాదు — బొమ్మలశెట్టి
శెట్టి కాదు — శ్యామల మన్ను
మన్ను కాదు — మంచి గంధపు చెక్క."

ఈ ఆటకు ౪, ౫ గురు పిల్లలు వరుసగా కాళ్లు జాపుకోవాలి. ఒకరు పై పాటలోని ఒక్కొక్క పదానికి ఒక్కొకకాలే తట్టుచు అందరి కాళ్లూ వరుసగా తట్టుచూ వెనుకకు ముందుకు తట్టుచూ ఉండాలి. 'మంచి గంధపు చెక్క' అని ఏ కాలిమీదికి వస్తే ఆ కాలు పండినట్లు. పండిన కాలు ముడుచుకోవాలి. ఇట్లా

అందరి కాళ్ళూ పండేవరకూ ఈ పాట పాడుతూ ఉండాలి. ఈ ఆటపాటలో బిడ్డకి కొన్ని ఆభరణముల పేర్లు — గజ్జెలు, కంకణము, వేసుముక్కు, వెలగమొగ్గ మొదలైనవి — కాళ్లు ముడుచుకొనుట అనేజ్ఞానం కలుగుతుంది. ఈ పాటలో వైద్య శాస్త్రము కూడా ఉన్నదని మనకు తెలుసు.

ఈ వయస్సుననే 'గుడుగుడు గుంచము' ఆట ఆడవచ్చు. ఈ ఆటకు నలుగు రైదుగురు పిల్లలు కూర్చుండి ముడిచిన గుప్పిళ్లు ఒకదానిమీద ఒకటి పెట్టెదరు. దీనివల్ల వీరికి ఒకవిధమైన పరిమాణ స్వరూపం తెలుస్తుంది. ఈ ఆట 'కాళ్లగజ్జె' ఆట కంటె పెద్దది. ఇక్కడ బాలునికి కత్తియొక్క పదును, బద్దయొక్క పదును, వేన్నీళ్ల వేడి, చన్నీళ్ల చలి తెలుస్తుంది. పైగా వాక్యావళితోటి పరిచయ మధికమవుతుంది. చేతులు వెనుకకు దాచుకుని పృచ్ఛకుడు వేసే ప్రశ్నలకి బాలుడు సరియైన సమాధానం చెప్పడం నేర్చుకుంటాడు. ఉదాహరణకి ప్రశ్నలు, జవాబులు ఇట్లా ఉంటాయి: "నీచేతు లేమైనవి? పిల్లెత్తుకుపోయింది. — పిల్లేమి చేసింది? — కుమ్మరవాడి కిచ్చింది."

ఇట్లా ఎన్నయినా ఆటపాటల్ని చెప్పవచ్చు. ప్రత్యేకము ఆడపిల్లలు ఆడుకునే 'గింతగింజలు' ఆటలో 'గణితము'యొక్క ప్రారంభదశ ఉన్నది. ఇప్పటికిని 'పచ్చీలు' (పచ్చీసు) లెక్క మన ముసలమ్మల దగ్గర సజీవంగా ఉన్నది. ఇంకో అంకెలపాట ఎంత బాగుందో చూడండి:

"ఒక్క ఓ చెలియ
రెండు రోకళ్లు
మూడు ముచ్చిలక
నాలుగు నందన
అయిదు బేడీలు
ఆరు చిట్టిగొలుసు"

ఈవిధంగా పదివరకు లెక్కలపాట ఉన్నది. ఆటపాటలతో కలిపి వైద్యశాస్త్ర మేవిధంగా గుచ్చుతారో చూడండి:

"కొండమీద — వెండిగిన్నె
కొక్కురాజు — కాలు విరిగ
విరిగి విరిగి — మూడాయెను.
దాని కేమి మందు?
వేపాకు చేదు
వెల్లుల్లిగడ్డ
నూనెమ్మ బొట్టు
నూటొక్కధార"

ఇంకా, 'మాతృభావము' అభివృద్ధిచేసే 'చిన్ని పిన్ని కన్నేడు—' అనే పాట చూడండి. దీనిలో పెళ్లి బేరాలు, నగలు పెట్టడాలు మొదలైనవి అద్భుతంగా వర్ణించారు.

ఈదృష్టితో ఆటపాటల్ని ఆంధ్రభాషలోవే గాక ఇతర హైందవభాషల్లోంచికూడా సేకరించాలని నా ఉద్దేశం. రాబోయే 'Sargent Scheme of Education' (సార్జెంటు విద్యాప్రణాళిక)లో కూడా శిశువిద్యాలయాల ప్రసక్తి ఉన్నదగనుక - మన శిశువిజ్ఞాన విషయమై తగు శ్రద్ధవహించి మన పురాతనపాటల్ని సేకరించడమే కాకుండా క్రొత్తవికూడా సృజించి జ్ఞానాభివృద్ధి కనేకవిధాల ప్రయత్నించవచ్చు.

# సంగీతములో రసన*

= శ్రీ ద్వారము వేంకటస్వామినాయుడు =  

సుందరమైన వస్తువులను చూచి ఆనందించడమూ, ప్రకృతిలో గల రమ్యవిషయములను అనుభవించడమూ, ఈ అనుభవములను జ్ఞప్తిపరచుకొని మరలమరల ఆనందమును పొందడమూ మనుష్య స్వభావము. చక్కని వస్తువును చూచి "అది ఎంత బాగుంది" అననివారు తక్కువ. ఎందువలన బాగున్నదో, ఏఏకారణములచేత యితర అందమైన విషయములకంటే యిది యెక్కువగా వారిని ఆకర్షించుచున్నదో, యిది అందరూ చెప్పలేరు. కాని అందమైన విషయములను ఆనందింపగల శక్తి కొద్దో గొప్పో అందరిలోనూ వున్నది. చక్కని బొమ్మలను అందరూ చూచి ఆనందించగలరు. మంచి చెక్కడపుపనికూడా చాలా మందిని ఆకర్షిస్తుంది. కాని, చిత్రకారుడు రచించిన ఒక బొమ్మను పూర్తిగా చిత్రకారుడు అనుకొనిన రీతిని మనము మెచ్చుకొనడం కష్టము. అందుకు యితర చిత్రముల రచనతో పరిచయ ముండవలెను. కొంత వరకు చిత్రకారుని అనుభవములతో పరిచయముకాని, సానుభూతికాని వుండవలెను. సంగీతములోను అంతే. చిత్రమును చూచి, రమ్యతను గుర్తించి సంతోషమును పొందడమే 'చిత్రకళలో రసన' అంటారు. సంగీతమును విని రమ్యతను గుర్తించి, సంతోషమును పొందడమే 'సంగీతములో రసన' అంటారు. లలితకళలలో దేని కదే గొప్పగి. కాని బన్మతః రసన వుండవలసినది సంగీతములో. చంటిబిడ్డ ఏడ్చుచున్నప్పుడు బిడ్డను వూరడించుటకు అందములైన వస్తువులను చూపెదము. ఒకప్పుడు రంగులకు భ్రమసి బిడ్డ ఏడ్పు మానివేయును. ఒకప్పుడు బిడ్డ శ్రవణేంద్రియమును ఆకర్షించుటకు గణగణ గంట వాయించెదము. ఈధ్వని విని బిడ్డ కొంతసేపు ఏడ్పు మానును. కాని ఏడ్చుచున్న బిడ్డను హాయిగ నిద్రపోగొట్టునది తల్లి పాడే జోలపాటే. ఇతరములు పసిపాపను తాత్కాలికముగా ఆకర్షించినా జోలపాటలోని మార్దవము, హాయి, మైమరపింపజేసే శ్రావ్యత ఆ లేత హృదయంలో ఒక రససిద్ధి కలిగించినాయి. అయితే, పెద్దవారల విషయములో యిది అంత సులభము కాదు. అందులోనూ, కేవలము సంప్రదాయములకు కట్టుబడి, విద్యానైపుణ్యమును మాత్రము వెల్లడింపజేసే గానవిద్యాప్రకటన కొత్తవారిని ఆకర్షింపజాలదు. కాని, సంధ్యాసమయమున పొలముగట్టున చల్లగాలిలో, ఏ ఆటంకమును లేక, విచ్చలవిడిగా తన తీయని గొంతు విప్పి పాడు కర్షకుని రాగాలాపన అందరినీ తప్పక ఆకర్షించును. ఆదేవిధంగా కొమ్మమలువులో కూర్చుని తన రాజ్యము నేలు పసులకాపరి వేణువుకూడ. ఈ గానములందు ప్రతిభ అంతగా లేకపోవచ్చు. కాని యివి హృద్యములు. వీనిని విని, ఒక అరనిమిషము నిశ్చేష్టులుకానివారు అరుదు.

కొంతకాలముక్రితం విజయనగరంలో పూజ్యులగు సంగమేశ్వరశాస్త్రిగారు అద్భుతముగా వీణ వాయిస్తున్నారు, ఒకనాటి కచ్చేరిలో. నాకు సుపరిచితుడైన ఒక స్నేహితుడు ముందరికుర్చీలో కూర్చుని ఒక యిరువది నిమిషాలు ఆ వీణావాద్యమును వినెనట. ఇక అక్కడ వుండజాలక బయటనుండి తన్ను "ఎవరో పిలిచారు" అనే మిషపైన హాలుబయటకు వచ్చి తోటలోకి వెళ్లెనట. ఈయన లేవగానే, అదేవరుసలో

---

* ఆలిండియారేడియో - మద్రాసు కేంద్రము వారి అనుమతిని.

కూర్చునియున్న యింకొకరున్ను అదేవిధంగా లేచి యివతలకు వచ్చి ఇతనిని కలుసుకొని, "ఏమండీ, మీ కేమైన అర్థమైందా? నాకేమీ అర్థంకాలా" అని నవ్వె నట. గొప్ప పేరుగల సంగీతమాధుర్యమును అనుభవింప లేని తన అవస్థకు సిగ్గుపడుతూన్న నా స్నేహితుడు యీ యీసడింపుమాటలకు మరింత నొచ్చుకొనెనట. కాని, లోపము తనదే, అంత గొప్ప కళలోని మాధుర్యాన్ని ఆస్వాదించే శక్తి తనలో లేదు- అనుకుంటూ యింటికి వచ్చివేసెనట. తరువాత, మూడేండ్లు, విడువకుండా, ఎక్కడెక్కడ సుప్రసిద్ధ సంగీతజ్ఞుల గానము జరుగు తూంటే, అక్కడ నా స్నేహితుడూ హాజరే. ఎంతో శ్రద్ధతో వివిధ ప్రాంతముల సంగీతమును వినుచుండే వాడు. అతని పర్యటనా సందర్భాన, ఒక విదుషీ మణితో ప్రసంగిస్తూండగా, ఆ సంపన్నురాలి యెదు టకు ఆహ్వానింపబడిన ఒకానొక ఉత్తమ గాయకుడు ఆమెను మెప్పించడానికి కొన్ని రాగాలను ఆలాపించె నట. నా స్నేహితుడును శ్రద్ధతో వినుచుండెను. గాయకుడు సావేరిరాగాన్ని పాడ మొదలు పెట్టి నపుడు ఆమె పూర్తిగా సంగీతములో మగ్నయై పోయెను. కొంతసేపటికి ఆమె నిమీలితనేత్రములనుండి జొటజొట కన్నీరు స్రవించెను. తన రాచకార్య ములను ఎంతో ధీమాతో నిర్వహించే యీమెను సంగీతము అంత బేలగా చేయడము నా స్నేహితునికి కొత్త అనుభవము. తరువాత ఆ గాయకుని వద్దకు చేరి అర్థరాత్రిని, అతనివలన మరలమరల ఆ రాగమునే వినివిని అందలి అపూర్వభావపరంపరను అనుభవింప గలిగెనట నా స్నేహితుడు. యిది కొన్నేళ్ల క్రితము మాట. మరొకప్పుడు ఇతను ఒకచోట దేవగాం ధారిలో ఒక చక్కని పాట విని ఎంతో ఆనందించి, ఆ అనుభవమును మరలమరల మననము చేసుకొ జొచ్చెను. ఒకానొక వర్ణనాతీతమైన అన్వేషణ, ఏదో బెంగ, అందుబాటులో వున్న పరమావధి చటుక్కున దూరమవడము- యిటువంటివన్ని అతనికి ఆ రాగము వింటూన్నంతసేపు స్ఫురించేవట. ఇతడే మరి కొన్నాళ్లకు యింకొక రాగము వింటూ, తన ప్రక్కనున్న సంగీతప్రియుడైన స్నేహితునితో "యిది దేవగాంధారి కాదు" అన్నాడట. స్నేహితుడు "కాదు, ఆరభి" అని, "రెండు రాగములకు చాల సామ్య మున్నది" అన్నాడట. రాగభావములను మనస్సుచేత గ్రహింపగలిగెను నా స్నేహితుడు. ఈరీతినే అతనికి సంగీతమందు క్రమముగా పరిచయము కలిగింది. ఇప్పుడు ఒక్క సాంప్రదాయపు సంగీతమే కాదు, అన్నితర దేశాల సంగీతమందలి మాధుర్యములను అతడు విని ఆనం దింపగలడు. ఒక్కొక్కప్పుడు గాయకులుకూడ తమ గానమందలి భావములనుగురించి చెప్పలేనప్పుడు యితడు వింతగా విశదీకరించును. పేరుగల ఒకానొక ఉత్తరహిందూస్థాన గాయకుడు పాడుతూఉంటే "బం ధితుడైన సముద్రుడు విరామములేని తన గోడును విశ్వదాతకు విన్నవించుకొనే విలాపమును స్ఫురిస్తుంది వీరి గానం" అంటాడు నా స్నేహితుడు.

ఇతనినిగురించి యింత విశదంగా చెప్పడానికి కారణం సంగీతమున రసన అలవాటువలనకూడా కలుగుతుంది అని చెప్పడానికే. రసనకు కావలసినవి అభిరుచి, పరిచయము. ఎంత పరిచయ ముంటే అంత సులభముగాను, అంత త్వరగాను సంగీత మాధుర్యమును అనుభవించే నేర్పు కలుగుతుంది. అందరూ పాట చెప్పుకోనక్కర లేదు. అందరూ తమ చేతికి వచ్చిన వాద్యమును సాధకముచేయనక్కర లేదు. కాని, తమ కందుబాటులో ఉన్న చక్కని సంగీతమును విని ఆనందించే నేర్పు కలుగజేసుకో వచ్చును. ఇందాక చెప్పినట్టు తాము వినీవినీ ఆనం దించిన ఒక రాగభావమును మరియొక రాగభావముతో పోల్చుకొని, తారతమ్యములను గుర్తించుకొనే శక్తి పరిచయమువల్ల కలుగుతుంది. ఇతరవిషయములవలె కాక సంగీతవిషయములో కొన్నికొన్ని మన మనో వీథిని చిరస్థాయిగా వుండిపోతాయి. పదేళ్ల క్రితం, యిరువదేళ్ల క్రితం విన్న ఒకానొక అపూర్వసంగీత చ్ఛాయ వున్నట్టుండి మన మనస్సులో ప్రస్ఫుట మౌతూవుంటుంది. అప్పుడు కలిగే ఆనందము వర్ణనా తీతము. ఇతరఅనుభవములు మరపుదొంతరల వెనుక మణగిపోయినా, సంగీతఅనుభవములు మరగిపోవు. అవి మరలమరల తలెత్తుతూనే వుంటాయి. మనకు

మరీమరీ వాని జ్ఞాపకమువల్ల ఆనందము కలగజేస్తూనే వుంటాయి.

అభిరుచివల్ల, పరిచయమువల్ల రసన ఏర్పడుతుంది అన్నాము. కాని, నిర్దుష్టమైన రసనకు విచక్షణ అవసరము. మనము వినిన రెండు మూడువందల పాటలుగాని, రాగములుగాని మనలను ఒకేరీతిని ఆనందింపజేయవు. మనకు సంతృప్తికలుగజేయునవి కొన్నే. మనము పుస్తకములు చదువుతున్నప్పుడు చదివిన అన్ని పుస్తకములూ మనకు రుచింపవు కదా. కొన్ని కొంత చదివినతరువాత పైకివెళ్ల బుద్ధివేయదు. కాని కొన్ని పుస్తకములందలి వ్యక్తులు, సన్నివేశములు కొన్ని ఏండ్లయినపిదపకూడ మనకు స్మృతికివచ్చును. సంగీతవిషయములోనూ అంతే. అంతేకాదు, సాహిత్యములో "యిది తాత్కాలిక ప్రజ్ఞకలది — ఇది శాశ్వతమైన ప్రజ్ఞకలది" అనేటట్టుగానే సంగీతములోకూడ అంతే. ఒక వాతావరణలో, ఒకరకపు పాటలు గాలిదుమారములా చెలరేగవచ్చు. ఏపంచ విన్నా, ఏవీథిని విన్నా, తుదకు ఏసభలో విన్నా ఆపాటే కావచ్చు. కాని, మరికొన్ని నెలలయినపిదప ఆపాట కోరి వినాలన్నా వినిపించదు. ఒకొక్కప్పుడు, వింతగా, దానిస్థానే యిదివరకు ఎవ్వరూ వినని ఒక మిక్కిలి పురాతనమైన పాట వినవస్తూవుంటుంది. సంగీతములోని మంచిచెడ్డలు వినికిడివల్ల తెలుసుకోవాలి. కొంతపరిచయము కలిగిన పిదప ఈవిచక్షణ అంత కష్టముగాదు. అప్పుడప్పుడు యితరదేశములనుండి మనదేశములకు వచ్చు సంగీతజ్ఞులు మనదేశపు గాయకప్రముఖుల గానము విని "వారు పూర్తిగా అర్థముగావటం లేదు. కాని యిది గొప్ప సంగీతమనిమాత్రము నేను చెప్పగలను" అనడం మనకు తెలుసు. అంతేగాదు. వారు తమకు సుపరిచితమైన సంగీతభాండారములోని ఒక భాగము వినిపించి తాము వినిన సంగీతమునకును, దీనికిని సామ్యమును నిరూపిస్తూ వర్ణనాతీతమైన ఆనందము పొందుతారు. వీరే రసజ్ఞులు. ఇతరకళలకంటే ఎక్కువగా, ఇతరజాతీయసంప్రదాయముకంటే ఎక్కువగా ఒకజాతిప్రత్యేకతను వెల్లడిచేయగలిగినది ఆజాతిసంగీతమేనని నిజానికి ప్రసిద్ధము. అంతేకాదు, ప్రపంచములోని వ్యక్తులకూ వ్యక్తులకూ మధ్య వుండే తేడాను తగ్గించి, ప్రజలకూ ప్రజలకూ మధ్య వుండే వ్యత్యాసాన్ని నశింపజేయగలిగినది ఉత్తమసంగీతమే. ఉత్తమసంగీతమును విని ఆనందించడానికి, మనము చూచినట్టు, అభిరుచి కావాలె. ఈ అభిరుచి పుట్టుకతో లేకపోయినా అలవరచుకోవడము దుస్సాధ్యము కాదు. కాని సంగీతములోని అందమును అనుభవించే శక్తి అవసరము. అభిరుచితోబాటు పరిచయముకూడా ఎక్కువగా వుండాలి. తరువాత విచక్షణ. ఇది మంచి సంగీతము, యిది అంత మంచిసంగీతముకాదు అనేది సాధనమువల్ల తెలుస్తుంది. అప్పుడే పూర్తిగా రసన అలవడుతుంది.



# జగద్గురు తత్వబోధకస్వామి

[రాబర్టో డీ నోబిలీ అనే క్రైస్తవ ఫాదరీచరిత్ర]

= శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

దక్షిణదేశాన్నంతా ఏకచ్ఛత్రంగా పరిపాలించిన విద్యానగర చక్రవర్తులలో కడపటివాడు ౧౫౮౬-౧౬౧౪ మధ్య రాజ్యంచేసిన వెంకటపతి దేవరాయ మహారాయలు. ఆయన కొన్నాళ్లు పెనుగొండను, తరువాత చంద్రగిరిని రాజధానిగా చేసుకుని దేశపరిపాలన చేశాడు. ఆయనరాజ్యం కృష్ణానదికి దక్షిణాన కన్యాకుమారివరకు వ్యాపించి యుండేది. శ్రీరంగపట్నంలో ఆయనతమ్ముడుకొమారుడే రాజప్రతినిధిగా వుండి మైసూరు కర్నాటక రాజ్యాలను పరిపాలించేవాడు. ౧౬౧౦ లో రాజఒడయరు మైసూరుకు పరిపాలకుడైనాడు. బేదనూరు, లేక ఇక్కేరిలో ఒక సామంతమండలేశ్వరు డుండేవాడు. ఇలాగే దక్షిణదేశంలో తుండీరానికి జింజిలోను, పాండ్యానికి మధురలోను, చోళదేశానికి తంజావూరులోను సామంతమండలేశ్వరులు వుండి పరిపాలించేవారు.

విజయనగర సామ్రాజ్యము నేలిన చక్రవర్తులు తెలుగువారే అయినందువల్లను, వారి కాలంలో వివిధప్రాంతాలను పరిపాలించిన రాజప్రతినిధులు, సామంతమండలేశ్వరులు రాజబంధువులుగానో, తెలుగునాయకులుగానో వుంటూవున్నందువల్లను దేశప్రభుత్వమంతా తెలుగువారి చేతులలోనే వుండి కన్యాకుమారివరకూ గల దక్షిణదేశమంతా తెలుగుమయంగా వుండేది. ఆకాలంలో ఈదేశంలో వుండిన పాశ్చాత్యులు చాలామంది ఈసంగతినిగురించివ్రాసియున్నారు. విజయనగర సామ్రాజ్యం బలహీనమైనకొద్దీ సామంతమండలేశ్వరులు బలవంతులై కొంతకాలము సామంతరాజులై తరువాత స్వతంత్రరాజులైనారు. తంజావూరు మధు



జగద్గురు తత్వబోధకస్వామి
(రాబర్టో డీ నోబిలీ)
సమకాలికుడైన ఒకమిష్నరీగీసిన బొమ్మ-1609

రల నేలిన నాయకరాజులు చోళపాండ్యరాజు లని ప్రసిద్ధిజెందారు. వీరుకూడా విద్యానగర ప్రభువుల లాగనే తెలుగుకవులను, గాయకులను, పండితులను పోషించి ప్రజానురంజకంగా దేశాన్ని పరిపాలించారు. వీరి కాలంలో సంగీతసాహిత్యాలు, కళలు సర్వతో ముఖంగా అభివృద్ధిచెంది ఇప్పటికీ వారి కీర్తిని వేనోళ్ల చాటుతున్నవి.

వెంకటపతి దేవరాయల కాలంనాటికి కుమార కృష్ణప్పనాయకు డనే లింగమనాయకుడు మధురకు సామంత మండలేశ్వరుడుగా వుండేవాడు. అతడు ౧౬౦౨ లో చనిపోగా ఆయనకుమారుడు ముద్దుకృష్ణప్పనాయకుడు ౧౬౦౯ వరకూ పరిపాలించాడు. తరవాత ముద్దు వీరప్పనాయకుడు ౧౬౨౩ వరకూ పరిపాలించాడు. వీరప్పనాయకుడి కాలంలో వెంకటపతి దేవరాయలు చనిపోగా వీరప్పనాయకుడు మధురకు స్వతంత్రరాజైనాడు. ఆయనతరవాత తిరుమలనాయకు డని ప్రసిద్ధిజెందిన మహారాజమాన్య రాజశ్రీ తిరుమలశౌరి అయ్యలుగారు ౧౬౨౩ లో మధురరాజ్యానికి పట్టాభిషిక్తుడై ౧౬౫౯ వరకూ పరిపాలించారు.

## పోర్చుగీసువారు-క్రైస్తవమతప్రచారము

మన దేశానికి వర్తకం చెయ్యడానికి మొట్ట మొదట వచ్చిన ఐరోపాజాతివారు పోర్చుగీసువారు. వీరు మన దేశ రాజులను, వారి సామంతులను ఆశ్రయించి పశ్చిమసముద్రతీరంలో అక్కడక్కడ కొన్ని వర్తకస్థానాలను ఏర్పరచుకున్నారు. వర్తకులతోపాటు రోమను క్యాతలిక్కు శాఖకు చెందిన పోర్చుగీసు క్రైస్తవ మిషనరీలు కూడా ఇక్కడికి వచ్చి మతప్రచారం చెయ్యడం ప్రారంభించారు. వింతదుస్తులు ధరించి గొడ్డుమాంసం తింటూ మద్యపానం చేస్తూ కుల భేదాలు పాటింపక మాలమాదిగలతో కలిసిమెలిసి తిరిగే ఈ విజాతీయులనూ, వీరిలాగ వుండేవారినీ మన వాళ్లు 'పరంగీ' లని అనేవారు. పోర్చుగీసువారు ఎక్కువగా ఈ దేశంలో సముద్రతీరాన్ని వుండే పరవరు లనే పల్లెకారులలో క్రైస్తవ మత ప్రచారం చేశారు. ఈ పరంగీలకూ, దేశీయ స్త్రీలకూ పుట్టిన సంకరజాతి ఒకటి త్వరలోనే బయలు దేరింది.

వెంకటపతి దేవరాయ మహారాయల కాలం నాటికి విజయనగరసామ్రాజ్యంలో చాలాచోట్ల పోర్చుగీసువారు స్థిరపడ్డారు. మన దేశ రాజులు మొదటినుంచి సర్వమతాలవారినీ సమానంగా చూసే సహనబుద్ధి కలవారు గనుక రాయలవారు పోర్చుగీసువారి క్రైస్తవ మత ప్రచారానికి ఆటంకాలు కలిగించకపోవడమే గాక వారి క్రైస్తవమత ప్రచారకులైన జెసూటుమిషనరీ ఫాదరీలను ఆదరించి గౌరవించేవారు. క్రైస్తవ దేవాలయాలు కట్టుకోవడానికి, పాఠశాలలు స్థాపించడానికి, మత ప్రచారం చెయ్యడానికి అనుజ్ఞ నిచ్చేవారు.

చోళమండలంలో సముద్రతీరాన్ని వుండే పరవరు లనే పల్లెకారి జనంలో చాలామందిని పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకులు రోమనుక్యాతలిక్కు మతంలో కలిపినందువల్ల వాళ్ల క్షేమంకోసం పోర్చుగీసు క్రైస్తవ మతాధికారులు ఒక మిషనరీ ఫాదరీని నియమించారు. ఇందుకోసం నియమింపబడిన జెసూటు క్రైస్తవ మిషనరీ అయిన 'గొంజాలో ఫెర్నాండెజ్' అనే ఫాదరీ ౧౬౦౬ లో మధురానగరానికి వచ్చి అక్కడ తన నివాసం ఏర్పరచుకున్నాడు. అప్పుడు మధుర రాజ్యాన్ని పరిపాలించే సామంతమండలేశ్వరుడైన కుమారకృష్ణప్పనాయకుడు ఈఫాదరీని ఆదరించి మధురలో ఒక క్రైస్తవ దేవాలయం కట్టుకోవడానికి అనుజ్ఞ నిచ్చాడు. ఇలాగ పాండ్యరాజధానిలో క్రైస్తవ మత ప్రచారం చెయ్యడానికి అవకాశం ఒకటి ఏర్పడింది. ఫెర్నాండెజ్ ప్రజలతో కలిసిమెలిసి తిరిగేవాడు. ఏదో సందర్భంలో ఏసుక్రీస్తును గురించి చెప్తూ వుండేవాడు. ఆయన మంచితనమూ, సద్గుణములూ, బ్రహ్మచర్యవ్రతమూ చాలామందిని ఆకర్షించినవి. చాలామందికి ఆయనపైన సదభిప్రాయం కలిగింది. అంతట ఆయనసంగతి తెలుసుకుందామనీ, ఆయన క్రొత్త మతం సంగతి తెలుసుకుందామనీ కుతూహలంతో కొందరు బ్రాహ్మణులుకూడా ఆయనదగ్గరకు వచ్చి మాట్లాడుతూ వుండేవారు. అంతట ఆయన యింటికి దగ్గర మతధర్మాలను గురించిన చర్చలు తరుచుగా జరుగుతూ వుండేవి. ఈ జెసూటు మతప్రచార

కుడు త్వరలోనే ఒక ఆసుపత్రిని స్థాపించి అక్కడ క్రైస్తవులకే గాక ఇతరులకుకూడా మంచి మందు లిచ్చి చికిత్సలు చేసేవాడు.

## ఉత్తరాది తెలుగుజనము

అప్పట్లో మధుర రాజ్యంలో అన్ని వర్ణాలలోనూ తెలుగువారు చాలామంది వుండేవారు. అక్కడ స్థిర నివాసం ఏర్పరచుకున్న తెలుగువారిలో వివిధ కులాల శూద్రజనాన్ని అరవవారు 'వడుకనుబు', అనగా 'ఉత్తరాదివా' ళ్లని వ్యవహరించేవారు. ఇందులో రెడ్లు, కమ్మవారు, గొల్లలు మొదలైన కులాలవా రుండేవారు. అప్పట్లో మన తెలుగువారు ప్రతి విషయంలోనూ అరవలకన్న చొరవ గలవారుగా వుండేవారు. వీరు ఈ ఫాదరీతో ఎక్కువ స్నేహంగా వుండి ఆయనను గౌరవించేవారు. ఈ ఉత్తరాది జనాన్ని క్రైస్తవ మతంలో కలపాలని ఫెర్నాండెజ్ గారు విశ్వప్రయత్నాలు చేశారు. ఏసుక్రీస్తును గురించీ, క్రైస్తవ మతధర్మాలను గురించీ అతడు ఎన్నివిధాలుగానో వారికి బోధ చేస్తూ వుండేవాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఈ ఫాదరీగారు ఎంత మంచివాడైనా గొడ్డు మాంసం తిని మద్యపానం చేస్తూ మాలమాదిగలతో కలిసిమెలిసి తిరిగే పరంగిజాతివా డనిన్నీ, అందువల్ల మతంలో కలిస్తే కులభ్రష్టుల మైపోతా మనిన్నీ భయపడి ఎవరూ క్రైస్తవ మతంలో కలవలేదు.

కుమారకృష్ణప్పనాయకుడి తరవాత మధుర రాజ్యాన్ని పరిపాలించిన ముద్దుకృష్ణప్ప నాయకుడు కూడా క్రైస్తవ మత ప్రచారకులతో స్నేహంగానే వుండేవాడు. ఇది విని పోర్చుగల్లు దేశపు రాజుకూడా సంతోషించినట్లు ఉత్తరప్రత్యుత్తరాలవల్ల కనబడుతూ వుంది. ఇలాగ ౧౨ సంవత్సరాలు ఫెర్నాండెజ్ ఎంత కష్టపడినా క్రైస్తవ మతం వ్యాప్తి చెందలేదు.

## రాబర్టో డీ నోబిలీ

ఈ పరిస్థితులలో రాబర్టో డీ నోబిలీ అనే క్రైస్తవ మత ప్రచారకుడు ౧౬౦౬ లో మధురానగరికి వచ్చాడు. నోబిలీ ఇటలీదేశంలో మాంటి పుల్చియానో అనే గ్రామంలో క్రైస్తవ మత గురువైన పోపులకు బంధువులైన ఒక గొప్ప కుటుంబంలో ౧౫౭౭ లో జన్మించాడు. అతడు చిన్నప్పటినుంచీ తెలివైనవాడు. తన పదవయేటనే ఐరోపా దేశపు సంస్కృత భాష లనదగిన గ్రీకు లాటినులు ధారాళంగా మాట్లాడేవాడు. నోబిలీ ఇక్కడికి రాగానే క్రైస్తవ మతప్రచారం ఎందుకు బాగా జరగడం లేదని పరిశోధన చేశాడు. హిందూదేశ సముద్ర తీరాన్ని ఉన్న కొన్ని రేవుపట్నాలు పోర్చుగీసువారి స్వాధీనంలో వున్నా పోర్చుగీసు క్రైస్తవమతప్రచారకులు హిందూ దేశంలోని లోపలి భాగాలలోకి పోయి ప్రజలతో కలిసిమెలిసి లేనందువల్లను మతప్రచారం సాగడం లేదని నోబిలీ గ్రహించాడు. ౧౬౦౭ డిశంబరు ౩-వ తేదీన నోబిలీ తన దేశానికి వ్రాసిన ఈ వుత్తరంవల్ల ఆయన అభిప్రాయాలు తెలుస్తున్నవి :

“మధుర ఈ రాజ్యానికి రాజధాని నగరము. ధనవంతులూ, యుద్ధములందు ధైర్యవంతులూ అయిన ప్రజలతో క్రిక్కిరిసివున్నది. కాని ఈ ప్రజలకు అసలు ఈశ్వరుని సంగతి తెలియదు. వారు కేవలము విగ్రహారాధకులు. మన క్రైస్తవమతప్రచారకులు ౧౨ సంవత్సరాలనుంచి ఇక్కడ వుండి పనిచేస్తూవున్నా దేశీయులలో తమ అవసానకాలానికిముందు క్రైస్తవులైన ముగ్గురు నలుగురు తప్ప ఒక్కడైనా మన మతం స్వీకరించలేదు. ఇల్లాగని మన మతప్రచారకులు అసమర్థులు కారు. వారు చాలా సమర్థులు. సద్ధర్ములు”

పూర్వకాలమునాటి రోమునగరములోని విగ్రహారాధనమువంటి విగ్రహారాధనమే ఈ మధురలో ఇప్పు డున్నదని నోబిలీ ఇంకొక వుత్తరంలో వ్రాశాడు.

## క్రైస్తవ మతం ఎందుకు వ్యాపించటంలేదు ?

ఫెర్నాండెజ్ కృతకృత్యుడు కాకపోవడానికి గల కారణాలను నోబిలీ కనిపెట్టాడు. “రోము నగరంలో వున్నప్పుడు ఆ నగరవాసులలాగనే ప్రవర్తించాలి” అనే సామెత ప్రకారం క్రైస్తవమత ప్రచారకుడు తాను నివసిస్తూవున్న దేశాచార వ్యవహారాలకు

గమనించి ఆ ప్రకారం తానుకూడా ప్రవర్తిస్తేనే తప్ప లాభం లేదనిన్నీ, అలా ప్రవర్తించకపోవడమే గాక హిందూదేశాచారాలయందు అగౌరవము కలిగించే టట్లు ప్రవర్తించడంవల్ల ప్రజలకు అనుమానము, అవిశ్వాసము కలిగి వారు క్రైస్తవ మతానికి దరిచేరకున్నారనిన్నీ నోబిలీ కనిపెట్టాడు. అప్పటి విజయనగర చక్రవర్తి యైన రెండవ వెంకటపతి దేవరాయ మహారాయుల ఆస్థానంలో వుంటూవున్న ఆంటోనియో రూబినో అనే ఒక క్రైస్తవపాదరీకూడా ఇలాగే అభిప్రాయపడ్డాడు. ఈ రూబినో ఒక ఉత్తరంలో ఇలాగ వ్రాశాడు:—

"మనము గొడ్డుమాంసము తిని మద్యపానము చేసే పోర్చుగీసుజాతివార మనే కారణంవల్ల ప్రజలకు మనయందు అసహ్యభావము కలిగియున్నది. అందువల్లనే మన మతానికి వారిని చేర్చే ద్వారములు మూయబడియున్నవి. మన మిారాజ్యములో మద్యమాంసములను విసర్జించినా మనపట్ల వారికి విరోధము, అసహ్యము కలగడానికి మన నల్లని దుస్తులే చాలు. అందువల్ల మనలను వారొక మహామ్మారిని చూసినట్లు చూస్తారు. మనము పోర్చుగీసు దేశంనుంచి వచ్చిన క్రైస్తవ మతప్రచారకుల మనే సంగతి వాళ్ల మనస్సులో బాగా నాటుకొనివున్నది. అందువల్ల మన కృషిలో ఫలితం కలగాలంటే ముందుగా మనం ధరించే దుస్తులను మార్చుకోవాలి. తినే తిండిని మార్చుకోవాలి. వీలైనంతవరకూ వారు అవలంబించే ఆచారాలను మనంకూడా అవలంబించాలి. రాష్ట్రీయక్రైస్తవమతాధికారి (Father Provincial) కి ఈ సంగతినిగురించి నేను చాలాసార్లు వ్రాశాను. హిందువులు వేసుకునే దుస్తులు ధరించి, ఎవ్వరూ నన్ను ఎరగని వూరికి నన్ను పంపించాలని ఆయన అనుకుంటున్నాడు."

## 'పరంగీలు'

క్రైస్తవమతప్రచారం బాగా జరగకపోవడానికి ఇంకొక కారణంకూడా వున్నది. క్రైస్తవులైన దేశీయపరవరులను, వారి మతప్రచారకులను పరంగీ లని దేశీయు లనేవారు. దీని నిజమైన అర్థం ఎరగకపోవడంవల్ల క్రైస్తవమిషనరీలు ఆపేరును స్వీకరించేవారు. ఈ 'పరంగీ' అనే పదాన్ని ప్రజలందరూ చాలా నీచమైన అర్థంలో వుపయోగిస్తూ పరంగీల మతాన్నికూడా నీచంగా చూసేవారు. నోబిలీ జాగ్రత్తగా విచారించగా దీని కారణం తెలిసింది. "'పరంగీ' అనే మాటను పోర్చుగీసువా రనిగాని, ఐరోపాదేశీయులనిగాని, క్రైస్తవులనిగాని అనే అర్థంలో ప్రజలు వాడడం లేదు. ప్రజలకు వీరి సంగతి తెలియనే తెలియదు. 'పరంగీ' అంటే నీతిధర్మాలుగాని, మానమర్యాదలుగాని లేక త్రాగుబోతులుగా వుండి అసహ్యకరమైన జంతువుల మాంసాలనూ, తుదకు మనుష్యమాంసాన్నికూడా పీక్కుతింటూ శాస్త్రమతధర్మాలు లేని పశుప్రాయులైన నీచమానవు లని ఆమాటకు అర్థం. ప్రతిభాశాలురైన పోర్చుగీసుజాతివారి నెవ్వరినీ హిందువులు చూచివుండలేదు. ఇక్కడకు వచ్చేవారు రెండురకాలవారుగా వుంటారు. ఇక్కడనే పుట్టిపెరిగి పోర్చుగీసురక్తస్పర్శ ఆవంతయైనా లేకపోయినప్పటికీ నాలుగు పోర్చుగీసుముక్కలు నోటికి రాగానే తమ అసలుజాతిలోనుంచి బైటపడి పోర్చుగీసువారి మైత్రి మనుకునేవారు. వీరిని పోర్చుగీసువారు టోపాజూసంకరజాతివా ళ్లని అంటారు. హిందూదేశీయులు వీరిని పరంగీ లంటారు. అందువల్ల తెల్లవాడైనా నల్లవాడైనా పోర్చుగీసువాళ్లలాగ దుస్తులు ధరించే నల్లవాళ్లందరనీ పరంగీ లనడం అలవాటయింది. ఇంక ఇక్కడకు వచ్చే ఇంకొకరకంమనుష్యులు పుట్టుకవల్ల యూదులై వుండిన్నీ పోర్చుగీసువారితో ఏర్పాటుచేసుకొని వర్తక వ్యవహారాలమిాద యిక్కడికి వచ్చేవారు. వీరినికూడా మధురాపట్టణవాసులు పరంగీ లంటారు. ఈ రెండు రకాలవారితో ఏమాత్రం సంపర్కం గలవారికైనా వీరి కులము, శీలము, విశ్వాసపాత్రత, శుభ్రత ఎలాంటివో బాగా తెలిసిన విషయమేకదా! అందువల్ల 'పరంగీ' అనే మాట నీచంగా వాడబడడంలో ఆశ్చర్యమేముంది?" అని నోబిలీ వ్రాశాడు.

## 'పద్ధతి మార్చాలి'

పైన చెప్పిన సంగతిసందర్భాలన్నీ యోజించిన మిాదట హిందువులను క్రైస్తుమతధర్మాలవైపునకు

ఆకర్షించాలంటే ముందుగా మిషనరీలు తమ జీవితవిధానాన్నీ, ఆచారాలనూ, పద్ధతినీ మార్చుకోవలసివున్నదనే సంగతి స్థిరపడింది.

రాబర్టో నోబిలీ తన ఉద్దేశ్యాలను ఆచరణలో పెట్టేటందుకు ముందు పైవారితో ఆలోచించాడు. రాష్ట్రీయమతాధికారియైన లెయిర్జియో నోబిలీ వేసిన పథకాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించాడు. ఆయనపై యధికారియైన క్రాంగనూరు ఆర్చిబిషప్పు ఫ్రాన్సిస్కో రోస్ గారితోకూడా నోబిలీగారు ఆలోచించి వారి అంగీకారాన్ని పొందినాడు. ఇద్దరూ కలిసి ఒక కార్యాచరణపద్ధతిని నిర్ణయించారు. ఆర్చిబిషప్పు గారుకూడా హిందువుల విగ్రహారాధననుగురించీ, మతధర్మాలనుగురించీ వ్రాయబడిన పుస్తకాలను కొన్నిటిని ముందుగా చదివారు. తరువాత మలబారుతీరాన్ని ఉన్న రోమనుక్యాథలిక్కు క్రైస్తవమతప్రచారకులలో ప్రజ్ఞావంతులైన విద్వాంసులతోను, పోర్చుగల్లు దేశంలో వున్న మతాచార్యులతోనూకూడా ఆలోచించారు. అందరూకూడా వీరి అభిప్రాయాలతో యేకీభవించారు. అందువల్ల యీ ఆర్చిబిషప్పుగారు కూడా నోబిలీగారికి ఈవిషయంలో తమ అంగీకారమును తెలిపారు. బ్రాహ్మణులు ధరించే శిఖాయజ్ఞోపవీతములు, అనగా జుట్టుకుడిన్నీ, జందెములున్నూ, వారు పెట్టుకునే గంధాక్షింతలూ, బొట్టున్నూ, వారు అవలంబించే ఇతరాచారాలున్నూ వారి మతసంప్రదాయాలకు సంబంధించిన చిహ్నాలు కావనిన్నీ, అవి కేవలము వారు ఉత్తమవంశజు లనిన్నీ, ఉన్నతకులంవా రనిన్నీ చూపడానికి యేర్పడిన బాహ్యచిహ్నలనిన్నీ, అందువల్ల క్రైస్తవమతంలో కలిసిన హిందువులు తమతమ కులాచారాలకు సంబంధించిన జుట్టు, కట్టు, బొట్టు మొదలైన బాహ్యచిహ్నాలను యేలాంటి అభ్యంతరమూ లేకుండా వుంచుకోవచ్చుననిన్నీ ఈ క్రైస్తవమతాచార్యులు ఆఖరికి ఒక నిశ్చయానికి వచ్చారు. ఈసంగతులన్నీ ౧౬౧౯ లోను, ౧౬౧౩ లోను రాష్ట్రీయక్రైస్తవమతాధికారికిన్నీ, క్రాంగనూరు ఆర్చిబిషప్పుగారికిన్నీ జరిగిన వుత్తరప్రత్యుత్తరాలవల్ల కనబడుతున్నవి.

## జగద్గురు ‘తత్వబోధకస్వామి’

నోబిలీ మధురానగరానికి వచ్చిన ఒక సంవత్సరానికి ౧౬౦౭ లో తన సోదరక్రైస్తవమిషనరీఫాదర అయిన ఫెర్నాండెజ్ తో సంబంధం లేకుండా తానొక కొత్తపంథా తొక్కి ఒక నూతనజీవితవిధానాన్ని ప్రారంభించాడు. ఇతడు మధురానగరంలోని బ్రాహ్మణుల దగ్గిరికి వెళ్లి తాను పరంగీని కాననిన్నీ, పోర్చుగీసు జాతివాడనుకూడా కాననిన్నీ, ఇటలీదేశానికి ముకుటాయమానంగా వుండి ఒక పురాతననాగరకసామ్రాజ్యానికి రాజధానియైన రోమునగరంలో ఒక ఉత్తమరాజవంశానికి చెందిన రాజకుమారుడ ననిన్నీ, తన కీప్రపంచముమీద రోతపుట్టి వైరాగ్యం కలిగి సన్యసించితి ననిన్నీ చెప్పి ఒక సన్యాసిలాగనే జీవించడం ప్రారంభించాడు. ఆ క్షణంనుంచి శూద్రసేవకుల నెవ్వరినీ తన దగ్గిరకి రానివ్వక తన పరిచర్యల నిమిత్తం బ్రాహ్మణులనే నియోగించాడు. ఒక్క పూటమాత్రం ఇంత అన్నమూ, పాలూ, కూరగాయలూ పుచ్చుకుని నియమంగా వుండేవాడు. బ్రాహ్మణఅగ్రహారంలో ఒక సంపన్నుని ఆశ్రయించి, కొంత స్థలం పుచ్చుకుని తనతోడి క్రైస్తవమతప్రచారకుడితో సంబంధం లేకుండా అక్కడ ఒక పూరియిల్లు వేసుకుని అందులో నివసించడం ప్రారంభించాడు. ఈ యింటిని మధురానగరాధికారే యిచ్చాడని ఫాదర్ గ్రురెయిరో వ్రాశాడు.

“నోబిలీ బ్రాహ్మణఆచారాలన్నీ అవలంబించాడు. తన పరిచర్యల నిమిత్తం బ్రాహ్మణులనే నియోగించాడు. తాను రోమునగరాన్నుంచి వచ్చిన ఒక బ్రాహ్మణసన్యాసి నని చెపుతూ అందు కనుగుణ్యంగా ఈదేశపు బ్రాహ్మణసన్యాసులలాగనే ఇతరోపాజాతివారితో గాని, అస్పృశ్యులతో గాని సంపర్కం లేకుండా ఏకాంతవాసం చెయ్యడం ప్రారంభించాడు” అని జాన్ డ్రిబిటో అనే క్రైస్తవమతాచార్యుడు వ్రాసియున్నాడు. త్వరలోనే ఈ నోబిలీ కేవలమూ ఒక బ్రాహ్మణవేదాంతిగా మారిపోయినా డని రాష్ట్రీయక్రైస్తవమతాధికారియైన ఫ్రాన్సిస్కో రోస్ గారు అన్నారు. క్రైస్తవమతప్రచారకుడైన ఫాదర్ రాబర్టో డీ నోబిలీ అచిరకాలంలోనే ‘జగద్గురు తత్వబోధక

స్వామి' అనే నూతననామకరణంతో ప్రసిద్ధికెక్కాడు. ౧౬౦౭ డిశంబరు ౧-వ తేదీన కార్డినల్ బెల్లార్మినో గారికి నోబిలీ వ్రాసిన రహస్యలేఖలో అతడు ఇలాగ అన్నాడు: "ఇప్పుడు నేను చుట్టూ మట్టిగోడలు గల ఒక పూరిపాకలో వాసంచేస్తున్నాను. దివ్యసౌధంకంటె నాకిదే ఆనందకరంగా వుంది. ఈశ్వరసేవకోసం ఈ విధంగా దేశాంతరంలో ఏకాంతవాసం చెయ్యడంలో వుండే మానసికశాంతి ఇంకొకదానిలో లేదు. అయినా నేను పూనిన ఈ దీక్షలో వుండే శ్రమ ఒక్కొక్కప్పుడు చాలా బాధాకరంగా వుంటున్నది. నా యావజ్జీవమూ ఇలాగ శ్రమపడాలేమోననే ఆలోచనవల్ల చివరదాకా నిగ్రహించలేనేమోనని ఒక్కొకప్పుడు అధైర్యం కలుగుతూ వుంటుంది. నా నిత్యజీవితవిధానం ఇలాగ జరుగుతూవుంది. ప్రొద్దున్ననుంచి సాయంత్రందాకా ఎక్కడికీ కదలకుండా నేను నాయింట్లోనే కాలక్షేపం చేస్తూవుంటాను. నాతో ఎవరైనా మాట్లాడడానికిగాని, చర్చించడానికిగాని వస్తే నేను ఈశ్వరప్రార్థనము చేసినతరవాత వాళ్లకు దర్శనమిస్తాను. దేశీయులలో ప్రబలియున్న పోరబాటుమతసిద్ధాంతాలను ఖండిస్తూ దేశభాషలో వ్రాసేటందుకు మిగతా కొద్దికాలాన్ని వినియోగిస్తూ వుంటాను. నేను ఎల్లప్పుడూ యింటిలో నా చిన్నగదిలోనే కాలక్షేపం చేస్తూవున్నందువల్లనూ, మాంసముగాని కోడిగ్రుడ్లుగాని నా గడపలోకి రావడానికి వీలులేదని నేను నిషేధించినందువల్ల నేను తినే ఆహారము నాకు తగిన బలము నివ్వనందువల్లనూ నాకు ఎప్పుడూ ఏదో జబ్బుగానే వుంటూవున్నది. నా కడుపులోనో, తలలోనో నొప్పి లేకుండా వున్న రోజులు బహుతక్కువ. నేను తినే ఆహారము వరిఅన్నమూ, కూరగాయలూ, పళ్లూను. నేను ఇవితప్ప ఇంకొకటి తినకూడదు. ఈ దేశంలో తత్వబోధ చేసే మతాచార్యులూ, సన్యాసులూ ఇంకా కఠినమైన యమనియమాలతో జీవిస్తారు. ఒక్క మెతుకు అన్నమైనా తినని వాళ్లుకూడా వున్నారు. ఈదేశంప్రజలు నానురొట్టె తినడం ఎరగనేఎరగరు. ఇక మద్యం, అనగా సారాయము 'మాస్' అనే క్రైస్తవప్రార్థననిమిత్తంమాత్రమే నేను వుపయోగిస్తున్నాను. అన్నంకూడా వర్జిస్తే ఇక మనిషి తినే ఆహారం ఎంత స్వల్పంగా వుంటుందో ఊహించండి. అన్నం వర్జించడానికి నేను సాహసించలేదు. ఇప్పుడు నేను పెట్టుకొన్న నియమాలే, అనగా మాంసము, చేపలు, గ్రుడ్లు వర్జించడమే నేను నిజమైన మతాచార్యుడనని ప్రజలు అనుకునేటందుకు చాలును. ఈ వుత్తరం వ్రాస్తూవున్న సమయంలో నేను ఉబ్బసం దగ్గువల్ల వూపిరి ఆడక బాధపడుతున్నాను. అందువల్ల దీనిని మెల్లమెల్లగా వ్రాస్తున్నాను."

నోబిలీ ఒక బ్రాహ్మణవంటవాడిని పెట్టుకున్నాడు. శూద్రుడిచేతి అన్నం తినడానికి సాహసించేవాడు కాడు. సన్యాసులందరిలాగనే అతడు మధ్యాహ్నం నాలుగుగంటలవేళ ఒంటిపూటభోజనం చేసేవాడు. దినమంతా అతడు దేశభాషలను చదవను వ్రాయను నేర్చుకునేవాడు. అతడు ఈ దేశానికిరాగానే కొచ్చినులోనే అరవం నేర్చుకోవడం ఆరంభించాడు. ఆరునెలలలో ఇతరులతో మాట్లాడేశక్తి సంపాదించాడు. రెండేళ్లలో (౧౬౦౯లో) అతడు మళ్లీ తన దేశానికి వ్రాస్తూ అరవంలో మాట్లాడడంకంటె ఇటాలియను పోర్చుగీసు భాషలలో మాట్లాడడమే ఇప్పుడు తనకు కష్టముగా వున్నదని వ్రాశాడు. ఈ అరవభాష చాలా గొప్పదనిన్నీ, అందమైనదనిన్నీకూడా వ్రాశాడు. అతడు తమిళగ్రంథకర్తలలోనుంచి పద్యాలు చదువుతూ కథలు వుదాహరిస్తూ గ్రాంథికమైన అరవాన్ని చక్కగా మాట్లాడేవాడని ౧౬౦౮లో ఆయనతోడి మతాచార్యుడొకడు వ్రాశాడు. అరవం బాగా వచ్చిన తరవాత నోబిలీ తెలుగును, సంస్కృతమును నేర్చుకోవడం ప్రారంభించాడు. ఇంతవరకూ తెల్లవారెవ్వరూ తెలుగు నేర్చుకోలేదు. మధురవాస్తవ్యుడైన ఒక బ్రాహ్మణపండితుడు నోబిలీకి ఈభాషలు నేర్పడానికికుదిరాడు. ౧౬౦౯ ఏప్రిలు ౨౨-వ తేదీనరాష్ట్రియాధికారికి నోబిలీ వ్రాసిన ఉత్తరంలో తన పంతులవారిని గురించి ఇలాగ వ్రాశాడు: "ఈ పద్బ్రాహ్మణుడు నాకు చేసే ఉపకారానికి తగినట్లుగా నా కృతజ్ఞతను తెల్పజాలను. సంస్కృతము, తెలుగు ఆయనవల్ల నేను నేర్చుకోవడమే గాక అంతకన్న అమూల్యమైన విషయాలను ఆయనవల్ల తెలుసుకోగలిగాను. వేదాల రహస్యాలను ఆయన నాకు చెప్పాడు. వేదాలను వ్రాయడం మహా

# ఒక వత్సరము నందు జయము




క్రిత వత్సరము మీద 100% వరుంబడి

# నేషనల్

## ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

7. కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా : మద్రాసు బ్రాంచి : ఎస్ప్లనేడ్, మద్రాసు.
బ్రాంచీలు, చీఫ్ యేజన్సీ ఆఫీసులు, హిందూదేశమంతటను, విదేశములలోను కలవు.

## ఈశ్వర్స్
## రత్నపురుష లేహ్యం

శుక్లనష్టము, మలబద్ధము, నరముల బలహీనత, నీరసము తగ్గించి, బలము, కండపుష్టి, రక్తము, వీర్యవృద్ధి నిచ్చును.

## గనోక్యూల్

అనిసెగలను అద్భుతముగ తగ్గించును. ఇతర ఔషధములకు లోబడని కేసులలో సహితము యిది కుదుర్చును. మూత్రనాళిమండలి మంట, రసివంటి చెడ్డనీరు స్రవించుట అద్భుతముగ తగ్గించును.

## కుముద

స్త్రీల తెల్ల, ఎర్రకుసుమలు. అకాలబహిష్ట, ఋతుశూల, వెన్నునొప్పి, గుండెనొప్పి తగ్గించును. ఋతురక్తమును జారీచేయును. గర్భపాతమును కాకుండచేయును.

అన్ని గొప్ప మందులషాపులయందును దొరకును

ఈశ్వర ఫార్మసీ, మద్రాసు.

---

## డక్కన్ హైర్ ఆయిల్
### వాడుడు

అనుకరణీయములకు అందదు




వెంట్రుకల పెరుగుదలకు చాలా శ్రేష్ఠమైనది. జబ్బుపడిలేచిన వారికి, ప్రసవించిన స్త్రీలకు వూడిపోవు జుట్టును వూడిపోకుండా కాపాడును.

చదువుకొనేవారు, మనోపరిశ్రమ చేయువారు దీనిని వాడి, తమ కిది ఎక్కువ అనుకూలముగా నున్నదని ప్రశంసించిరి.

DECCAN HAIR OIL COMPANY,
Hyderabad (Dn.)

---



## గర్భినాల్ (రిజిస్టర్డు)

**గర్భాశయసంబంధమైన సమస్తవ్యాధులకు అమోఘమైనచికిత్స**

ఒకసారి వాడిచూచిన దానిగుణము తెలియగలదు.

కెమిస్టు లందరివద్ద దొరకును.

కాట్ని (సి. పి.) నుండి ఒక స్త్రీ వ్రాయుచున్నది:—మీమందు నాకు బాగా పనిచేసినది. వీపులోను, పొత్తికడుపులోను భరింపరాని బాధయుండెడిది. ఇంగ్లీషుమందులు యెన్ని తీసికొన్నను ప్రయోజనం లేకపోయెను. నా స్నేహితురాలొకరు మీమందును గురించి చెప్పగా నేను వాడితిని. ఇపుడు బాగా స్వస్థత చేకూరినది. నేను దానిని కొంతమంది నా స్నేహితురాండ్రకు గూడ శిఫారసు చేయుచున్నాను. (సం.)............

విజయ ఫార్మసీ, — త్రిచూరు.

---



## వాజీకర

**ధాతుపుష్టికి—బలానికి**

ఎక్కువ చదువు, ఆలోచనవల్ల కలుగు తలదిమ్ము రాకుండ చేయును.

కుత్సితపుచేష్టలవలనకలుగు జబ్బు లన్నిటిని పోగొట్టును.

మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు
107 బ్రాడ్వే, మదరాసు



పక్షవాతమునకు అమోఘమయిన

## 1. క్షీరబల 101 సార్లు ఆవర్తితము
## 2. అయవరము

వాడిచూడుడు. తృప్తిచెందుడు.

ఆయుర్వేదాచార్య ఎన్. మాధవమీనన్, ఎ. ఎం. ఎ. సి., కన్సల్టింగు ఫిజిషియన్.

మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు
107 బ్రాడ్వే, మదరాసు

పాతక మని బ్రాహ్మణుల వూహ. దానిని ఎంతో కష్టపడి పదిపన్నెండేండ్లు పాఠము చెప్పించుకుని కంఠస్థము చేస్తారు. ఈ విషయంలో నా గురువు తన శంకలను మాని సూత్రాల నన్నింటినీ నాకోసం వ్రాసిపెట్టాడు. అయితే ఇది చాలా రహస్యంగా చెయ్యాలి. ఈ సంగతి ఇతరబ్రాహ్మణులకు తెలిస్తే వాళ్లు ఆయనగ్రుడ్లు పీకుతారు. ఇది నేర్పేటందుకు ప్రాణభయానికి కూడా తెగించాలి. ఎందువల్లనంటే హిందువులను క్రైస్తవ మతంలో కలపాలంటే ఈ రహస్యాలు తెలియడం చాలా అవసరం." ఈ విద్యను అభ్యసించడంలో నోబిలీ అమితమైన పట్టుదలతో పనిచేశాడు. ఆఖరుకు క్షవరం చేయించుకుంటూ వున్నప్పుడుకూడా పాఠాలు చదువుతూనే వుండేవాడు.

౧౬౦౮ లో నోబిలీని గురించి ఒకడు వ్రాసిన దానిలో ఇలా వుంది: "అతడు సంస్కృతం నేర్చుకోవడం మొదలుపెట్టాడు. అప్పుడే అతడు ఆభాషను చదవడమూ, మాట్లాడడమూ కొంతవరకు నేర్చుకొన్నాడు." లెయిర్జియో రెండేళ్ల తరువాత ౧౬౧౦ డిశంబరు ౨ వ తేదీన ఆభాషను నోబిలీ బాగా అర్థం చేసుకోగలుగుతున్నాడనిన్ని, ధారాళంగా మాట్లాడుతున్నాడనిన్నీ వ్రాశాడు. నోబిలీ మూడు భాషలను బాగా నేర్చుకున్నాడనిన్నీ, వాటిలోని గుంటచిక్కులన్నీకూడా నేర్చుకున్నాడనిన్నీ, మతాంతరులైన హిందూదేశీయుల మతరహస్యాల నన్నిటినీ బాగా గ్రహించాడనిన్నీ రాష్ట్రీయాధికారియైన రోస్‌గారు ౧౬౧౩ లో వ్రాశారు. ఈ భాషలను కొంతవరకు అభ్యసించిన ఆర్చిబిషప్పుగారు కూడా నోబిలీ యొక్క శక్తిసామర్థ్యాలనూ, పాండిత్యాన్నీ చూచి ఆశ్చర్యపడ్డారు.

## భేషజము - పటాటోపము

ఈ తత్వవేత్తచుట్టూ ప్రజలు గుమికూడడం ప్రారంభమైనది. కొందరీయనను గొప్పవాడని పొగడడం ప్రారంభించారు. ఈయనను చూడాలనీ, ఈయన చెప్పే సంగతులు వినాలనీ కొందరు ఈయన యింటికి పోవడం ప్రారంభించారు. "ఈకొత్తస్వాములవారు ఎక్కడనుంచి వచ్చారు? ఇతనిది యేకులం? ఈయన సిద్ధాంతాలేమిటి? జీవితవిధానం ఎలాంటిది?" అనే సంగతులన్నీ తెలుసుకోవాలని మధురాపురజనులలో చాలామందికి కుతూహలం కలిగింది. హిందూదేశపు స్వాములవార్ల పద్ధతులను నోబిలీ బాగా ఎరిగినవాడైనందువల్ల మొదట తన యింటినుంచి బయటికి పోలేదు. చూడవచ్చినవారితో చాలా మితభాషణం జరిపేవాడు. నోబిలీని చూడడానికి ఎవరైనా వచ్చినప్పుడు "ఇప్పుడు సమయం కాదు. స్వాములవారు సమాధిలో ఉన్నా"రనిగాని, "నిద్రలో ఉన్నా"రనిగాని ఆయనశిష్యుడు చెప్పేవాడు. ప్రజలలో కుతూహలం అమితమైపోయినతరవాత - చూడవచ్చినవారు ఒకటి రెండు సార్లు దర్శనంకోసం వచ్చి తిరిగిపోయిన తరవాత నోబిలీ దర్శనం యిచ్చేవాడు. "'అయ్యరు' గారితో మాట్లాడడానికి వచ్చాము. చూడడానికి వీలౌతుందా" అని వచ్చినవారు అడిగితే చాలాసేపటికిగాని దర్శనం యిచ్చేవాడు కాదు. ఆఖరుకు వారిని లోపలికి రానిచ్చినప్పుడు ఎర్రని జేగురురంగుగుడ్డను కప్పివున్న ఎత్తైన వేదికమీద ఆయన పద్మాసనం వేసుకొని కూర్చుండి వుండేవాడు. ఆయనముందు అలాంటి కాషాయరంగు బట్ట యింకొకటి పరచివుండేది. దానిదగ్గరగా ఒక చాప వుండేది. ఆయనను చూడడానికి వచ్చినవారందరూ చేతులెత్తి ఆయనకు నమస్కరించాలని అక్కడివారు చెప్పేవారు. ఎంత గొప్పవారైనా, రాజోద్యోగులైనాకూడా ఆయనకు అలాగ నమస్కరించేవారు. ఆయనకు శిష్యులు కాదలచినవారు ఇలాగ మూడుసార్లు భక్తితో నమస్కరించి సాష్టాంగపడి మ్రొక్కేవారు. ఈసంగతులనుఫిగోరా(Figuoroa) వ్రాశాడు.

ఈ ఐరోపా దేశపు స్వాములవారివల్ల కొన్ని సంగతులు వినాలని. మధుర రాజైన ముత్తువీరప్పనాయకునికికూడా కుతూహలం కలిగి తన దర్బారులో చాలాసార్లు అన్నాడట, అంతట నోబిలీని బాగా ఎరిగినవారొకరు ఈసన్యాసి తనకు స్త్రీల ముఖం కనబడుతుందేమో నని తన యిల్లు వదిలి బయటకే రాడనిన్ని అన్నారట! ఒక్కమారైనా వీథిలో నడవకుండా ఇలాగ ఒకసంవత్సరంపాటు నోబిలీ కాలక్షేపం చేసే

టప్పటికి ఆయననుగురించి ప్రజలకు గౌరవం కలిగింది. తరవాత ఎప్పుడైనా ఒకమాటు ఊరిబయట దూరంగా ఉన్న తన పెద్దయింటికి ఒక పల్లకీలో యెక్కిపోయే వాడు. అప్పుడు ఆయనపల్లకీముందు ప్రజలను తొలగమని కేకలు వేస్తూ చోపుదార్లు పరుగెత్తేవారు. కొన్నాళ్లతరవాత నోబిలీ ఈ భేషజమంతా కట్టిపెట్టి సామాన్యస్వాములవారిలాగనే ఒక కాషాయాంబరం ధరించి ఒక పెద్ద పొడుగుపాటిదండము చేతపుచ్చుకొని ఇద్దరు బ్రాహ్మణశిష్యులు వెంటరాగా కాలినడకనే బయలుదేరాడు. మొట్టమొదట ఇలాంటి భేషజము చూపించాలని నోబిలీ అనుకోలేదట గాని మాటలసందర్భంలో ఒక హిందూ పండారము ఆయనకు ఇలాగ సలహా యిచ్చాడట: "కేవలమూ మీమట్టుకు మీరు తరించాలంటే మీరే మారుమూలప్రదేశానికో పోయి దిగంబరిగా వుండవచ్చును. కాని ఇతరులను తరింపజెయ్యాలని మీ వుద్దేశ్యమని మీ రంటున్నారు. గనుక మీరు పటాటోపం కనబరిచితీరాలి. నిజమైన విరాగి పట్టుపీతాంబరాలనూ గుడ్డపీలికలనూ, భోగ్యభోగ్యాలనూ దారిద్ర్యమునూ, మానావమానాలనూ ఒక శవము వహించే ట్లు నిర్లిప్తతతో ధరించాలి" అని అన్నాడట. ఈ పండారము సలహా నిచ్చినది ౧౬౦౮-వ సంవత్సరం మధ్యలో నట. అంతకుపూర్వము నోబిలీ యింకా పోర్చుగీసుమతాచార్యుల నల్లదుస్తులను ధరించేవాడట. బడగలనే తెలుగువారి కిది చాలా అసహ్యకరంగా వున్నదనిన్నీ, దీనిని తీసివేసి ఈ దేశంలో మతగురువులు, స్వాములు ధరించే దుస్తులనే మీరుకూడా ధరించవలసినదనిన్నీ ఆ పండారము ఆయనకు గట్టిగా చెప్పాడట. మీరుమాత్రం ధరించాలంటే మీయిష్టం వచ్చిన దుస్తులు వేసుకొనవచ్చునుగాని మీరు ఇతరులకు ముక్తిమార్గాన్ని బోధించదలచుకుని శిష్యులను ఆకర్షించదలచుకుంటే మీరు సాధ్యమైనంతవరకు ఈ దేశాచారాలను అవలంబించాలనికూడా అన్నాడట. అంతట నోబిలీ ఒక స్వాములవారిలాగ తయారైనాడు.

లెయిర్జియోగారి వుత్తరంలో ఈయనదుస్తుల వర్ణన కనబడుతూవుంది. ఈయన ఒక పొడుగైన కాషాయపుటంగీ ధరించి ఒక కాషాయపు ఉత్తరీయాన్ని కప్పుకునేవాడు. ఆ రంగుగుడ్డతోనే తల కొక తలపాగా చుట్టుకునేవాడు. కాళ్లకు పావకోళ్లు తొడుగుకునేవాడు. ఇంతేకాదు. ఈ దేశంలో బ్రాహ్మణులూ, క్షత్రియులూ ఉపనయనంలో ధరించే ఉత్తరజంధ్యములవంటివి మూడు బంగారుపోగులూ, రెండు వెండిపోగులూ గల ఉత్తరజంధ్యములను వేసుకొని వాటిమధ్య మెడలో ఒక శిలువనుకూడా ధరించేవాడు. దీనికి క్రైస్తవమతానికి సంబంధించిన అంతరార్థం వున్నదని అనేవాడు. కొన్నాళ్లైనతరవాత జగద్గురువు యిలాంటి జంధ్యము వేసుకోనక్కరలేదని నోబిలీ దానిని విసర్జించాడు.

## విచిత్ర వేదాంతము

నోబిలీ చేసే మతబోధ, ప్రచారము చాలా చిత్రంగావుండేవి. హిందువులమతగ్రంథాలలోనికథలూ సిద్ధాంతాలలోనుంచి తన కుపయోగించే సంగతులు తీసుకొని వాటినిబట్టి మతబోధ చేసేవాడు. ఈ హిందూ దేశీయులకు నాలుగు వేదము లున్న వనిన్నీ, అందులో ఒకటి పోయినదనిన్నీ నోబిలీ విన్నాడు. ఇప్పుడున్న వేదాలలో బ్రహ్మవిష్ణు మహేశ్వరులనుగూర్చి చెప్పబడిన దనిన్నీ, నాల్గవదానిలో కేవలమూ మోక్షమార్గమే వివరింపబడిన దనిన్నీ, కేవలం ఇప్పుడున్న వేదాలవల్ల తరించలేరనిన్నీ, ఆ నాలుగవ వేదమును ఉద్ధరించగల బుద్ధిమంతు డెవ్వడూ లేడని అనుకుంటున్నా రనిన్నీ విన్నాడు. "ఈ ప్రజలు మోక్షమార్గమును వాంఛిస్తారు. అపచారాలకు ప్రాయశ్చిత్తాలను చేసుకుంటారు. దానధర్మాలు చేస్తారు. తమ విగ్రహాలకు అతిభక్తి విశ్వాసాలతో మ్రొక్కుతారు. అందువల్ల వీరినమ్మకాలనుపురస్కరించుకొని నోబిలీ పనిచేయ దలచాడు. తాను మోక్షమార్గమును బోధించడానికి వచ్చాననిన్నీ, తమ బ్రాహ్మణులు పోయినదని చెప్పే నాల్గవ వేదంలోని మతధర్మాలను గురించి వారికి బోధించడానికే తాను దేశంగాని దేశాన్నుంచి ఇంత దూరం వచ్చాననిన్నీ నోబిలీ ప్రజలకు బోధించడం ప్రారంభించాడు. ఈ కొత్తపద్ధతి క్రైస్తవమతప్రచారము అతిచమత్కారంగా వున్నదనిన్నీ, తాను క్రైస్త

వులుగా చేయదలచిన ఈ హిందువుల మతవిశ్వాసాలలోనూ, సిద్ధాంతాలలోనూ గల గట్టిఘట్టాలనూ, లోపాలనూకూడా ఈనోబిలీ ఎంతబాగా గ్రహించాడో దీనివల్ల బాగా తెలుస్తావున్నదనీ మాక్సుమూలరుగారే వ్రాశారు.

'ఎక్సోడస్' అనే పుస్తకంలో తన ప్రచారపద్ధతినిగురించి నోబిలీగారే ఇట్లు వ్రాశారు: "హిందువుల దేవుళ్లు పనికిమాలినవైనా వాటిని దూషించకూడదు. ఆదేవుళ్లను దూషిస్తే దానివల్ల మనకు లాభంకలిగేటందుకు బదులు నష్టం కలుగుతుంది. ఒక గదిలోనుంచి చీకటిని తొలగించాలంటే చీపుళ్లు పుచ్చుకొని దులిపి కాలం వ్యర్థపరుస్తామా? ఒకదీపం వెలిగిస్తాము. చీకటి దానంతట అదే మాయమౌతుంది. స్నేహంచేత క్రైస్తవేతరుడి హృదయాన్ని ఆకర్షించాలి. అతనికి మనయందు భక్తి విశ్వాసాలు కలుగచెయ్యాలి. తరువాత అతనికి సత్యమనే దివ్వెను ఇవ్వాలి. అంతట విగ్రహారాధన మనే అంధకారము చిక్కులులేకుండా మాయమౌతుంది."

ఇంకొక ఉత్తరంలో తాను చేసే బోధను నోబిలీ వర్ణించాడు: "నాదగ్గిరకు వచ్చినవాళ్ల కందరికీ భగవంతు డొక్కడేననిన్నీ, ఆయన మూడుమూర్తులలో సాక్షాత్కారం అవుతున్నాడనిన్నీ, ఆయన అనంతు డనిన్నీ, భూమండలమును మనుష్యులను సర్వజంతువులను సృష్టించినవా డనిన్నీ, మానవులను శిక్షించేటందుకు మానవశరీరాత్మలతో ఒక దివ్యకన్యకుమారి కడుపున పుట్టినా డనిన్నీ, ఇలాగ పుట్టిన అవతారమూర్తి ఏసుక్రీస్తు అనిన్నీ, ఇతడు నిర్వికారు డనిన్నీ, మానవుల పాపముల నన్నింటినీ తాను భరించిన రక్షకు డనిన్నీ చెప్పి ఆ మతధర్మాలను బోధించేవాడు. ఈ మతధర్మాన్ని స్వీకరించేవా రెవ్వరూ తమ కులాచారాలను వదలుకోనక్కరలేదు. ఇంకొక కులంలో చేరనక్కరలేదు. తన కులాచారాలకు విరుద్ధమైన ఏపనినీ చెయ్యనక్కరలేదు. భగవంతుని సాక్షిగా ఈ పవిత్రమతధర్మము అన్నివర్ణాలకూ అర్హమైనది. బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన ప్రజలందరూ లౌకికవ్యవహారాలలో ఈదేశపు రాజైన మహానాయకుడి శాసనానికి ఎలా లోబడివుంటారో ఆధ్యాత్మికవిషయాలలో మానవులందరికీ ప్రభువైన భగవంతుని ధర్మశాసనానికి అన్నికులాలవారూ, అన్నితరగతులవారూ లోబడివుండాలి. ఈ దేశంలో పూర్వపు ఋషులు, సన్యాసులు చెప్పే ధర్మాలనే నేనుకూడా చెప్పతున్నాను. ఈ ధర్మాలు కేవలమూ అస్పృశ్యులకూ, పరంగీలకూ అర్హమైనవని ఎవరయినా అంటే వారు మహాపాతకం చేస్తున్నా రన్నమాట. అన్నికులాల మనుష్యులకూ భగవంతుడు ప్రభువుగనుక ఆయన ధర్మాన్ని అందరూ శిరసావహించాలి. ఈధర్మానికి లోబడినందువల్ల ఇంకను ఉన్నతస్థితిని చెందని ఉన్నతకులము లేదు. తన పవిత్రతను ఆవంతయైనా తగ్గకుండా ప్రపంచంలోని అన్నికులాలమీదను, వస్తువులమీదను సూర్యరశ్మి యెలా ప్రసరిస్తున్నదో, అది బ్రాహ్మణులను అపవిత్రపరచకుండా ఎలాగ తేజస్సు నిస్తున్నదో ఈ ఆధ్యాత్మికసూర్యరశ్మికూడా మనుష్యులందరికీ తన పవిత్రధర్మాన్ని, పవిత్రతేజాన్ని ప్రసాదిస్తుంది."

## ఉపన్యాసధోరణి

నోబిలీ చేసే ఉపన్యాసపద్ధతికూడా చాలా చిత్రంగానూ, దేశీయంగానూ వుండి శ్రోతల మనస్సులకూ, హృదయాలకూ బాగా నాటేట్లు వుండేది. నోబిలీ తాను స్వయంగా చక్కని పద్యాల నెన్నో రచించి వాటిని శ్రావ్యంగా చదివేవాడు. ఈదేశంలో మతధర్మాలను, పురాణాలను చెప్పేవారి పద్ధతిలో ముందుగా తాను చెప్పదలచిన మతధర్మాన్నిగురించి భావగర్భితమైన ఒక సూత్రాన్ని చెప్పి దానికి వ్యాఖ్యానం చెప్పడంలో అనేక గ్రంథాలలోనుంచి, తన స్వంతకవిత్వంలోనుంచీ శ్లోకాలూ, పద్యాలూ, కథలూ, గాథలూ వివరిస్తూ దీర్ఘమైన ఉపన్యాసం చేసేవాడు. మంచిమంచి విచక్షణజ్ఞానంతో తప్పులు వెదకడానికి నడుముకట్టుకుని కూర్చున్నవారున్న సభలలో ఈ విదేశీయు డొక సంవత్సరంలోనే దేశభాష నభ్యసించి తన పాండిత్యానికీ, భాషాజ్ఞానానికీ సభవారు ఆశ్చర్యపడేటట్లుగా ఇంత జయప్రదంగానూ, అనర్గళంగానూ ఉపన్యసించగలిగాడంటే అతడు చాలా ప్రతిభాశాలి అనకతీరదని ఒక గ్రంథకర్త వ్రాశాడు.

## భూతవైద్యం

నోబిలీగారున్నూ, ఆయనశిష్యులున్నూ ఏసు క్రీస్తుశిలువను రక్షరేకుగానూ, క్రైస్తవపూజలోని పవిత్రోదకాన్ని మంత్రతీర్థంగానూ వుపయోగించి జబ్బుపడినవారికి భూతవైద్యం చేసి కుదిర్చే తంత్రం ఒకటి ప్రారంభించారు. ౧౬౦౭ లో ఒక ఆడమనిషికిన్ని, ౧౬౦౮ లో ఒక మహమ్మదీయునికిన్ని ఇలాగ దయ్యం వదలిపోయిం దనిన్ని, పోతూవున్న భూతము నోబిలీగారి ప్రభావాన్ని ఉగ్గడించిం దనిన్ని ఫాదరీ ఉత్తరప్రత్యుత్తరాలలో వ్రాయబడియున్నది. ఒక మాటు ఈ నోబిలీ యేలాటివా డని ఒక దయ్యాన్ని ఆయనశిష్యుడు అడుగగా అతడు చాలా శక్తులు గలవాడనిన్ని, ఆయన బోధించే ధర్మాలన్నీ నిజమైన వనిన్ని దయ్యం చెప్పినదట. ఈయన తలపెట్టిన కార్యానికి మొదట విఘ్నాలు కలుగుతా యనిన్ని, మూడేళ్ళలో జయం కలుగుతుం దనిన్నీకూడా చెప్పిందట. ఇలాగ భూతవైద్యతంత్రాలు జరపడంవల్ల మధురానగరంలో ప్రజలలో నమ్మకం కుదిరి నోబిలీగారి ప్రభావాన్ని గురించి విపరీతంగా చెప్పుకోవడం ప్రారంభించారు. మధురరాజసభకుకూడా ఆయన ఖ్యాతి పాకింది. అనేకులైన ప్రభువులు ఆయనతో స్నేహం చెయ్యడం ప్రారంభించారు.

## ఫలితాలు

ఇలాగ వేషధారణ చేసి కపటనాటకమార్గం ద్వారా ఏసుక్రీస్తుసేవ చేసే పద్ధతి త్వరలోనే ఫలప్రదమైనది. ఈనోబిలీ తన జీవితవిధానంవల్ల గర్విష్ఠులైన బ్రాహ్మణుల హృదయాలలో సంచలనం పుట్టించి వారిని ఆకర్షించాడు. అందువల్ల వారే యనను చూడడానికి రావడం మాత్రమేగాక భగవంతుణ్ణి గురించి ఆయన చెప్పే సంగతులను శ్రద్ధతో వినడముకూడా ప్రారంభమైంది. అంతేకాదు. అందులో కొందరు భూమిమీద ప్రణమిల్లి ఆయనపాదధూళిని శిరస్సున ధరించేవారు. ఇంత బాగా తత్వబోధ చెయ్యగలవా డింకొకడు లేడని వేనోళ్ల పొగిడేవారు! (The Aravidu Dynasty-The Rev. H. Heras, Chap XVIII pp. 362-396.)

నోబిలీ వేసిన పథకం పారడానికి దారి ఏర్పడింది. అంతట అతడు హిందువులను బహిరంగంగా క్రైస్తవమతంలో కలపడానికి ప్రయత్నించాడు. ఒక హిందూమతగురువుతో నోబిలీ ఇరవైరోజులు రోజు కైదారుగంటల చొప్పున శాస్త్రచర్చ చేసి వాదించి ఆఖరుకు తన సిద్ధాంతాలను స్థాపించినట్లు జయభేరీ వేయించి ఆ గురువును క్రైస్తవమతంలో కలిపాడట. తనకు తెనుగుసంస్కృతములు నేర్పిన బ్రాహ్మణగురువునుకూడా మతంలో కలిపాడు. అంతట ఒకరితరవాత ఒకరిని చాలామందిని మతంలో కలపగలిగాడు. బ్రాహ్మణులు, రాజులు, రాజోద్యోగులు, శాస్త్రజ్ఞులు, నాయకులు, గొప్పకులాలవారు, సంపన్నులు అతని దగ్గిరకి వచ్చి తరణోపాయం చెప్పమని వేడుకొనేవారు. దేశంలో చాలా గొప్పవారని ప్రఖ్యాతిపొంది విజయనగరచక్రవర్తుల వుద్యోగులలో పెద్దయైన దుంబిచ్చినాయకుడుకూడా ఈయనకు శిష్యుడుకావాలని కుతూహలపడ్డాడుగాని రాజాగారికి కోపం వస్తుందని వూరుకున్నాడు. క్రైస్తవమతం అతిత్వరగా వ్యాపించింది. హిందూమతం కొద్దిరోజులలో నశిస్తుందా అని చాలామందికి తోచింది. దేశమంతా గగ్గోలుపుట్టింది. నోబిలీ చేసిన ప్రచారంవల్ల బ్రాహ్మణపురోహితుల ఆదాయం పూర్తిగా తగ్గిపోయింది. వ్రతాలు, పూజలు చేసేవా రిచ్చే దక్షిణలు తగ్గిపోయినవి. హిందూస్వాములవారికి ముడుపులుకూడా తగ్గిపోయినవి. అందువల్ల సనాతనధర్మపరులందరూ కళ్లుతెరచారు. నోబిలీ కట్టిన క్రైస్తవదేవాలయంస్థలం తనదని మధురదేవాలయం ప్రధాన అర్చకుడు తగాదా పెట్టినాడు. అంతట ఈ నోబిలీగారి క్రైస్తవ ప్రచారానికి వ్యతిరేకప్రచారం ప్రారంభమైనది. హార్మెకత్తియనే శ్రీమంతు డొకడు నోబిలీగారికి సహాయపడినందువల్ల అప్పటికి నోబిలీగారి క్రైస్తవదేవాలయానికి ఆపద తప్పింది. ఈ హార్మెకత్తి క్రైస్తవమతంలో కలియకపోయినా నోబిలీగారికి ప్రాపకుడుగా వుండేవాడు. ఇంతలో నోబిలీగారికి ఇంకొక తవాయివచ్చింది. దానివల్ల ఆయన మతప్రచారం కట్టిపెట్టవలసివచ్చింది.

## ఆశ్వాసాంతం

ఇదివరలో మధురానగరంలో క్రైస్తవమత ప్రచారకుడుగా ఉన్న ఫెర్నాండెజ్ గారికి నోబిలీ గారు అవలంబించే ప్రచారపద్ధతులు, చర్యలు క్రైస్తవ ధర్మాలకు విరుద్ధంగా వున్నట్లు తోచింది. నోబిలీగారి కొన్ని చర్యలు చాలా అసహ్యకరంగా తోచి మంద లించాడుగాని లాభం లేకపోయింది. అంతట అతడు పైయధికారులకు ఈ చర్యలన్నీ వివరించి చెప్పడంవల్ల నోబిలీగారి ప్రవర్తన బాగా లేదని పైయధికారు లన్నారు. గోవానగరంలో ఉన్న పోర్చుగీసుక్రైస్తవ మతాధికారులకు నోబిలీమీద ఈర్ష్యాభావముకూడా కలిగింది. క్రైస్తవమతంలో కలిసిన హిందువులకు తమ పూర్వపు మతాచారాలన్నీ అవలంబించవచ్చు నని నోబిలీగారు అనుజ్ఞ యిచ్చినందువల్ల క్రైస్తవమతం దురాచారాలకు పుట్టినిల్లుగా మారినదనిన్నీ, ఈమతా న్నిగురించి ప్రపంచంలో చాలా అపఖ్యాతి కలిగిన దనిన్నీ వారన్నారు. (౧) ముఖ్యంగా నోబిలీగారు హిందూస్వాములవారిలాగ 'జగద్గురువు' అనే బిరుదును తాల్చడము; (౨) తాను పరంగిని కానని చెప్పి నటించ డము; (౩) హిందువుల మూఢవిశ్వాసములను సూచించే తమ పరిభాషకు వేదాంతసూత్రములను, మాటలను ప్రయోగించడము; (౪) తనమాటలు విశ్వసించి క్రైస్తవ మతంలో కలిసిన హిందువులను పూర్వాచారం ప్రకారం వుంచుకునే జుట్టుపిలకలను వుంచుకోనివ్వ డము, జందెములు వుంచుకోనివ్వడము, ముఖముమీద గంధాక్షింతలు మొదలైన బొట్లు పెట్టుకోనివ్వడము, అనేకసందర్భాలలో స్నానాలు చెయ్యనివ్వడము, ఇంకా హిందూవర్ణాశ్రమధర్మాలయందు అనాదినుంచీ జరుగుతూ వస్తూవున్న ఆచారాలను అవలంబించ నివ్వడమూ— ఇవి క్రైస్తవమతధర్మాలకు విరుద్ధమని నిందించాడు.

పైన చెప్పిన విధంగా నోబిలీగారు ౫ సం వత్సరాలు ప్రచారంచేసి క్రైస్తవమతం వ్యాపిస్తూ వున్న స్థితిలో పైయధికారులు ఆయన చేసే ప్రచార విధానాన్ని నిషేధించారు. అతణ్ణి కొన్నాళ్లు పని మాన్పించి తరువాత తక్కిన ఫాదరీలలాగనే ప్రచారం చెయ్యమన్నారు. నోబిలీ పడిన కష్టమంతా వృథా అయింది. క్రైస్తవమతప్రచారకులు ఈ కొత్త వేషజాలు మాని పూర్వపద్ధతులతోనే ప్రవర్తించడం ప్రారంభించారు. మళ్లీ వీరిని పరంగీ లని నీచంగా చూడడం ప్రారంభమైనది. ముత్తువీరప్పనాయకుని రాజ్యకాలంలో పరిపాలన నిరంకుశంగా జరిగిం దని జెసూట్లు వ్రాశారు.

## ఉపసంహారం

ముత్తువీరప్పతరువాత మహారాజమాన్యరాజశ్రీ తిరుమలశౌరినాయనఅయ్యలుగారు మధురరాజ్యానికి రాజైనాడు. ఆయన పట్టాభిషేకము ౧౬౨౩ లో జరిగి నట్లు కనబడుతూవుంది. ఈ తిరుమలనాయకుడు విజయ నగరసామ్రాజ్యంలోనుంచి స్వతంత్రుడై పరిపాలింప సాగినాడు. దేశం శాంతంగానూ, సుభిక్షంగానూ వున్నది. ఈసరికి రోమునగరక్రైస్తవాధికారులు తన పట్ల కొంత శాంతించియుంటా రని రాబర్టో నోబిలీ గారు ఊహించి ౧౬౨౩ లో తన పాతపద్ధతిలో మళ్లీ క్రైస్తవమతప్రచారం చెయ్యడానికి పూనుకొని మధురనుంచి బైలుదేరాడు. ఇతడు మొదట తిరుచు నాపల్లి, శండమంగలము, సేలము మొదలైన ప్రాంతా లకు పోయి కొందరిని మతంలో కలిపాడు. మధురలో క్రైస్తవమతాన్ని వ్యాపింపచెయ్యడానికి బ్రాహ్మ ణులు ఆటంకాలు కలిగించడం ప్రారంభించారు. మధుర సనాతనధర్మానికి దుర్గంగా వున్నందువల్ల మెల్లిగా తిరుచునాపల్లి మొదలైన ప్రాంతాలలోనే గట్టిప్రచారం చేశాడు. అక్కడకూడా సనాతనులు వీరిని బాధించారు. అంతట మిషనరీలు అడవులలో కల్లరులనే అనాగరికుల గ్రామాలకు పోయి ప్రచారం సాగించారు. నోబిలీ ఇలాగ మొత్తంమీద నలభైరెం డేండ్లు ఈ మధురజిల్లాలో క్రైస్తవమతప్రచారం చేశాడు. అతని ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. అతని దృష్టి తగ్గిపోయి గుడ్డివాడైపోతున్నాడు. ఈ స్థితిలో కొంచెం చల్లని ప్రదేశానికి పంపితే అతనికి ఆరోగ్యం కలుగుతుందేమో నని ౧౬౪౫ ఆప్రాం తంలో అధికారు లతనిని సింహళానికి పంపించారు కాని అక్కడ విశ్రాంతి తీసుకునే బదులుగా అతడు

తన మామూలు పద్ధతిప్రకారమే కఠిననియమాలతో జీవిస్తూ మతప్రచారం చేస్తూనే వచ్చినందువల్ల ఆరోగ్యం కలగలేదు. అక్కడకూడా కొందరిని అతడు మతంలో కలిపాడు. అందువల్ల అతడు మొదటినుంచీ పనిచేస్తూవున్న ప్రదేశాలన్నింటికీ దూరంగా వుండేటట్లు చెన్నపట్నంలో మైలాపూరికి విశ్రాంతికోసం పంపించారు. అక్కడ యితడు ఒక చిన్న మట్టి యింట్లో తన శిష్యులుగా వున్న నలుగురు బ్రాహ్మణులతో కొన్నాళ్లు కాలక్షేపంచేశాడు. ఇంతలో చెన్నపట్నంలో రాజకీయపరిస్థితులు గోలకొండనవాబుల సేనాధిపతుల దండయాత్రలవల్ల అల్లకల్లోలంగా వున్నందువల్ల అధికారులు మళ్లీ అతనిని ఇంకొకచోటికి మార్చారు. ఇట్టిస్థితిలో ౧౬౫౬ లో ఈ క్రైస్తవ మతాచార్యుడు స్వర్గస్థుడైనాడు.

నోబిలీ అరవంలో వ్రాసిన తొమ్మిది గొప్ప గ్రంథాల తాళపత్రసంపుటాలు ౧౬౬౦ లో కనబడ్డవి. (Madura District Manual (1868)—J. H. Nelson, Part II Pp 116—120, 127, 160—161, 180—181).




అయ్యో, మగవారు!

# మృణ్మయపాత్రలు

= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

[వేసవికాలమునఁ బిపాసార్తులగు పథికులకు ఆతపబాధఁ బాపి తృషఁదీర్చుటకు 'చలివేంద్ర'లను స్థాపించి చల్లని పానీయముల నిచ్చుచుందురు. మహాక్లేశదాయకమగు నెడారిమార్గమున జీవపథికుఁడును బ్రయాణముచేసి గమ్యస్థానముఁ జేరవలెను. ఆ జీవపాంథున కీక్రింది వనునయవాక్యములు:—]

౧

ఓయీ పాంథ! బహుశ్రమాకులత నుష్ణోర్మిల్ వెలారింతు వే
మోయీ! తావకతీవ్రతృష్ణ కిఁక నిత్యోత్సాహసంపూర్ణసు
స్థేయబ్రహ్మపదాంబుపూరములు సంసిద్ధంబులై యున్న వే
లోయీ నిస్పృహా! రమ్ము క్రోలు మిదిగో యుత్సాహివై భక్తితోన్.

౨

నీదగు జీవితంబు కడు నీరస మిట్టి నిదాఘవేళ నీ
ఖేదము వాపి నిర్మలసుఖిత్వ మొసంగి నితాంతదివ్యస
మ్మోదము నీయఁజాలిన యమూల్యసుధామధురస్రవంతి నీ
కే దయఁజూపువాఁడ గ్రహియింపుమయా పథికా! కృతజ్ఞతన్.

౩

ప్రళయకాలోగ్రమూర్తి యా గవి వెలుంగ
జీవసస్యము వాడి కృశించిపోయెఁ
బ్రళయకాలోగ్రరూపప్రభంజనుండు
వీవఁగా నీ మనఃపద్మమే వడంకె.

౪

ఆతప మోర్వలేక మరియాదకు భంగము చూడలేక వి
ఖ్యాతసుధోపమాంబువులఁ గానఁగలేక క్షుధార్తిఁ గుందు చీ
రీతి పరిభ్రమించెదవు రిత్తమె కా భవదీయజీవితం
బాతపబాధఁ బాపుదుఁ దృషార్తిని దీర్చెద నమ్ముమీ ననున్.

౫

ఇది వనితాధరామృతనికృష్టసుఖప్రతిపాదకంబు గా
దిది కడుసుప్రసిద్ధమగు నిక్షురసోపమమాత్ర కాదు కా
దిది సురసేవ్య మల్పపరితృప్తి నొసంగు సుధాస్రవంతి కా
దిది పరమోత్తమోత్తమకవీశకవిత్వసుధాస్రవంతి యా.

౬

మును పెన్నండొ మహానుభావులు కృపామూర్తుల్ మహోత్సాహులై
మన సౌఖ్యంబె మనంబునం దిడి, జగన్మాన్యంబుగా సిద్ధినం
దిన పుణ్యాత్ములుగాన, స్వాదుకవితోన్మేషంబుతో నీసుధం
గని నిత్యంబుగ మృత్తికాఘటములన్ గ్రంథంబులం గూర్పఁగాన్.

౭

నాఁటికి నేఁటికిన్ మఱి వినాశము లే దిఁక స్వస్వరూప మే
నాఁటికి మాసిపోదు రుచి నవ్యసుఖస్ఫురణంబు తోఁచు నే
నాఁటికినైన నీవు కడు నమ్రుఁడవై మనసారఁ గ్రోలి స
త్పాటవ మంది దిగ్విజయభాగ్యము నందుము జీవయాత్రలోన్

౮

స్వాదుకవితామృతంబు సంపత్ప్రదంబు
భవ్యమృణ్మయపాత్రసంబద్ధమగుట
పాంథ! నీభాగ్య మెన్న నెవ్వరి తరంబు
గ్రోలు మనసారఁ దనుయాత్ర లీల యగును.



# కవిబ్రహ్మ కవితారమ్యత

= శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి =  

"తింటే గారెలే తినవలె, వింటే భారతమే వినవలె" అన్న నానుడి తెలుఁగునాటదిగాని వ్యాసభారతముది గాదని భావింతును. తులసీదాసు రామాయణమున, పోతన భాగవతమున, కవిత్రయము వారు భారతమున అనువాదములో 'విశిష్యతే' అని పేరుమోసిరి.

వేదవ్యాసుల కవితామహిమకు లోప మారోపించుట కాదు గాని భారతమును తెలుఁగు-సంస్కృతములు రెంటిని ఇరుగేలఁబట్టి అరసినచో పాత్రౌచిత్యము - స్వభావోక్తి - ఉక్తివైచిత్రి - కవితాకళ మున్నగు నెన్నికగన్న కొన్నింట తెలుఁగు భారతమే మిన్న యని యన్నవారు పెక్కురు కలరు. తెనుఁగు మీఁది యభిమానమునఁ జేసి పలిసిన 'అర్థవాదమే' యిది యందురేమో! ఏదీ! వాల్మీకిని తెలుఁగునాట ఈనాటివరకు మఱపించిన తెలుఁగు కవి యెక్కడఁ జిక్కెనో! కాళిదాసుని కవితావైభవము కాదన్న సరణి తెలుఁగులోఁ గలదని యేదీ చూపుఁడు! పోతన్న తెనుఁగున భక్తిరసమును పోతవోసె నన్నచో తెలుఁగు భాగవతమునకు వెలుఁగు కలుగలేదా! అందులకే కొందఱు ఈతీరుగ తీర్పొసఁగిరి: "వ్యాసభారతము అమూల్యమగు బంగారుముద్ద. అందులో అక్కఱంగల ముక్కలు ఏఱి చిత్రవిచిత్రములగు 'నగిషీలు' నాజూకుగ సంతరించి వలసిన నాణెములుగ నగలుగ తెలుఁగులకు తెలుఁగుభారతమును కవిత్రయమువారు ప్రసాదించియిచ్చిరి."

కావుటను కవిత్రయము అగ్నిత్రయము, లోకత్రయము, గుణత్రయము, మునిత్రయమువోలెఁ దెలుఁగునాట ఒక రూఢికెక్కినది. సర్వకాలము, సార్వజనీనము, సర్వాంగపరిపుష్టము కావుటను కవిత్రయము వారి కవిత నిత్యనూత్నము, నిరంతరవికాసభాసురము నయి వెలయుచున్నది.

ఒకానొకరు అన్నట్లు కవిత్రయమువారి కవితా వైఖరికి కావ్యార్థసూచన ఆదిపర్వమున ఆదిపద్యములోనే ప్రోదిసేయఁబడినది.

'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో' — ఇత్యాది.

అందు వాణీపతి బ్రహ్మ; ఇందు తిక్కన కవిబ్రహ్మ. ఇతని కవితాప్రపంచము అనంతము. ఇతని 'వాణికి' తెలుఁగుదనము, మాధుర్యము దక్కినవి. వాణికి బ్రహ్మముఖము నెలవఁట. కవిబ్రహ్మ 'భారత వాణికి' విరాటపర్వప్రారంభము ముఖము.

వేదాలజోలికిఁ బోరానివారికి — సంస్కృతి చక్కఁగా అంటనివారికి ఉపనిషత్సారము- వేదాంత భండారము 'ఇది' యని భారతమును పూర్వులు ప్రపంచమునకుఁ జూపిరఁట. వేదములు నాలుగింటి వెనుక భారతము పంచమవేద మనుటలో ఇదియే పరమార్థము. ఆదిమునియగు వేదవ్యాసుఁడు చేసిన వేదమువంటి విశ్వజనీనమగు భారతమును తెలుఁగులోఁ దెచ్చుటకు అప్పటి దేశ్యపరిస్థితులు, రాజకీయములు, మతప్రవృత్తి ప్రధానకారణములు అయియుండును. నిర్వచనోత్తర రామాయణమును వ్రాసిన తిక్కన 'తిక్కశర్మ'యై, 'సోమయాజి' యై, భవ్యపురుషార్థతరువునకు భారతము పక్వఫలముగా భావించి అద్దానిఁ దెలుఁగుబాసలో వినిర్మించి వైదికమార్గనిష్ఠమగు వర్తనమే నిర్వహించినాఁడు. గీతాశాస్త్రమును దెనుఁగునఁ దెచ్చుట 'సోమయాజు'లకు రుచింపలేదనుటకు వైదికనిష్ఠయే హేతువు కావచ్చును. అయితే కేవల వైదికధోరణినే అనువదింపక, తిక్కన ముక్కడి మతములను లెక్కఁజేక 'ఉభయకవిమైత్రి' అందుకొన్నట్లు 'విష్ణురూపాయ నమశ్శివాయ' అనుచు విశిష్టమార్గమున కృషిపడినాఁడు. సకలభువన రక్షణప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్యగర్భపద్మ

వాణీపతులను ఆదికవి నన్నయభట్టారకులు స్తుతించి యుండ, హరిహరరూపమగు పరతత్త్వమును సోమయాజులు కొలిచెను. భక్తిప్రపత్తుల మాట యటుంచి కేవలరణరంగగాథలకు మురిసిపోయి "అస్మదీయవంశమునఁ బ్రసిద్ధులైన పాండవేయుల చరిత్రము నాకు వినంగ నభీష్ట"మని చాళుక్యమహీపతి యానతీయ నాతని పేరట నన్నపార్యుఁడు తెలుఁగుసేఁత నుపక్రమించెను. రాజుల కొలువులో రోజులు కడపువాఁడె అయ్యు తాను వ్రాయు ప్రబంధమండలికి అధినాథుఁడగు పురుషుం డెవ్వండొకో యని కవిబ్రహ్మ ఆరాటపడెను. నిదురలో వచ్చి జనకుఁడు వాత్సల్యము చూపుట-కర్తవ్య మిద్దిగదా యని కఱపుట తెలుఁగున కిది యొక కొంగ్రొత్త. "ఈదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం"బని వస్త్వంతములు ముచ్చటించుటయు కవిబ్రహ్మ జీవితమునకు ఘనత కూర్చినది.

మహితాత్ముఁడగు నన్నయభట్టును ఆంధ్రకవిత్వ విశారదుం డని-విద్యాదయితుం డని సోమయాజులు స్తుతించినను తాను త్రొక్కిన త్రోవకుఁ దెలుఁగుఁదనము మఱువక విశిష్టతను గూర్చెను. నన్నపార్యుని కవితలో ఇతరులు అక్షరరమ్యత నాదరించి రన్న గీర్వాణవాణికి మెచ్చు వచ్చినదని భావము. ఆనాఁటి కాత్రోవయే అమితమగు హితము నాపాదింపవచ్చును. కాలము గడువను అభిరుచులు మారి తెలుఁగుకైతకు ఒక విశిష్టత యేర్పడి పలువురి ప్రోల వన్నెచిన్నెలు కనుపించఁదొడఁగెను. కేవలము గీర్వాణము బలసి తెలుఁగుబాసను 'శూద్రము'గా భావించి ఉప్పు-పప్పులుకూడ 'లవణా'దికముగఁ బలికినఁగాని తరింపమని తలతిక్కలు ముదిరిన మానుసులకు 'తెలుఁగు మీఁగుటి'ను జూపిన మహాకవి తిక్కనసోమయాజి. ఆయన ఉపక్రమించిన "కరుణారసము పొంగి తొరఁగెడు చాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ,...గుఱియైన చెలువున మెఱసిన లోకరక్షణ మన గరళంబు ఛాయ దోఁప...ఎలమి సన్నిధిచేసె సర్వేశ్వరుండు"-అను సర్వేశ్వరస్తుతిలోనే కవితామృతము అవిచ్ఛిన్నముగ జాలువాఱుచున్నది.

ఒక్క 'శాంతి'లోమాట అటుండ, తిక్కన పదునాలుగు కృతులందును తిక్కనమనీషి ఒక్కొక్క 'పాత్ర' తానే వహించి రసస్ఫోరకములగు ఘట్టములను సమకూర్చుచు భారతగాథను నాటకమాడించుచు నడచుచుండును. అందలి పాత్రలు తెలుఁగునేలలో మెలఁగినవే అన్నంత 'మైకము' మనకుఁగలిగించు కవితారమ్యత కవిబ్రహ్మసొమ్ము. కవితావైభవము ప్రస్ఫుటము కావలెనన్న-లోకమున ఆకవి కైకొన్న 'కావ్యవస్తువు'కూడ మూఁడువంతులమువ్వీసము ఉపకరించుట సాజము. నన్నయభట్టారకుని మూఁడు కృతులలో ఈ యంశము స్ఫురించుచుండును. సోమయాజుల కవితకు ఇతివృత్తపు ఇంపుసొంపులు పొంపిరివోచేసినవి. అదే ఆయనగొప్ప 'అదృష్టము'.

భారతగాథలో మొత్తము రాజకీయవేత్తగ,చిత్రవిచిత్రప్రకృతిగ కృష్ణునిఁ జిత్రించుటలో అనువగు ఘట్టము ఉద్యోగపర్వము కాక మఱేది? మనుమసిద్ధి తేని కొలువులో మెలఁగనేర్చిన తిక్కనమనీషి తానే సంధికోసమని పాండవుల పక్షమున కౌరవులపాలి కరుదెంచెనా యన్నట్లు ప్రత్యక్షరము ప్రతిబింబించు నః 'మెత్తనిపులి' యగు ధర్మరాజు కార్యనిర్వాహకమున ఘనుఁడు కావుటను రాచమాటలలో ఆరితేరిన కృష్ణునకే 'ఓనమాలు' ఉపదేశించుటలో మొనగాఁడు అయినట్లు—

"మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు నెమ్మి యెఱుఁగు
దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వాక్యమ్ముల పద్ధతి
నెఱుఁగుదు పో మ్మెవ్వఁడ నీకు నేను బుద్ధులు సెప్పన్."

అను సోమయాజిపలుకులలో స్ఫురించుచుండును. 'తత్ర రమ్యా శకుంతలా'యన్నట్లు పదునెనిమిదిపర్వములలో విరాటోద్యోగములకుఁ గల ఇతివృత్తప్రాభవము తిక్కనచేతిలో మిక్కిలి మెఱుఁగెక్కినది. ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ కవిత్వదీక్షా విధి కలిగి తిక్కన గద్యపద్యములను రచించినాఁ డనుటలో తెలుఁగుఁదనమును వలచిన ఆంధ్రు లనికాని కేవలము తెలుఁగుదేశములోఁ బుట్టిన ఆంధ్రు లని కాదు భావము.

"గరగరగాఁ గూడుఁ గూరలు-గోడిగజాతులు-కొదమ వెంటులు-క్రొత్తముట్టున కియ్యి కొలుపు వెర

వులు-తెవులగొంటులనైనఁ దీర్పుటలు—కడుపుచేర్పుటలు-పసికెఁజాలఁగూర్చుట - కాళ్లయొప్పిదమాడుకట్టు-తలుగుల పొదము—పెయ్యెలదామెనలు - నును సెలగోలలు - ఆఁబోతుపంచితంబులు- పైగాలి వీచుట- గొడ్డునకైనఁ జూలు నిలుచుట-ఊంగిడి - అదురు-త్రిక్కులు- కడుపుకూడు పెట్టి కట్టఁ జీరయిచ్చి సాకుట - నేల నాలుగు చెఱఁగులు - వీఁపున మండిపెట్టుట-కరగి నేరిమి వాటించి కరువుగట్టిపోయుట- ఆఁడుఁబుట్టువులతోడఁ బుట్టుట- అచ్చునఁ బెట్టుట-ఉప్పులుచేయుట - మోము పుల్లగిలుట- బ్రదుకుచవి- వాలుగసోగలు - వాలికతూపులు- చిట్టుముట్టాడుట - చుబ్బనమాఱలు - వెంబాట ముట్టుపాటు - సెవ్వగలు - పలుచనిరొంపులు - పిసికి పిండలు-పిడిచికొనుట- గండరించుట- గుజగుజలాడుట- పలుపోకలఁబోవుట - వట్టొడ్డుట - ఆఁడుకూయలు - ఆలకూయలు- రాచమాట - పురపురఁబొక్కుట- ఆఁకటిప్రొద్దు-నలుగునూరుట- రిత్తకురిత్త-మంచిమగండు-చాపకట్టు- పిండిలివండు- ఏలినవాఁడు- వంటలవాఁడు- బొమ్మగొత్తికలు - చిచ్చఱపిడుగు- చేయాఁతనీఁదుట- తీఁగదిగిచినగతి - బాడిసనఱకినభంగి - సాఁబాలుగా వ్రయ్యలు- వేల్పువచ్చినయట్లు (గణాచారము)- గజిబిజియగునట్లు - చిందఱవందఱ - అఱవఱలు -వట్టిపెట్టుట- పచ్చడీగలపంగ-కాలు తక్కువవారలు - కౌరవసేన యేడ - ఇదియొక్క ప్రొద్దు కీడున నయ్యెంగాని - పోయిరావలయు మాకు-తలయంపి దెస"—

ఇత్యాదులు లక్షోపలక్షలు తెలుఁగుపలుకులు-జాతీయములు తిక్కన్నవి తెలుఁగుడెందములకు విందులు కుడుపుచుండును.

నెల్లూరు మండలమునఁ, గొంతకుఁ గొంత గుంటూరు ప్రాంతమున వ్యవహారములో 'వాడు చేయటానికి రాలేదు, చెప్పడానికి వొప్పుకోడు' అను మాటలలో 'చేసేదానికి - చెప్పేదానికి' అను ధోరణి కద్దు. ఇదే తిక్కన్న తన ప్రబంధములో బంధించి చూపినాఁడు. మచ్చునకు:—

'ఒంటితిరుగుదాని కోర్వఁడు'
'ఏగెడుదానికి'
'వచ్చినదానికిం గలం బెయ్యది'
'ముట్టెడుదానికి'
'అయ్యెడుదానికి'

ఇట్టివి వ్యావహారికపు సొంపులు ఈ రచనలో అనంతములు.

అన్వయక్లిష్టత దరికిరానీయక పద్యరచన 'గద్యము'గా నడపించిన ఘట్టములు సంస్కృతములో కాళిదాసు వోలెఁ దెలుఁగున తిక్కన్నకే కలవు. "అకట దుశ్శాసనుఁడు లోనైనవారు సమసిన చందంబును బంధుసహితంబుగఁ గర్ణుని గీటడఁచిన విధంబునుం జూడఁడొకో"—ఇది సోమయాజుల కలమున మెలఁగిన కవితాపాకమున కెక్కిన కందము.

పౌరాణికుల 'మాటలవిసురులకును' నిరంతరము అనుకూలమయి ప్రాఁతదన మను మాటయే గానరాక పద్యమే గాక 'గద్యము' కూడ వింతదనము లీనుచుండుట తిక్కన్న ఒక్కనికే చెల్లును. యుద్ధఘట్టమే మఱియొకరి కవనమైనచో 'కొట్టెను- చంపెను- చచ్చెను' అని పిండితార్థము తెలుచు విసువు కలిగించుట యెఱుఁగుదుము. తిక్కన యుద్ధ ఘట్టములో అంపపోటరుల వాడి తూపుల వేడిరుచులే గాక నడుమనడుమ కర్ణాదుల మాటల పోటులు సైతము చవులు గొలుపుచుండును. యుద్ధరంగమునఁ గథావిధానమును బరువులెత్తింపక, ఆచియాచి తూచి తూచి ప్రతివ్యక్తికి అయ్యాది ఒకానొక తలంపును ఒసంగునట్లు తిక్కన మనీషి చిత్రించును. అభిమన్యువధానంతరము 'గొంతి- సుభద్రల' యేడ్పులుగాని, కౌరవుల యిల్లాండ్రు పతివిహీనలయి అగతికలయి దురపిల్లినఘట్టములుగాని ఆ పలుకులు అచ్చముగ స్త్రీప్రకృతినుండియే వెలువడెనా యన్నట్లు విస్మయము గొలుపునంత స్వాభావిక సౌందర్యము మూపట్టుచుండును.

ఆయన వ్రాసిన కవితాదీక్షావిధిలో ఇది యొక లవలేశపు మచ్చుతునుక. వేదాంత బోధలోఁగాని, ఇతివృత్తమును అంతర్గర్భితముగఁ జేసికొన్న సూర్యోదయాది వర్ణనా ఘట్టములలోఁ గాని, కవితాపరిపాకమునఁగాని, శాస్త్రమువోలె శాసించు సరణిలోఁగాని, ఐతిహాసికుల కింపునింపు భావపరంపరలలోఁగాని, లాక్షణికులు మన్నించు సర్వలక్షణ పక్షమునఁగాని ఇవి యిట్టివని తిక్కన్న త్రోవలు వ్రేలెత్తి చూపవలెనన్న—అది యొక మహాకావ్యము వ్రాసిన గ్రంథమే యగును. ఇది దిఙ్మాత్రమని భావించి ఒక్కమాట మాత్రము విన్నవింతును.

తిక్కన సోమయాజులు-కాళిదాసునకు నకలు.
నన్నయభట్టారకులు—భవభూతికి ప్రతినిధి.

# 'సిస్టర్' అంటే సోదరికాదూ?

[ కథానిక ]

= శ్రీ కవికొండల వెంకటరావు =

'టాక్సీ'-దాన్నే 'ప్లెజర్ కార్' అని మామూలుగా అంటారు-నలుగు రైదుగురు కూర్చునే వైశాల్యం గలదిగా వుంటుంది-అది వచ్చి డాక్టర్ అభినవ మోహన్ గుమ్మంలో గమ్మున ఆగింది. అందులో వెనుక సీటుమీద ఓవారకు ఓసుందరి కూర్చునివుంది. అభినవ మోహన్ యొక్క కాంపౌండరు తన డాక్టర్ గారి 'ఓవర్ సీస్' తోలుపెట్టె, ఇన్‌లాండు హోల్డాల్, ఫ్లాస్కు, కూజా ఇలాంటివన్నీ ఆసుందరిప్రక్క కొన్నీ, ముందు పీఠని కొన్నీ-ఇంటిలోనుంచి తెచ్చి-పొందిగ్గా అమర్చాడు.

అయిదునిమిషాలు అంతా నిశ్శబ్దమయంగా వుండిపోయింది; ప్రకృతీ-పరమాత్మ-సమస్తప్రపంచమూను.

అంతట 'టాక్సీ'లోని సుందరి తన రిస్టుకేసి చూచుకుంటూ "అప్పుడే ఆరైంది. మెయిల్ ఆరుంబావుకు వస్తుంది. డాక్టర్ ! హరీ అప్!" అని కేకేసింది. ఆదాకా చావడిలో టేబిలుమీద పడివున్న హేటును నెత్తిమీద పెట్టుకుంటూ ఆలా ఎదరకు చిరునవ్వు వెనక్కు కన్నీటిచుక్క అనేలా తన రెండుకళ్లూ పంచి ఇంటిగుమ్మం మెట్లు దిగి—హేట్ కారు లోపలి సుందరి కందిస్తూ తాను డ్రైవరుండే సీటులో ఆసీనుడై, కారుకు సాగుదలగొల్పి, వేగ మెంత ఇవ్వ వచ్చునో అంత వేగం రస్తామీద పూరాగా ఇచ్చుకుంటూ తన గృహలక్ష్మి కళ్లనుండి తిరోహితు డైనాడు అభినవమోహన్ !

* లోగడ భారతిలో ఈ శీర్షికను అప్పటప్పట ఆరున్నొకటి ముద్రితములైనాయి.

అభినవమోహన్ గృహలక్ష్మిపేరు "సౌభాగ్యవతి చందనచర్చ." సౌభాగ్యవతి అన్నది ఆమెకు తల్లిదండ్రులు నామకరణ మహోత్సవంనాడే పేరుతో కలిపి ఏకంగా వ్రాసేశారు.

భర్త తన చూపులకు దూరమైనకొద్దీ దీర్ఘతర దీర్ఘతరములైన కన్నీటిధారలు పయటమీదకు పడనిచ్చుకుంటూ, తన చూపులకు అంతా అయోమయంగా తోచేలా మనస్సును వదిలేసి, కాంపౌండరుతో "మన కుత్తరం వారినుండి వారంవారం తప్పకుండా వస్తుందనుకుంటాను." అంది. కాంపౌండరు "మనకు వచ్చినా రాకపోయినా ఆమెకు వస్తుందమ్మ!" అన్నాడు.

"ఆమె ?"

కాంపౌండరు—"ఆమే, హాస్పిటాల్ నర్సు!"

చందనచర్చ—"నర్సంటే?"

కాంపౌండరు— "నర్సు అంటే నర్సే-ఏమని చెప్పను? నేను మన హానరరీ డాక్టరుగారికి నాట్ పెయిడ్ కాంపౌండర్ని ఏలాగయ్యానో ఆమె గవర్నమెంటుహాస్పిటాలుకు అలా పెయిడ్‌నర్సు అయింది తల్లీ !" అన్నాడు. ఆనిమిషమప్పుడు చందనచర్చ ఆ కాంపౌండరు గావించిన నిర్వచనం ఔను అనక, కాదు అనక, అందలి అధిక్షేపం ఉల్లికుట్టు తనకు తెలిసినట్టూ కనపడక, తెలియనట్టూ కనపడక "ఆలా అయితే మధ్య మధ్య ఆమెను కనుక్కుంటూవుండు అయ్యగారి యోగక్షేమాన్ని గురించి. కనుక్కుని నాకు చెబుతూవుండు. చాలా ఖరీదైన చీర కట్టిందే ఆమె?" అంది. "ఆమె

కేం తల్లీ! నెలకు డెబ్బై రూపాయలు జీతం! పిల్లా జెల్లా? మగడా మగపురుగా?—వచ్చినజీతం వాళ్లలా చీరలమీద గోరలమీద, గాజులమీద జాజులమీద పెట్టి—" చందనచర్చ "మతి చదవక్కఅలేదు! వాలకమే తెలుస్తూంది! నీవు వెళ్లు" అంది.

ఆవెంటనే కాంపౌండరు యజమానురాలినుండి సెలవుతీసికొని నిష్క్రమించాడు. ఆమె—ఆయిల్లాలు చావడిలోని స్విచ్ ఆన్ చేసి విద్యుద్దీపపు వెలుగులో భర్తకుర్చీమీద కూర్చున్నదై ఆలా టేబిల్ మీదకు తలవంచుకొని ఏదో ఊహావ్యథను పడిపోయింది; పది నిమిషాలుగా గడియారపుముల్లు తిరిగి అరగంట కొట్టినా ఆమె తలెత్తి పీథికంకకుగాని, పడమటింటి వెంపుగ్గాని చూడలేదు.

చందనచర్చతల్లి తాయారమ్మ లోపట్నుంచి వచ్చి స్విచ్ ఆఫ్ చేసి పీథికలుపు గెడవేసి కూతుర్ని వంటింటి వెలుగు సాహాయ్యాన్నే నవరించినట్లు నవరిస్తూ, "ఇంతలోకే ఇంత ఇలా అయితే ఏలాగనే అమ్మా! ఈ పైని నెలనెలా తెచ్చే వెయ్యి రూపాయలూ ఎవరివళ్లో పోస్తాడే? నీవళ్లోనే పోస్తాడు! ఈ వళ్లోనే పోస్తాడు! రా తల్లీ! నడవలోకి వచ్చి కూర్చో!" అంది. కూతురు లేస్తూ "నా కాయన మంగళసూత్రం కట్టినప్పుడు ఆయన నెలకు వెయ్యి రూపాయలు తీసుగొచ్చి నావొళ్లో పోయాలని నీవు మాట్లాడుకున్నావా? అని అడిగింది. తాయారమ్మ "మాట్లాడుకోవడ మేమిటి? యుద్ధం వచ్చిపడ్డట్టే ఈ ఉద్యోగాలూ వచ్చి పడ్డాయి. ఉద్యోగాల్తో పాటు పెద్దజీతాలూ వచ్చిపడుతున్నాయి. మాట్లాడుకోవడం ఏమిటి నీమొహం! మాట్లాడుకుంటేమాత్రం డబ్బన్నది వచ్చిపడుతుందే? పిచ్చిదానా! ఎన్నాళ్లిక్కడ ఆడిపుండు పిండి ఊడిపుండు కోసి సంపాదించను నెలకు వెయ్యిరూపాయలుకీనన్న డిగితే నా అల్లుడు మంచిపని చేశాడని చెప్తాను." అంది. చందనచర్చ "పుండు పిండడమేమిటి, కురుపుకోయ్యడ మేమిటే-పాడుమాటలు" అంది.

"డాక్టర్లు చేసే పని చెప్పాను."

"డాక్టర్లు చేసేది సేవ!"

"ఆ సేవే ఇప్పుడు దర్జాగా చేస్తారు."

"ఎక్కడ చేస్తారంటావ్?"

"అది నాకు మాత్రం తెలుసా?"

"తెలియనప్పుడు అధికప్రసంగం కట్టిపెట్టు! యుద్ధభూమిలో చెయ్యాలట సేవ! బాంబుల వర్షం పైనుండి కురుస్తూవుంటే కిందను సోల్జర్లకు సూదిమందులు గ్రుచ్చుతూవుండాలిట నీ అల్లుడు!"

"అఁఅఁ! అంత అన్యాయం వుంటుందా? అంత అపకారం జరుగుతుందా?" అంటూ తాయారమ్మ బిగ్గరగా బొబ్బ పెట్టింది.

ఆపాళంగా కూతురు తన తల్లి నోరు నొక్కి—"కేకలుపెట్టి గోల చెయ్యకు— మన కేమీ తెలియదు" అంది.

"మనకు తెలియకపోతే కాంపౌండరుకూ తెలియదూ?"

"కాంపౌండరుకూ తెలియదు."

"మరెవరికి తెలుస్తుంది?"

"ఆకార్లో కూర్చునివుంది చూశావు! ఆ నర్సుకు గానీ తెలియాలి."

"అవితే రేపు ఆమెనే కనుక్కుంటాను ఈ ఉద్యోగం యొక్క అనుపాను.—అమ్మయ్యో! పైని బాంబులవర్షం కురుస్తూవుంటే కింద సోల్జర్లకు సూదులు పొడుస్తూ వాళ్లతోపాటు పీఠ్లూ పరంపడించటమే! ఆలాంటి సంగతి మొదట్లో నీ మొగుడు చెప్పివుంటే కాళ్లమీద పడి మానిపించివుండకపోదున్నా దాన్నా?—రేపు నర్సిచే టెలిగ్రాం ఇప్పించి వెనక్కి రప్పించే సూత్రం గావిస్తాను.— ఈవేళకు వెంకటేశ్వరుడికి మొక్కుకో" అంటూ తాయారమ్మ తన కూతుర్ని ఆలాఆలా వంటింట్లోకి కంచంముందుకు నడిపించుకుని వెళ్లి నాలుగు మెతుకులు కెక్కరించేలా చేసి నిగుర బుచ్చింది. ఆరాత్రి ఏలాగో తెల్లారింది.

కాని మర్నాడు కాంపౌండర్ని వాకబు చేస్తే—"ఆనర్సుకు 'పట్నం' బదిలీ అయిపోయింది" అని తాయారమ్మకు తెలియవచ్చింది. —తాయారమ్మకు

గాని, ఆమె కూతురికి గాని మరేమీ తట్టనూ లేదు, తెలుపుదుగానూ లేదు.

* * *

ఇక్కడ-పాఠకులు—ఇది కథలో ఒక లెక్చరు అనుకున్నా, లేక కథకు సంబంధించని నాలుగుముక్కలనుకున్నా సరే- కొంచెం విడబడి ఎదో వెళ్లబుచ్చదలచుకున్నాను- వినండి- మనలో మగవాళ్లు అని అనుకొనే మగవాళ్లకు గాని, ఆడవాళ్లు అని అనుకొనే ఆడవాళ్లకు గాని ఏవొక్క సంగతి, ఏవొక్క వుద్యోగంయొక్క సరియైన నిర్వహణము, సరియైనజవాబుదారీ తెలియదు అనే నావూహ. మరిన్నీ మనకు ఎన్ని కళ్లు వున్నా ఇంతే! ఎందుచేతా అంటే తగిన పరిజ్ఞానం ఏదీ మనకు? మగవాళ్లకూ లేదు, ఆడవాళ్లకూ లేదు. ఎదో నెల అయ్యేసరికి ఇన్నిరూపాయలు మగడు తెస్తున్నాడని పెళ్లానికి బులుపు; పెళ్లాం ఎదో వేపుడుకూర వేయింపించి యింత వణ్ణం విస్తట్లోకి వడ్డింపిస్తావుందని మగనికి మహోత్సాహం - ఆరెండూ తప్పిస్తే వాళ్లవాళ్ల నిర్వాహకాలు ఏమిటవి? అన్యోన్యం అర్థం చేసికొనేవి ఏమున్నాయో చూపించండి! ఎంతమంది వుద్యోగస్థుల భార్యలు తమభర్తలు వుద్యోగపుగద్దెమీదున్నపుడు చూచినవారున్నారు? వారెలాంటి దిరిసులో వుంటారో, ఏలా కొసర బిసర మాట్లాడుకుంటూ వుంటారో, ఎలాంటి హాయలు పోతారో, ఎంతెంత హాములు కొపరుస్తూ ఊరకలేస్తారో ఇవన్నీ కనుగొన్న సహచరిణులు ఎంతమంది వున్నారు? అణాపైసలు సమేతంగా భర్తజీతం భార్య ఎలా ఆకర్షించుకు తీసికొనివుండొచ్చును గాని, వాని పని ఈమె అర్థంచేసికొన్నది వుందా? అలాగ్గానే స్త్రీమానసం, స్త్రీయొక్క కృషి వెయ్యేళ్లు తల్లక్రిందులుపడ్డా మగవాని కర్థంగాబోని అడుగు మెట్టున మన నాగరికత నేడుంది అని నాఅభిప్రాయం. ఇతడు తాగ్రోడ్డుమీద గుఱ్ఱమెక్కి టకటకా రైడ్ చేస్తూవుంటే ఆమె మేడమీద ఎంతెంత ఎత్తు ఊహాసౌధాలు కట్టుకుంటూవుంటుందో ఎవడి కెఱుక?

ఈ అభిప్రాయాలూ, ఈవుపన్యాసాలూ ఇలా వుంటూవుండగానే 'విసూవియస్' అగ్నిపర్వతం మూడు సార్లు అప్పుడే బద్దలై 'లావా' వెళ్లగ్రక్కింది. ప్రపంచ యుద్ధం ఒకసారి చెలరేగి, ఆగి, మళ్లీ భేరీ మ్రోగిస్తూ వుంది. క్వెట్టాభూకంపం, బీహారుభూకంపం, టర్కీభూకంపం - వీటితో ఆదిశేషుని వేయితలలో - రెండు బుజాలో - కాయలుకాసిపోయినాయి. మరి కథలోని 'చందనచర్చ'కు కొత్తరకపు మలేరియా జ్వరం ఏడాదిలో ఇరవై సార్లు రాకతప్పింది కాదు. ఆవ్యాధి ఆమెను ఊపి ఊచముట్టుగా పీల్చి పిప్పిచేసి తుదకు ఊపిరితిత్తుల్ని తప్పచేసి 'ఎందుకూ పనికిరాని ఆడది ఈమె' అని నలుగురూ అనుకొనేలా కనబఱచి విడిచిపెట్టింది. అందఱూ "ఎటువంటి చందనచర్చ ఏలా అయిపోయింది అంటే ఏలాఅయిపోయింది" అని అనుకోవడమే. అవన్నీ లోకప్రళయాలుకాబట్టి వార్తా పత్రికల్లో ప్రకటింపబడ్డాయి. ఈమెవ్యాధి వ్యక్తిగత ప్రళయం అవడంచేత నేను మిమ్మల్ని ప్రత్యేకతః విన మనవలసివచ్చింది.

ఇంతకుముం దెప్పుడూ మీ కామెఅందం వర్ణించలే దనుకుంటాను. మిక్కిలీ అందమైన జవరాలు. ఆవిడ ఫోటోతీయించుకున్న సమయమప్పుడూ దాదాకా ఏఫొటోగ్రాఫరుచేతా ఎన్నడూ 'రెడీ' అని అనిపించుకెరుగదు. ఏ 'సిట్టింగు'కుముందూ సవరించుకెరుగదు. మరెప్పు డెవర్ని ఏమిటంటే ఏంకార్యం?

తల్లి తాయారమ్మ కేమీ పాలుపోక 'పట్నం'లో 'బంగారుహాస్పిటాల్'కు— దాన్నే ఇంగ్లీషులో 'Golden Hospital' అంటారు—తీసుకువెళ్లి గొప్ప వెజ్జుచే వైద్యంచేయిస్తే మెఱుగని, 'ఎక్సరే' పరీక్ష గావింపిస్తే మంచిదని వీరి సలహామీదా, వారి సలహా మీదా వోనిర్ధారణకొచ్చి ప్రయాణంకట్టింది. ఎట్టకేలకు 'పట్నం' చేరుకున్నారు తల్లీకూతుళ్లు.

'పట్నం' అంటే చెన్నపట్నం అని అనుకునేరు కనుక. 'పట్నం' అంటే కాశీపట్నం అని అనుకునేరుకనుక. అయినా ఆలోచించండి!—అంటే వింటే బెంగుళూరును పోలిది అని అనవచ్చునేమో. బెంగుళూరు పద్ధెనిమిది క్రాసులు, ఓ సంపెంగరోడ్డు, ఓ మర్గోసారోడ్డు గల పట్నమటగా? ఈపట్నానకూ పద్ధెనిమిది క్రాసులూ, రెండు రోడ్లూ వున్నాయి

తేడా - రోడ్ల పేర్లల్లో కించిత్తూ, ఆకారంలో క్వచిత్తూ. దీని రోడ్లు రెండూ అర్ధచంద్రాకారపు వలయ రేఖలుగా పట్నపు పొలిమేరమ్మ రేటే రూపుదాల్చి కౌగిలింతవాటంగా ఏకమైయుంటాయి. ఆవలయం లోనే పద్ధెనిమిది క్రాసులూను. మఱెన్నీ పార్కులు చెప్పలేనన్ని - కేళాకేళీలు వల్లమాల్నన్నీ.! వాటి ఎగుడుపాటులు, పొగ క్రంగులు, అచ్చటి పైలాపచ్చీసు జనం అన్యోన్యం సుఖానుభూతిని గొల్పుకునే వేళాకోళాలకు ఉర్జీలా అన్నట్టు కాపడతాయి.

ఈలా పార్కులు, కేళాకూళీలు, హేఫ్ హేఫ్ కలిసిన ఏక్ రింగురోడ్డు, పద్ధెనిమిది నిండు అడ్డరోడ్లూ వున్న ఆ మహాపట్నంలో మన 'హాస్పిటాల్' అమృతసర్ 'గోల్డెన్ టెంపిల్' లాంటి విశేషణం వహించడమే కాకుండా పవిత్రత కల్గి వుండడంకూడా చెప్పుకో తగ్గ విశేషం!

తెల్లవారుగట్ల అయిదుగంటల కోగంట మోగుతుంది. బిగ్ బెన్ ఎలార్మ్ కాదు. గుండెల్లోంచి ఊలకొడుతూ పైకవుతూన్నట్టుగా అవుతుంది ఆధ్వని గణగణమంటా!—ఎక్కడున్న దాదులు, వైద్యులు, స్వీపర్లు, గేట్ కీపర్లు, రోగచికిత్సకూ, శస్త్రచికిత్సకూ తయారయ్యే 'పేషంట్సూ' అందఱూ మేలుకొని కల్యకృత్యాలు దీర్చుకొని కాఫీ ముసై ్నవి సేవించి, వలసిన దిరీసులు ధరించుకు ఎనిమిది అయ్యేసరికి హాస్పిటాల్ ఆవరణలో కలకల్లాడుతూ కనిపిస్తారు.—ముఖ్యంగా దాదులున్నారే వాండ్రు మొలల్ని తెల్లటి గౌనుల్తో, తలల్ని తెల్లటిగుడ్డల్తో చెఱ్లో నడాడే తెల్లతామరపుష్పాల్లా శోభిస్తూ వుంటారు— అక్కడవాళ్లు, ఇక్కడవాళ్లు ఎక్కడ చూచినా వాళ్లే అని అనుకొనేలా.

చందనచర్చ ఓ రిక్షాలో కూర్చుని హాస్పిటాల్ మెయిన్ గేటు దాటి ఔట్ పేషంట్సు వైపునకు తిరిగే అంతలో ఓ దాది కనిపించి "గుడ్ మార్నింగు. ఈలా వచ్చారేంటమ్మా! మీరు? అంత అలా చిక్కిపోయారేంటమ్మా మీరు!" అంది. చందనచర్చ "ఊపిరితిత్తులు పాడయ్యాయి అన్నారు మావూరిడాక్టర్లు" అంది. "ఊపిరితిత్తులు? లంగ్సు?" అని ఒకింత అభినయించి "అయితే యిటురండి! నేనే అక్కడ వుండే నర్సును. ఏయ్ రిక్షావాలా! అలా పోనిచ్చి రిక్షా అక్కడ ఆపి ఆమెను జాగ్రత్తగా దింపి ఆవరాండాలో బల్లమీద కూర్చోపెట్టు. ఐ కమ్ ఇన్ ఎ మినిట్" అంది నర్సు. నర్సు అన్నా, దాది అన్నా వొక్కర్తే. ఇద్దరు అని అనుకునేరుగనుక పాఠకులు. ప్రతీనర్సుకూ ట్రెమెండస్ డ్యూటీ, ఉపద్రవమైన బాధ్యతా అనుకోండి రోగుల పట్ల.

ఊపిరితిత్తుల్లో జబ్బు అనగానే అదో శాఖ. అక్కడ పరీక్షచేసే డాక్టర్ వేఱు. అతని సాధనసంపత్తి వేఱు. అసలు అతని కాంతికలాపమే వేఱు. తెనుగున ఏమంటారో—ఇంగ్లీషున ఆ పరిశోధన 'ఎక్సురే ఎక్జామినేషన్' అని పిలవబడుతుంది.

పరిశోధనాగారంలోకి చందనచర్చ జాగ్రత్తగా నర్సుచేత నడిపింపబడింది.—ఈపాటికప్పుడే పాఠకులకు అవగాహనై వుండాలి. —కాకపోతే చెప్తావున్నాను. నర్సును చందనచర్చ పోల్చగలిగింది; చందనచర్చను నర్సు పోల్చగలిగింది - ఆనాడు టాక్సీలోని నర్సని; ఆనాటి గుమ్మంలోని గృహలక్ష్మి అని.

చందనచర్చ పేరు వున్న కాగితము నర్సు టి.బి. బాస్ ముందు పెట్టి "ఈమెయే చందనచర్చ" అంది. గది అంతా మెయిల్ ఇంజన్ గనుక రాత్రివేళ లైన్ మీద లైట్ ఫోకస్ చేసుకున్నట్లు తెల్లటి విద్యుత్కాంతి నిండించుకు వుంది. కాగితంమీగి డయాగ్రంవంక ఒకసారి, మనిషివంక ఒకసారి చూచేలో ఫోకస్ అయియున్న లైటు- ఒక గంట మోగి చటన హూఫ్ అని వూది ఆర్పినట్టు ఆఫ్అయి వెంటనే ఏదో చిరువెల్గు అతి సున్నితపు టూదాశోభతో చందనచర్చగుండా పరిశీలించే డాక్టర్ కళ్లమీదకు, డాక్టరు వెన్నునే పొంచుండి గమనిస్తూవున్న నర్సుకళ్లమీదకు ప్రసరించినట్టయింది.

పరిశోధన నిజంగా చేస్తే ఎంతోసేపు పట్టదు. అది ఫొటోతియ్యడం కాదు. తెరమీద బొమ్మ ఆనించడం. స్క్రీనింగ్.అంతా ఓనిమేషం. ఆనిమేషం పూర్తి కాకుండానే గడితలుపుతట్టినట్టయింది. నర్సు తలుపువద్ద

కువెళ్లి ఎవరా అన్నట్టు 'కీహో' ల్లోకి చెవియొగ్గింది. "మిస్టర్! దయచేసి తలుపు తెరవండి" అన్నట్టు వినబడింది. నర్సు తలుపు తీస్తూ "ఏమన్నారు నన్ను?" అని అడిగింది. అవతల వ్యక్తి "సారీ! సిస్టర్!" అంటూ గదిలోకి చొరబడి తనకూడా ఆకోమల శ్యామలకిరణ మార్గంలోనే నిలబడిపోయాడు. నర్సు, తిరిగి తలుపు నొక్కేసింది. అంతా ఎంతలో? ఒక పావునిమిషంలో.

చందనచర్చ ఆ కొత్తపురుషుని చూస్తూ సిగ్గుపడి, యొత్తిగిల్లి హాస్పిటాల్ డాక్టరుతో "ఇక నన్ను పరీక్ష చేయ నక్కరలేదండీ! నేను ఆరోగ్యంగానే వున్నాను" అంది. హాస్పిటాల్ డాక్టరుకు అదంతా గ్రీక్ అండ్ లాటిన్‌గా వుంది. ఆయన తక్షణం రూమంతా పగటి వెలుగ్గా తలుపులన్నీ బార్లెట్టించి "ఏమిటిది, ఈమె ఇలా అంటుంది?" అంటూ నర్సు వంక చూస్తూ, "హల్లో మేజర్! ఎప్పుడు రాక?" అని క్రొత్తపురుషుని కుశలప్రశ్న వేశాడు, నఖశిఖ పర్యంతం అతని ఐ. ఎమ్. ఎస్. దిరీను గమనిస్తూ.

అప్పటికప్పుడే "సిస్టర్ అంటే సోదరి కాదూ? సోదరి కాదూ? నాకు మరి రోగం లేదు. నా వూపిరి తిత్తులు సరిగ్గానే వున్నాయి. నన్ను కొంచెం విశ్రాంతి తీసికోనివ్వండి". అంటూ ఆగదిలోనే ఓమున్నని నిగనిగలాడే సొగసైన అతిసుకుమారపు కుర్చీమీద నర్సు సాహాయ్యాన్ని కూర్చుంది చందనచర్చ. సమీపంలో ఓ ఫాన్ ఆన్‌చేశా రెవ్వరో!

నర్సు—"టెలిఫోనులో ఆమెభర్త అయిన ఈయనగారికి ఈమెను గురించి నేటి వుదయం తెలియ జేశాను."

మేజర్ అభినవమోహన్—"నేనున్నూ నిన్న రాత్రే వచ్చాను ట్రూప్ ట్రెయిన్లో."

హాస్పిటాల్ డాక్టర్—"నీయిల్లాలి ఊపిరి తిత్తుల్లో ఎట్టి జబ్బున్నూ లేదు."

చందనచర్చయొక్క అలకలు అతి కులాసాగా, వీవనకు వడి అందుకున్న కొద్దీ మెలిమెలిగా అల్లల్లాడుతూ నుదుటిమీద తిలకాన్ని దోబూచులాడించాయి!



## ఏడురూపాయల జీతాని కేడంతస్తుల మేడ

[పిట్టకథ]

పూర్వకాలంలో రాజులు ప్రజాభిమానానికి విలువ ఎక్కువ యిచ్చేవారు. వారికి అప్పుడు నమ్మకమైన సి. ఐ. డి. లుండేవారు. వారేమైనా తప్పురిపోర్టు చేస్తున్నారేమో నని మంత్రిని వెంటదీసి కొని మారువేషంతో రాజే రాత్రిళ్లు పట్టణ సంచారా నికి బయలుదేరేవాడు. అక్బరు సార్వభౌముడు ఒక నాడు తన వేడుక చెలికాడైన బీరబలుతో మారు వేషధారియై యిలా తిరుగుతుండగా, రానురాను వారొక బ్రాహ్మణ అగ్రహారానికి వచ్చారు. అక్క డొక పూరికొంపలో బ్రాహ్మణదంపతులు మాట్లాడు కొంటూ వున్నారు. పెళ్లాము "నాథా! యీ గర్భ దరిద్రము ఎన్నాళ్లనుభవిస్తాము? అక్బరుపాదుషాగారి దగ్గిర కెళ్లి ఏదైనా నౌఖరీ సంపాదించి సుఖంగా కాలం గడపరాదా?" అన్నది. "ఒసే! వెఱ్ఱిపీనుగా! బ్రహ్మిగాడి కుద్యోగం ఎవరిస్తారే యీ రోజుల్లో? ప్రతిభంతా మహమ్మదీయులది. మన కఖండప్రజ్ఞ ఉన్నంతమాత్రాన తెలివితేటలు చూచి ఉద్యోగా లిస్తారా? ఏడు రూపాయల ఉద్యోగ మిస్తే ఏడు మేడ లెక్కించనా నిన్ను" అన్నా డా భార్యతో. అంతకుముందు ప్రభువులు మహమ్మదీయులకే ఎక్కువ ఉద్యోగా లిచ్చి హిందువులను తృణీకరించడము రివాజు. కాని అక్బరు సార్వభౌమునికి మాత్రము హిందూమహమ్మదీయుల విభేదముగాక తెలివితేట లెవరి కుంటే వారికే ఉద్యోగా లిచ్చేవాడు. అందుకే తోడరుమల్లు అతని ముఖ్యమంత్రి.

పాదుషా యింటికి వెళ్లిపోయాడు. "ఏడు రూపాయల ఉద్యోగ మిస్తేనే ఏడు మేడ లెక్కిస్తాడట వీడు భార్యని. వీడి ప్రజ్ఞ ఏమిటో చూదా"మను కొన్నాడు.

మరునాడు దర్బారుకు రావలసిందిగా కబురం పాడు బ్రాహ్మణునికి. ఆయన భయభక్తులతో సలాము చేసుకొంటూ కొలువుకూటానికి వచ్చి నిలబడ్డాడు. "ఏమయ్యా! బ్రాహ్మడా! ఏడురూపాయల ఉద్యోగ మొకటుంది చేస్తావా?" అన్నాడు ప్రభువు. "చిత్తము. తిండికి మొగమువాచి ఉన్నాము. దయ చేయండి ప్రభువువారు" అన్నాడు బ్రాహ్మడు. "బ్రాహ్మడా! సముద్రందగ్గిర కూరుచుండి సాయం త్రందాకా ఆటుపోటులు లెక్కవేయి. నెలకు ఏడు రూపాయలు ఖజానాలో పుచ్చుకో. ఇదిగో ఫర్మానా" అని ఆర్డరుకాగితం చేతి కిచ్చాడు. "ఇదేమి ఉద్యో గం?" అని బ్రాహ్మడు విస్తుపోయాడు. "ఏరాయైతే నేమి పళ్లూడగొట్టుకోడానికి? నాజీతపురాళ్లు నాకొస్తాయిగదా" అని సంబరపడ్డాడు.

సరే. తిన్నగా వెళ్లి సముద్రపుటొడ్డున కూరు చున్నాడు. సముద్రముమీద వెళ్లే ఒక ఓడకెప్తానును పిలిచి "యీ అలల లెక్కకు మీ ఓడల ప్రయాణం అడ్డు వస్తూవుందికావున వాటిని జోడుగుళ్ల బారు చేయి స్తా"నని తన ఉద్యోగంఆర్డరు చూపించాడు. ఆఓడపై లక్షలవిలువ చేసే సరుకు లున్నాయి. అవి గమ్యస్థానం చేరకపోతే చాలా నష్టం వస్తుంది. అందువలన ఆఓడ కెప్తాను అయిదు వందల సవరనులు లంచమిచ్చి తన ఓడను ఆభాగంమీదుగా తీసుకువెళ్లాడు.

ఇలాగే ప్రతికెప్తానుతోనూ.

ఈలా కొలదినెలలలో లక్షలు, కోట్లు సంపాదించా డాబ్రాహ్మడు. దానితో నిమిషాలమీద ఏడంతస్తుల మేడ తయారైంది. దానిమీద వెండితాగు టుయ్యాల. రంభలాంటి భార్య చెమ్కీడ్రెస్సులతో. లస్టరులందు దీపాలకాంతులు వెదజిమ్మ మహావైభవంగా బ్రాహ్మడు కాపురమున్నాడు.

మరల కొంతకాలానికి పాదుషా రాత్రిసంచారములో యీ మేడను చూచి ఆశ్చర్యపోయి ఎవరి దని అడిగాడు. "ఏడురూపాయల బ్రాహ్మడి మేడ" అని అక్కడివారు చెప్పారు. అక్బరు ఆశ్చర్యపోయి అతనిని పిలిపించి, నిజం చెపితే క్షమిస్తా నని అత డాడబ్బు ఏలా సంపాదించాడో తెలుసుకొన్నాడు. అతని తెలివితేటల కబ్బురపడి అతనిని విదేశాంగమంత్రిగాఅయిదువేలరూపాయల జీతం నెలకు ఏర్పాటుచేసి తన కేబినెట్టులోకి తీసుకొన్నాడు.

అక్బరు ఆగ్రాకోటలో విడిసియుండగా వేగులవలన విరోధిరాజపుత్రులు ప్రతాపసింహుని నాయకత్వమున కోట ముట్టడించినారు. కోటలో పాదుషా ముట్టడికి తయారుగా లేడు. అంతేగాక ఆహారపదార్థాలు చాలా తక్కువగా ఉన్నాయి. పాదుషా విదేశాంగమంత్రిని పిలిపించి "మంత్రీ! ఏమిటి తరణోపాయం" అన్నాడు. "ప్రభూ! తొందరఏల? చూడండి. వాళ్లకి టోకరా యివ్వడం ఎంత? చూద్దురుగాని నాప్రజ్ఞ. నేను విదేశాంగమంత్రిగా ఉన్నంతకాలం దేవరవారి సామ్రాజ్యాన్ని నిలింపాదులైనా కన్నెత్తి చూడలేరు. రాజపుత్రులైనాసరే, వారి తాతలు వచ్చినా భయంలేదు" అని ధైర్యం చెప్పి, అందరి యిళ్లలోని పప్పు ఉప్పులు, ఒకరోజు సరుకు మినహాయించి, రాజవంటశాలకు చేర్పించా లని ఆర్డినెన్సు ప్యాసుచేశాడు. ఓ! బియ్యం మొదలైన వన్నీ మహానసశాలకు చేరాయి. గుండిగలమీద గుండిగలు వార్పించాడు. ముట్టడిసైన్యాలకు పాదుషాగోరిల్లా సైన్యాలవల్ల ఆహారసప్లయిలు తిన్నగా అందడంలేదు. కాని వారు ప్రతాపసింహుని తిరుగులేని ఆర్డరుకు బద్ధులై ముట్టడి సాగిస్తున్నారు. ఆ శత్రుసైన్యాలకి యీ బ్రాహ్మడు ఆ వార్పించిన పప్పు కూరలు, అన్నం అన్నీ పంపించాడు. "అమ్మయ్యో! శత్రుసైన్యాలకే ఇంత సరఫరా చేయగలిగిన సామాను లాకోటలో ఉంటే ముట్టడివలన దీనిని మన మెప్పుడైనా జయించగలమా? మన ఆహారపదార్థాలు రావాయె. ఇక్కడ యీ ప్రతాపుని పల్కులు వినేదెవడు? ఆకలితో చావడ మెందు" కని ఎవడిమట్టుకు వాడు కాలికొద్దీ అవతలికి దూకేశాడు. సైన్యం లేని ప్రతాపు డేమి చేస్తాడు? నిస్తేజుడై అడవులు పట్టి పోయాడు.

అక్బరుపాదుషాయొక్క రంజిత్తునుకర్ణపతకము విదేశాంగమంత్రికి బహూకరింపబడింది. జీతం నెలకు పదివేలు శాంక్షను అయింది.

పులవర్తి కమలావతీదేవి.

---

## జాతీయగీతము — శ్రీకృష్ణుని బాల్యలీల

౧౯౪౨ డిసెంబరు చివర దుగ్గిరాలలో జరిగిన యుపాధ్యాయపండితపరిషద్వార్షికమహాసభలో "పరిషత్సభ్యులు తమతమ ప్రాంతముల వినవచ్చు పాటలు, పదములు మొదలగువానిని సేకరించి పరిషత్తునకు పంపవలసినది" అని యొక తీర్మానము చేయఁబడినది. ఇంతవఱ కేసభ్యుఁడు నట్టిపని చేసియుండలేదుగాని, పరిషదధ్యక్షుఁడనయినందు కాపని నేనే ముందు మొదలు పెట్టితి ననుటకో యనఁ గొన్నాళ్లక్రిందట నొక బిచ్చగాఁడు తంబుఱానుతితో పాటపాడుచు మాయింటికి రాఁగా అది గ్రామ్యముగాఁ గనవచ్చుటచే వాని నోటికి వచ్చినంతవఱకు పాడించి యీ క్రిందిగీతములు వ్రాసితిని. ఇది అప్రయత్నలబ్ధము.

ఈపాట లింతదనుక ముద్రితములు కాలేదేమో యని నాయూహ. లయతాళములకు సరిపడున ట్లందందు హ్రస్వదీర్ఘములు తాఱుమాఱగుచుండును. వాఁడు పాడినట్లే వ్రాసితినిగాని భాష నేనేమీ సవరించలేదు.

ఈ రెండుపాటలుకూడ యశోదా బాలకృష్ణ సంవాదరూపములు. పాట లెట్లు పాడవలె నన్న విషయము పాఠకులే చూచుకొనవలెను. నాకు సంగీతజ్ఞానము లేదు గనుక యిదమిత్థమని తెలుపఁజాలను. మఱియు, ఆ దాసరి పాడునపుడు కొన్నికొన్ని చరణ

ములు తొలుమాటుచేసి పాడెను. రెండుమూఁడుసార్లు పాడించితినిగాని చరణముల క్రమము మాత్రము విస్పష్టము కాలేదు. ఈగీతములు రచియించిన కవి దక్షిణామూర్తి యని మాత్రము చివరి చరణమువల్ల తెలిసినది. మేష్టరు మొదలగు కొన్ని పదముల వాడుక యీ కవి మొన్నమొన్నటివాఁడే యని తెలుపుచున్నది.

మొదటిపాట*

కృ—అమ్మ మాడే కొండామీదా
అదిగో నా వెండి గిన్నె.
గిన్నె తెచ్చివ్వవమ్మ
బువ్వ నే తిందునమ్మ! అమ్మ-

య—గిన్నె కాదు వినుమయ్య
జాబిల్లి రా తనయ
రాఁర నా ముద్దుకృష్ణ
రాఁర నా వెఱ్ఱినాన్న! గిన్నె-

కృ—గిన్నె కాదంటావే మే
గిన్నెచుట్టూ మెతుకులే మే
దబ్బున తెచ్చివ్వకున్నా
బ్రతుకుటా యిక సున్నా అమ్మ-

య—ఎందు నే పోయెదను
ఏలాగు తెచ్చేదను
మెతుకులు కావివయ్యా
చుక్కలురా నా తనయా! గిన్నె-

కృ—చాలుచాలు లే విననే
తలను కొట్టుక చచ్చెదనే
నాజతా పిల్లాల కమ్మ
వెండిగిన్నె లున్నావమ్మ అమ్మ-

య—బాబు నామాట వినూ
చిన్నిబిడ్డా పోరు మాను
బంగారపు గిన్నె నీకు
చేయించెద నేడ్వబోకు గిన్నె-

కృ—దబ్బుదబ్బున పోవమ్మ
త్వరగా తెచ్చివ్వవమ్మ
గిన్నె తెచ్చివ్వవమ్మ
లేకున్నా రాను పోమ్మ అమ్మ-

య—గిన్నె కాదు వినుమన్నా
పోరుమాను మా యన్నా
ఎంతెంతో పోరుపట్టి
యేలా యలిగితి పట్టి! గిన్నె-

కృ—ఏల యీ చోద్యంబు
నను జూచి హాస్యంబు
గిన్నె కాకున్న నమ్మ
యేల నవ్వుచుంటి వమ్మ అమ్మ-

య—హాస్యంబు గాదురా
అల్లాడె చంద్రుడురా
నిన్ను జూచి చాలా
కులికి నవ్వుచుండె బాల గిన్నె-

కృ—గొల్ల పిల్లలంతా.
నల్లనివా డన్నారే
చూడు నాతమాషా
పాలమ్మనిస్తానా అమ్మ

*     *     *

య—నాకు భర్తయిండై
నా దక్షిణామూర్తిని గూడి
చేరి నే చంద్రూనీ
చూపించెదను చూడు గిన్నె

రెండవ పాట

కృ—అమ్మా నాకు బువ్వా పెట్టే
బడిలోకి నేపోతా,
దబ్బుదబ్బున తిని
దబ్బున రమ్మన్నారే అమ్మ

య—చిన్నికృష్ణా రారమ్మ
క్షీరాన్నము తినిపోమ్మ,

---

* ఇందు పల్లవుల భేదముతో పాటల నరస కూడా భేదించును.

* * * ఇక్కడ యశోదమాటలు, కృష్ణుని మాటలు ఉండవలసినట్లు కనఁబడుచున్నది.

ఏల యింత భయమూ
నీ చదువునకు జయమూ - చిన్ని-

కృ—పెరుగు అన్నము నాకు-
చాలుచాలు నమ్మ
బెల్లం ముక్క యిస్తే
బేగి తిని పోతానే- అమ్మ-

య—పాలుపంచదారా
గిరిధార! తినిపోరా
బెల్లం ముక్క చాలా
నీచమురా నాబాలా చిన్ని-

కృ—కొత్తమేష్టరుగారూ
వచ్చేరె యీవేళ
లాగు చొక్కా తొడిగి
త్వరగా రమ్మన్నారే అమ్మ-

య—కొత్త మేష్టరుగారు
కొడుకని న్నెఱుగునా?
పట్టుతాపిత యుదిగో
కట్టుకో యిల్లిదిగో చిన్ని-

కృ—నెలరోజులైనాదీ
జీతము తెమ్మన్నారే
జీతమివ్వకుంటే
బడిలో కొద్దన్నారే అమ్మ-

య—రార నా రత్నమా
నాముద్దు భాగ్యమా!
పొమ్మ రత్నము లివిగో
పంతులుగారికి నిమ్మ చిన్ని-

కృ—గొల్లపిల్ల లంతా
నల్లనివాడన్నారే
చూడు నాతమాషా
పాలమ్మనిస్తానా? అమ్మ-

య—నల్ల నల్ల నివాడా
నామములు గలవాడా
నారాయణమూర్తి నీ
భక్తుడు దక్షిణామూర్తి చిన్ని-

ఆదాసరి కీపాటలు పూర్తిగా రావు. ఇంకా కొన్ని చరణము లున్నవని యతఁడే యనెను.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

---

# భారతయుద్ధమునాటి శస్త్రాస్త్రములు

ఆరోజులలో యుద్ధవిషయ మెఱుగవలె నని ప్రతివాని మనస్సునం దాసక్తి యెక్కువగా యుండును. నేడు మహాభీషణమైన నరసంహారము జరుగుచున్నది. దీనిని మించిన యుద్ధము కొన్ని వేల సంవత్సరముల క్రిందట 'మహాభారతయుద్ధ' మను పేర జరిగియుండెను. అప్పుడు బాంబులు, టాంకులు, ఫిరంగులు లేవు. నాటియుద్ధము కేవలము శస్త్రాస్త్రములతోనే జరిగెను. వాని మహాత్వ మద్వితీయమై యుండినది.

మహాభారతకాలమునందు వివిధశస్త్రాస్త్రము లుంటచే వీరులు తమ బలము నద్భుతముగా ప్రదర్శింపగలుగుచుండిరి. ఈ అస్త్రము లుండుటచే భారతవీరులకు అనంత వాయుమండల, జలభాగ, పాతాళ, విస్తృత భూ భాగములం దెచ్చటను సాధ్యముకాని కార్యము లేకుండెను.

భారతయుగములో విజయవంతమైన సేనా, దిగ్వ్యాప్తమైన శక్తి ప్రబలియుండెను. ప్రళయకాలాగ్ని సమానమైన మహాభారతాగ్ని శిఖయందు వీరత్వదీపశిఖలు వెలిగిన వెలుగులు మన కక్షరరూపములుగా కనిపించుచున్నవి.

నేడు విజ్ఞానము అనేకవిధములైన మారణాస్త్రములను తయారుచేయుటయందు మునిగి తేలుచున్నది. కావచ్చును. పూర్వము కేవలము శస్త్రాస్త్రముల ద్వారా ౧౮ దినములలో ౧౮ అక్షౌహిణుల సైన్యరక్తము కురుక్షేత్రమునందు ప్రవహించి యుండెను. నేటి మారణయంత్రములు నూతనముగా కానరావచ్చుకాని, పౌరాణిక యుగమునాటి అస్త్రప్రభావములను బాగా యెఱిగియే ఇప్పుడు రాత్రింబగళ్లు కర్మాగారము

లందు కష్టపడి అనేకవిధముల మందుసామగ్రిని పరిణతముచేసి మహోశ్చర్యకరమైన పనులను చేయుచున్నారు.

## బాణము

ఆరోజుల్లో బాణము ప్రతివానికి సహాయకారిగా నుండెను. నాడు బాణము మహత్వపూర్ణమైనదిగా నుండెను. ఎంతదూరమునైనను లక్ష్యించి కొట్టుటకు బాణమే ప్రముఖసాధనముగా నాకాలమునందుండెను. అందులో చిన్న, పెద్ద అని రెండు రకములు. పెద్దది మూడుమూరల పొడవు కలిగి కొసను ఛిద్రము వేయుటకు తగిన పదను కలిగియుండెను. దీనికంటె నతిరిక్తమైన కర్ణబాణ మనునది యొక్కటి కలదు. దానికి చివర రెండుప్రక్కలకు చెవులు కలిగి, ఒకరకమైన ఆకారముతో ఉండెను. ఇయ్యది విడుచు సమయమున ఒకరకమైన ధ్వని చేయుగలుగును. లక్ష్యభేదనమునందు నేటి మందుగుండ్లకంటె ఆరోజుల్లో బాణవిద్యా విశారదులయొక్క బాణములు బాగా పనిచేయుచుండెను. అస్త్రసంధానోపసంధానములకును ధనుర్వేద మభ్యసించుచుండిరి. అప్పుడు బాణవిద్యావిశారదులకు శత్రువులు వేయు బాణములను తమ బాణములతో విఱుగకొట్టుట ఒక సామాన్య విషయము.

## త్వాష్ట్రాస్త్రము

ద్రోణపర్వమునందు సంశప్తకవధ సందర్భమున త్వాష్ట్రాస్త్రము వర్ణింపబడినది. పాండవసేనయందు క్రుద్ధులైన సంశప్తకులు వీరశిరోమణి అయిన అర్జునునిపై నానావిధములైన అస్త్రములను వేయుచు సైన్యమును చెల్లాచెదరుచేయ నారంభించిరి. అప్పుడు అర్జునుడు క్రోధమున గాండీవముతో వారి నందఱిని ప్రతిఘటింప మొదలుపెట్టెను. అర్జునుని గాండీవ మిచ్చట విచిత్రమైన పని చేయసాగెను. ప్రతికక్షు లొండొరుల సహాయముతో అనేకవిధాస్త్రములు విడుచుచు బ్రహ్మాస్త్రము విడువగా దానికంటె వేగమైన ప్రాంజలీక, అర్ధచంద్ర, నాలీక, నారాచ, వరాహకర్ణాద్యస్త్రములు విడుచుచు తుదకు త్వాష్ట్రాస్త్రమును వదిలెను. (చూ: కర్ణపర్వము.) అప్పుడు త్వాష్ట్రాస్త్రప్రభావముచే రణక్షేత్రములో సహస్రార్జున ప్రతిబింబములు కానరాసాగెను.

నేటి విజ్ఞానము ఇంకను ఇట్టి అస్త్రమును తయారుచేయు స్థితికి రాకున్నది. ఈ బాణప్రదర్శనము కబీరుకాలములో ఢిల్లీ పట్టణమందు ప్రదర్శింపబడినదట. ఈ అస్త్రము విడుచుటతోనే అంతా అంధకారమై ఆమీద అస్త్రసంధానకుని రూపములు సహస్రముగా రణక్షేత్రమునందు ప్రతిబింబించునట!

## బ్రహ్మాస్త్రము

సంశప్తకు లొక్కపెట్టున అర్జునునిపై వర్ష పరంపరగా బాణములు కురిపింప కృష్ణుడు, రథము, గుఱ్ఱములు అస్త్రములతో మునిగిపోవ అర్జునునికి చీకటి రాత్రివలె అయిపోయెను. అప్పుడు అర్జునుడు బ్రహ్మాస్త్రమును విడిచెను.

బ్రహ్మాస్త్ర ప్రభావముచే అనేకవేల వీరులు తమ ప్రాణములను రక్షించుకొనలేక గుఱ్ఱములు, రథములు, సారథులతో సహా భూమిపై పడి మరణించిరి. సంశప్తకవీరులకు తమ సైన్యముపై గర్వముండెను కాని, అర్జునుని బ్రహ్మాస్త్రముచేత సర్వులును నశించిపోయిరి.

ఈ బ్రహ్మాస్త్ర ప్రభావమునుగూర్చి రామాయణమందు "త్రైలోక్యమాసీత్ సంత్రస్తం బ్రహ్మాస్త్రే సముదీరితే" అని వాల్మీకి బ్రహ్మాస్త్రము వదలిన ముల్లోకములు భయభీతి బొందునని వర్ణించెను.

## బ్రహ్మశిరాస్త్రము

కౌరవసేనయందు ద్రోణాది సేనాధిపతులందరు మరణించియుండిరి. అశ్వత్థామ, కృపాచార్య, కృతవర్మలే శేషవీరులై ఉండిరి. అశ్వత్థామకు మహాకోపము ఆవేశించియుండ తన ప్రాణము లరచేతిలో పెట్టుకొని చూపుల నిప్పులు గురియుచుండ యుద్ధభూమిని ప్రవేశించెను.

అర్జునాశ్వత్థామలు గర్వముతో బాణపరంపరను వర్షించుకొనుచు యుద్ధము చేయుచుండిరి. ఇట్లు కొంతతడవు జరిగినతరువాత విధిలేక తన ప్రాణసంరక్షణార్థము పెట్టుకొనియున్న బ్రహ్మశిరాస్త్రమును అశ్వత్థామ అర్జునునిపై వదిలెను. దాన్ని విడిచిన తోడనే అగ్ని ఉత్పన్నమయ్యెను. ఆ చిత్రమును చూడ ప్రళయకాలాగ్ని ముల్లోకముల దహించినట్లుండెను.

ఈ అస్త్రమువల్ల మనకు లోకమును భస్మము చేయునంతటి శక్తి అస్త్రములందున్నట్లు తెలియ వచ్చుచున్నది. దీనికంటె విచిత్రము ఈ అస్త్రమును వదిలిన దేశములో ౧౨ సంవత్సరములు వర్షము కురియ దట!

ఈ అస్త్రమును బ్రహ్మచారిమాత్రమే వదల గలడు. దీన్ని నేటి తుపాకులు, బాంబులమాదిరి అల వాటుకొరకు ఉపయోగించకూడదు. దీన్ని విడిచిన శిరచ్ఛేదనము జరిగియేతీరవలయును. దీనికి ఎయ్యది లక్ష్యమో అది ఆకాశ, భూమి, జలములందు ఎచ్చట నున్నను సరే తన పని నెరవేర్చుకొను సామర్థ్యము కలిగియుండెను.

## అంజలీకము

అర్జునుడు త్వరగా కర్ణుని సంహరించుటకు వజ్రాయుధముతో సమానమైన అంజలీకమును కర్ణునిపై వదిలెను. అప్పుడు అర్జునుడు గాండీవముయొక్క అల్లె త్రాడును ఆకర్ణాంతము లాగి వదలగా సూర్యప్రకాశ సమానముగా దశదిశలా ప్రకాశించెనట!

## నారాయణాస్త్రము

ద్రోణాచార్యుడు దీనిని వదలియుండెను. దీని నుండి మహాభయంకరమైన బాణములు, వజ్రసమాన మైన గుండ్లు (వీటిని రసగుండ్లనికూడా వ్యవహరింతురు.) బయలువెడలెను. ఆగుండ్లలోనుండి భయంకరవస్తువులు వెడలుటేకాక, రెండో, నాలుగో ఆగుండ్లు ఆకాశము పైకి ఎగిరి చక్రమువలె తిరుగుచు వెలుగుచుండెను.

## వాయవ్యాస్త్రము

ఈఅస్త్రము అతిప్రచండమైన చీకటిచేయుచు, వృక్షములను సమూలముగా పెటికివైచుచు, పెద్దపెద్ద రథములను పైకము పడగొట్టగలిగియుండెను. శత్రువుల ఏనుగులను, గుఱ్ఱములను, సర్వసైన్యమును కంపింప జేయుచుండెను.

కర్ణుడు వేసిన వారుణాస్త్రసంహారమునకు అర్జు నుడు దీనిని ప్రయోగించియుండెను. ఇయ్యది ఆకాశము నలువైపులకును వ్యాపించి మేఘములను ప్రచండవాయు వేగముతో ఛిన్నాభిన్నము చేయుచుండెనట!

## సుదర్శనచక్రము

ఇయ్యది శ్రీకృష్ణుడు ధరించునది. ఇది అగ్ని మయమై తీవ్రముగా శత్రుసమూహమును భస్మము చేయగలిగి, ఆకాశమునందు సూర్యునికంటె వేగమైన గమనము చేయు శక్తి కలిగియుండెను. దీనిని శ్రీ కృష్ణుడు ఆకాశముమీద ఎప్పుడు వదులునో అప్పుడే గిఱ్ఱున తిరుగుచు లక్ష్యమును తుంటలుతుంటలుగా చేసి మరల శ్రీకృష్ణునివద్దకు వచ్చిచేరుచుండెను.

చక్రములలో కొన్ని భేదములున్నవి. ముఖ్యమైనవి: ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, దండ చక్రము, ఐంద్రచక్రము, సుదర్శనము, సహస్రము మొదలగునవి.

## వజ్రాస్త్రము

దీనివల్ల ఆకాశమునందు మహత్తరమైన శబ్దము పుట్టుచుండెను. అర్జునప్రయుక్తమైన వాయవ్యాస్త్ర నివృత్తికొరకు కర్ణుడు దీనిని విడిచియుండెను.

ఇది ఇంద్రుని ముఖ్యాస్త్రము. వేదములును, తదితరశాస్త్రగ్రంథములును వజ్రాయుధమునకు, ఇంద్రు నికి శాశ్వతసంబంధమును తెలుపుచున్నవి. వజ్రోత్పత్తిని గురించి పురాణగ్రంథములు భిన్నమతములుగానున్నవి. మత్స్యపురాణమునందు సూర్యునిలోనుండి చీల్చుకొని ఒక తేజముద్భవింప నది విష్ణుచక్రము, ఈశ్వరుని త్రిశూలము, ఇంద్రుని వజ్రాస్త్రము అయినదని వ్రాయ బడియున్నది.

వామనపురాణమునందు ఇంద్రుడు దితిగర్భము నందు జొరగా అందు ఒక బాలకుని మాంసపిండము కానవచ్చెను. ఇంద్రుడు క్రుద్ధుడై దాన్ని చేతికి తీసి కొని కొట్టగా అప్పుడది పెద్దదై దానియందు నూఱంగ ములు కనిపించెను. అది తరువాత కఠోరమైన వజ్ర రూపము దాల్చెనని వ్రాయబడెను.

శ్రీమద్భాగవతమందు ఇంద్రుడు వృత్రాసురుని వధించుటకొరకు దధీచిమునియొముకతో వజ్రముచేయ మని చెప్పగా విశ్వకర్మ అట్లుచేసి ఇచ్చిన వజ్రముతో నింద్రుడు వృత్రాసురుని సంహరించె నని యున్నది.

ఐతరేయబ్రాహ్మణమునందు ఈవిధముగ నున్నది. దధీచి బ్రతికియున్నంతకాలము రాక్షసులు పారిపోవుచుండిరి. అతడు మరణించుటతోడనే మరల ఉత్పాతములు చేయనారంభించిరి. ఇంద్రుడు దధీచి నన్వేషించుటకై సరస్సునకు వెళ్ల దధీచి మరణించినట్లు తెలిసెను. అతని ఎముకకై సర స్తీరమున వెతుక పుర్రెఎముక చిక్కెను. దానినే వజ్రముగా చేసికొని ఇంద్రుడు రాక్షసులను జయించెనట.

నీతిప్రకాశికయందు ఉపర్యుక్తవర్ణనలకంటె చాలా భిన్నముగా చెప్పబడినది. పెద్ద వాలుక, పెద్ద దంతములు, కొన్నియోజనముల విస్తీర్ణము, భయంకరాకారము, అగ్నితుల్యతేజము, సహస్రసూర్యప్రకాశము కలదిగా వజ్రము వర్ణింపబడినది.

## అమోఘశక్తి

జటాసురుణ్ణి చంపిన ఘటోత్కచుడు కర్ణునితో యుద్ధముచేయుచు ఆకాశముమీదికి ఎగిరి యుద్ధము చేయ మొదలుపెట్టెను. అపుడు మహావేశముతో అలంబుషుడు దుర్యోధనుని దగ్గరకు వచ్చి "దేవా! నన్ను యుద్ధమునకు పంపుము. నేను అవశ్యముగా పితృమారకుడైన వానిని సంహారింతును" అని చెప్పగా దుర్యోధనుడు "పాండవపక్షసైన్యము, ఏనుగులు, గుఱ్ఱములు, రథములు ఘటోత్కచుని అనుసరించి ఆకాశమునం దున్నవి. నీవు వెంటనే వెళ్లి ఘటోత్కచుని సంహారించి వానిని యమలోకమునకు పంపుము." అనెను. (చూ: ద్రోణ. ౨౫౮-౧౧).

దీనివల్ల మనకు పూర్వము యోధులు విమానములపై కూర్చొని ఆకాశమునందు యుద్ధముచేయుచుండినట్లుగా తెలియుచున్నది.

కర్ణునికి అమోఘశక్తి ఉండినందున గర్వించుచుండెను. దానిని అర్జునుని చంపుటకై భద్రపరచియుంచెనుకాని, వివశుడై ఈ అమోఘశక్తిని ఘటోత్కచునిమీద వదిలివేయ వీరపుంగవుడైన ఘటోత్కచుడు విమానములో తన్ను తానే తెలుసుకోలేకపోయెను.

రాజా స్నో
FOR THE SKIN
"RAJA" (REGD) SNOW
Removes roughness and makes the skin soft and white and is delicate application for pimples. It is used after bath after shav. and when going outdoors.
ALL INDIA AGENTS
MANYAM & CO
MADRAS
"RAJA" (REGD) SNOW for Beautiful Complexion
మొటిమలను పోనిచ్చి అందమునిచ్చును
వెల రు. 1-0-0

ఇషికాక భుశుండము, శతఘ్ని, సహస్రభృష్టి, సంతాపన, విలాయన, శోషణ, ధారణ, పైశాచ, మానద, మంథన, హయశిర, వైద్యాధర, శూల, త్రిశూల, కంకణ, దారుణ, పైనాక, ప్రశమన, సౌమ్య, వర్షణ, మాదన, పట్టక, కనప, శూద్రవన, భౌమ, పార్జన్య, వైష్ణవాస్త్ర, మాహేశ్వర, ఆసుర, యామ్య, ఐషీక, శైలేయ, ధృతి, తామస, రౌద్రాది వందలకొలది అస్త్రము లాసమయమునం దుండెను. కొంచెము ఇంచుమించు ౨౫౦ అస్త్రము లుండెను.

నేటికాలమునకు ఇవి నామమాత్రావశిష్టమై భారతమునందు అక్షరరూపములుగా నభివ్యక్తమగుచున్నవి.

దండిపల్లి వేంకటసుబ్బాశాస్త్రి.

# తేయాకు కథ నెం. 6.



తేయాకును జల్లెడపట్టుట.

## యంత్రదశ

ఆడియార్చి ఆకులయొక్క సౌరభము నిలువచేసిన తరువాత తేయాకు జల్లెడ పట్టుటకు సిద్ధముగా నుండును.

తేయాకును జల్లెడపట్టి తరగతులుగా విభజించుటకు పూర్వము దానియం దుండు కాడలను ఇతరపదార్థములను ఏరివేయబడును. జల్లెడపట్టు యంత్రములపై చిన్న ఆకులు పెద్దదానినుండి వేరుపరచబడును.

వివిధములైన తరగతులు ప్రత్యేకించబడి, వేరువేరు పెట్టెలలో నింపబడి సిద్ధము చేయబడును.

శ్రద్ధగా ప్యాకింగు చేయబడి శీఘ్రముగా బట్వాడా చేయుటవలన మీకు చేరు నప్పటికి తేయాకు తాజాగా, సౌరభముతో గూడియుండును.

# బ్రూక్ బాండ్

# శ్రీనాగేశ్వరరావు పంతులుగారు





శ్రీ నిడదవోలు వెంకటరావు

## ప్రథమదర్శనం:

౧౯౧౧ సంవత్సరంలో కృష్ణాజిల్లామహాసభ మచిలీపట్టణంలో ఆంధ్రజాతీయ కళాశాలలో సమావేశమైంది. ఆ సభలో సభాపతివేదికకు ప్రక్కగా క్రింది భాగాన పత్రికావిలేఖకులకు ప్రత్యేక ఆసనములను యేర్పాటుచేశారు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి సంపాదకత్వమున నడుపబడుతూండిన 'దేశమాత' పక్షాన సత్యవోలు అప్పారావూ, ఆపట్టణంలో నేనాళం కృష్ణారావు, కందుల శ్రీమన్నారాయణగార్లు ప్రచురిస్తూండిన 'మానవసేవ' యను సచిత్ర మాసపత్రికకు ప్రతినిధిగా నేనూ ఆసభకువెళ్లి ప్రత్యేక విలేఖకులుగా సభ నలంకరించాము. తేజోవంతమైన సుందర సువర్ణచ్ఛాయతో నొప్పారు ముఖమండలము, గుబురైన నల్లని మీసకట్టు, అహమ్మదాబాదు మిల్లుధోవతి బిళ్లగోచీ ముందుకుచ్చెళ్లు ముడిచికట్టుకుని, వేస్టుకోటు, దానిమీద బూడిదరంగు ట్వీడుకోటు తొడుక్కొని, తలమీద ఎత్తైన నల్లని ఉన్నిటోపీ ధరించిన ఒక మహావ్యక్తి శాంతిరసముట్టిపడుతూ, గభీరభావందాల్చి, చూపరులకు ఒక ఉత్తర హిందూస్థానపు వర్తక ప్రముఖునివలె కనబడుతూ నాప్రక్క కుర్చీలో కూర్చొనియున్నాడు. కొంతసేపైన పిమ్మట నే నాయనతో మెల్లగా "ఈ కుర్చీలు పత్రికావిలేఖకులకు ప్రత్యేకంగా ఏర్పాటుచేయబడినవండీ" అన్నాను. అంతట పంతులుగారు చిరునగవుతో "నేనూ ఈపనిమీదనే బొంబాయినుండి వచ్చానండీ" అన్నారు. ఆ ప్రత్యుత్తరంతో నా నోరు మూతపడింది. నాలో కలిగిన అహంకారం లజ్జగా మారిపోయింది. అత డెప్పుడైతే ఈపనిమీదనే బొంబాయి నుండి వచ్చానన్నాడో అప్పుడే నాకు తట్టింది; ఈతడే శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతు లనీ, లేత ఎరుపురంగు కాకితముపై బొంబాయినుండి ప్రచురిస్తూ వచ్చిన ఆంధ్రవారపత్రికకు నేత యనీ. వెంటనే లేచి నిలుచబడి, వంగి నమస్కరించి, "క్షమించండి పంతులుగారూ, తెలియక ప్రశ్నించాను" అన్నాను. పంతులుగారు అనునయవాక్యంతో నాపుట్టుపూర్వోత్తరములు, మా'మానవసేవ' పత్రికను గూర్చిన వివరములు అడిగి తెలుసుకున్నారు. పంతులుగా రడిగిన ప్రశ్నల కన్నిటికీ సవినయంగా సమాధానం చెప్పుతున్నాను.

## దూరదర్శి:

దూర దేశములో నున్న బొంబాయినగరమునుండి ఆంధ్రవారపత్రికద్వారా కొంతవరకు తెలుగుప్రజలకు వివిధవిషయములనుగూర్చి ప్రచారప్రబోధములు సాగిస్తూ వచ్చినా నాగేశ్వరరావుపంతు లంతటితో సంతృప్తి చెందలేదు. భారతవర్షములోని వివిధరాష్ట్రాలలో బంగాళము, మహారాష్ట్రము, ఉత్తరహిందూస్థానము, గుజరాతు, తమిళము మొదలైన ప్రదేశాలలో నుండి వారివారి మాతృభాషలలో దైనికపత్రికలు ప్రచురింప

బడుతూ అక్కడక్కడి ప్రజానీకములో విజ్ఞానములు వృద్ధిగాంచి, ప్రబలమగు రాజకీయచైతన్యం కలుగుతూండడము, రెండుకోట్ల జనసంఖ్యగల తన మాతృదేశము ఒక ఆంధ్రదైనికపత్రికకైన నోచుకోకుండుటవల్ల తెలుగుప్రజలలో విశ్వాసము లేకుండడమూ చూచి మాతృదేశోద్ధరణకు దేశభాషలో నొక దైనికపత్రిక యావశ్యకమనీ, ఆ మహత్తరకార్యమునకు తానే పూనుకోవలెననీ దూరదేశమున నుండియే ఈ దూరదర్శి గ్రహించాడు. దైనికపత్రికను నెలకొల్పడమంటే సామాన్యవిషయం కాదు. దాని కెంతో శక్తి సామర్థ్యాలు, సాహసము, ధనము ఉంటేనేగాని కొనసాగేవిషయం కాదు. అందులో తెలుగుదినపత్రికకు ఆంగ్లదైనికపత్రికకుండు చందాదారులు లభించుట కూడ కష్టమే. ఈ విషయము లన్నింటిని పాటింపకయే దేశోద్ధరణమే తన జీవితాదర్శముగా పెట్టుకున్నవాడగుటవల్ల వెంటనే తన కార్యస్థానమును బొంబాయి నుండి చెన్నపట్టణమునకు మార్చివైచి, ఒక శుభముహూర్తమున, ఆంధ్రుల అదృష్టరేఖ బయటపడినదా యనునట్లుగా ఆంధ్రదైనికపత్రికయగు ఆంధ్రపత్రికను ప్రచురింప మొదలుపెట్టాడు. ఈ పత్రికా ప్రచారంవల్ల పట్టణములలోనే కాకుండా పల్లెగ్రామాదులలోకూడా ఆంధ్రదేశంలోనూ, వివిధరాష్ట్రములలోనూ, వివిధఖండాంతరాలలోనూ నడుస్తూండిన వివిధోద్యమాలయొక్క రాజకీయమతసాంఘిక విప్లవ పరిణామాభివృద్ధిక్రియాలయొక్క వార్తలు యేరోజుకారోజు అందజేసుండడమువల్ల ఆంధ్రులలో గొప్ప ప్రబోధం కలుగజేయబడింది. ఆంధ్రదేశమున నడుపబడ్డ ఉద్యమములూ, తదుద్యమనాయకులూ ఆంధ్రపత్రిక ద్వారా ప్రాముఖ్యతలోనికి తేబడ్డారు. ౧౯౧౪ మొదలు ౧౯౧౮ సం||రం వరకు నడచిన ఐరోపాసంగ్రామ సంబంధమైన వార్తలు ఆంధ్ర దైనికపత్రిక మూలమున ఏనాటికానాడు కుగ్రామములకు కూడా అందజేయబడుతూండడమువల్ల అక్కడి ప్రజలలో అంతులేని సంచలనం కలుగుతూండేది. ఆంధ్రదేశంలో దిగ్విజయంగా కొనసాగుతూ వచ్చిన వివిధోద్యమాలకు, ఢిల్లీ శాసనసభకును, చెన్నపురి చట్టనిర్మాణసభలకును నిలిచిన కాంగ్రెసుపక్షాభ్యర్థుల విజయపరంపరలకు, కాంగ్రెసు నిర్మాణకార్యక్రమ నిర్వహణమునకు ఆంధ్రదైనిక వారపత్రికలే ముఖ్యసాధనములని నిస్సందేహముగా మన మంగీకరింపక తప్పదు. ఆంధ్రపత్రిక ఆంధ్రులలో ప్రబోధం కలిగించి, వారి మానసిక ప్రవృత్తులలో చాలవరకు మార్పు కలుగజేసి దేశాభిమానమునకు, ప్రత్యేకరాష్ట్రవాంఛకు, భాషాభిరుచికి చాలా దోహదం చేయగలిగింది. ఈ విధముగా నాగేశ్వరరావు చేసిన సేవ అపారము, అమూల్యము.

దేశోద్ధారకుడు 'భారతి'ని నెలకొల్పి వైజ్ఞానిక, సారస్వత, వివిధశాస్త్ర సంబంధములైన అమూల్యములగు వ్యాసములను ఆయావిషయములలో నారితేరిన పండితులచేతను, కవులచేతను వ్రాయించి, ప్రచురిస్తూ, వారివారికి ప్రోత్సాహం కలుగజేస్తూండడముచేతనే మన తెలుగుదేశములోని యువకులలోను, యువతులలోను చాలామంది కవులు, వ్యాసకర్తలు బయలుదేరారు. పంతులుగారు ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును ప్రచురింప ప్రారంభించి, చివరవరకూ కొనసాగించడాని కనేకములగు ఆటంకము లేర్పడినా మిగిలిన దానిని పూర్తి చేయడానికి ముందు వారికైనా మార్గదర్శకుడైనందులకు ఆయనకు ఆంధ్రులుకృతజ్ఞత చూపవలసియున్నది. పంతులుగారు ఆంధ్రగ్రంథమాలను నెలకొలిపి చాలామంది రచించిన గ్రంథముల నుచితముగా తమ ముద్రాక్షరశాలలో నచ్చొత్తించి వారి కొసగి కవులకును, గ్రంథకర్తలకును అపారమగు సాహాయ్య ప్రోత్సాహములను కలుగజేస్తూండేవారు.

### తీరని లోటు:

నాగేశ్వరు డస్తమించడంవల్ల ఆంధ్రదేశానికి తీరనిలోటు ఎప్పటి కప్పుడు కనబడుతూనే ఉంది. గభీరభావంతో కూడిన వికాసవంతమైన ముఖమండలంతో కాంగ్రెసుకమిటీమీటింగులలో పంతులుగారు ఒదిగి కూరుచుంటూ అవసరమయినప్పుడు ఎల్లా శాంతముగా సమస్యలకు సలహాల నిస్తూండిన నాటిరూపమును తలుచుకొంటూంటే మనసులో అపరిమితమగు ఆవేదన కలుగుతూంటుంది.

### గుప్తదాత:

మనం ప్రతిదినమూ చూస్తూనే యున్నాం. పత్రికలద్వారా చదువుతూనేయున్నాం— దానరూపం దాల్చిన వాగ్దానాలతో సంతృప్తిపరుప జూస్తూండే ధనవంతుల దానసౌభాగ్యాలు! మనపంతులుగా రట్టిదాత కాడు. ఆంధ్రదేశంలో ప్రాముఖ్యతవహించి, ప్రజోపయోగకరములైన ఏ సంస్థలయినా గ్రంథాలయాలు కాని, ఆశ్రమములుగాని, సారస్వతసభలుగాని, కళానిలయాలుగాని పంతులుగారి సహాయం పొందని అరుని

దుగా నుండునని నేను సగర్వంగా చాటగలను. పంతులుగారు తరుచుగా ఆంధ్రరాష్ట్రీకాంగ్రెసుసంఘసభలకు విజయవాడ విజయం చేస్తూండడమువల్ల ఆయనరాక తెలుసుకొని చుట్టుపట్ల గ్రామాలనుండి అనేకులు ఆశ్రితులు, అనాథలు చాలామంది వచ్చి పంతులుగారి భవనంలో వసారాలలో కూర్చుండి ఆయన ఆగమనానికెదురుచూస్తూండేవారు. మీటింగులు జరుగుతూండగనే 'తన వెంచేయుపథంబు కన్గొని'డన్నట్లుగా, తెరపిచేసుకొని తప్పించుకొని, పరుగుపరుగునవచ్చి తమకై వేచియున్న ఆశ్రితులకు తన జేబులోని నోట్లకట్టనుతీసి వారి వారికి చడీచప్పుడూ లేకుండా అందిస్తూ చాలా సేపువరకూ వారిని ఆపినందులకు సంజాయిషీలు, సమాధానాలు చెప్పుకుంటూ, క్షమార్పణ వేడుకుంటూ వారిని పంపివేస్తూ తిరిగి యథాస్థానానికి వచ్చి కూర్చుండడము నేనేకసారులు కండ్లారా చూచినప్పుడు మన తెలుగు దేశంలో ఇట్టి గుప్తదాత ఉద్భవమొందడం ఆంధ్రదేశముయొక్క అదృష్టవిశేషమని సగర్వంగా ఆనందిస్తూండేవాడను. గాంధిమహాత్ముడు ఆంధ్రదేశంలో పర్యటనంచేసిన ప్రదేశాలలో నెల్లా అక్కడక్కడి సంస్థలపక్షమున ఆయనకు సమర్పిస్తుండిన సన్మానపత్రాలలో నాగేశ్వరరావుపంతులు తమ తమ సంస్థలకు చేసిన ధనసహాయాలను ఉదాహరిస్తూన్నపుడు మహాత్ముడు అపరిమితానంద భరితుడై పంతులుగారికి 'విశ్వదాత'యను బిరుదప్రదానం చేశాడంటే పంతులుగారిలో ఎంతటి దాతృత్వలక్షణం కలదో నాబోటివాడు వ్రాయగలగడం అసాధ్యం. పంతులుగారు తెలుగుదేశంలో పేరుపడ్డ అన్నదాత. అతడు తనదుర్గాభవనంలో కానియ్యండి, మరియితరచోట్లకానియ్యండి సంతర్పణలు సమారాధనలు జరుపుతూండినప్పుడు అతిథులకువిస్తరాకులనిండా వివిధరకాలైనభక్ష్యభోజ్యాలతోనింపేవరకూ సంతృప్తిపడేవాడుకాడు. ఇతరులకు భోజనంపెట్టడమంటే అతనికి బహుసరదా. రాత్రి పగలు అనేకాలభేదంలేకుండా అనుక్షణమూ యెవ్వరో యొకరు ఏదో యొక సంస్థకనీ, గ్రంథప్రచురణానికనీ, విద్యార్థులు జీతములకనీ ఎడతెరపిలేకుండా వస్తూండడమువల్ల అతనికి విశ్రాంతిలేకపోవడంవల్ల ఒకొక్కప్పుడు విసుపు, కోపము వస్తూండేవి. పంతులుగారిలో కలిగిన కోపం అర్థులకు అపకారం కలగడానికి మారుగా ఉపకారముగానే పరిణమిస్తూండేవి. అందుకనే ఒక మహాకవి పంతులుగారివంటి దాతను మేఘుడితో పోల్చాడు. మేఘం భూనభోంతరాళా లదరిపడేటట్లుగా గర్జారావాలుచేస్తూ తుదకు చల్లగా వర్షిస్తున్నట్లు పంతులుగారికి ప్రథమంలో కోపంవచ్చినా తుదకు తన ప్రేమపూర్వకమైన ధనదానధారచే చల్లగా కురియించి అర్థులను సంతృప్తిపరచి పంపుతూండేవాడు. లోకంలో చాలామంది దాతలు లేకలేదు కాని, వారి దానాలు వారివారి చిత్తవృత్తులనుబట్టి ఒకొక్క ప్రత్యేకనిమిత్తమునకు మాత్రమే వినియోగింపబడడం మనం చూస్తూనే యుంటాము. పంతులుగారి దానా లట్టివి కావు. తమ్మాశ్రయించిన అర్థుల అవసరాలనుబట్టి, సంస్థల ఉపయోగాలనుబట్టి, వ్యక్తుల పాండిత్యాన్నిబట్టి సర్వతోముఖముగా జాతి మతకుల విషయభేదాలతో నిమిత్తం లేకుండా చేయబడుతూండేవే కాని పంతులుగారి ప్రత్యేక చిత్తవృత్తినిబట్టి మాత్రము కాదని మనవి చేస్తున్నాను. పంతులుగారి కొక్కటే ఆశయం, ఒక్కటే చిత్తవృత్తి. అదే నిదానమైన దానము. కనుకనే మహాత్ముడు పంతులుగారి కనుగ్రహించిన 'విశ్వదాత' యను బిరుదములో ఎంతటి మహాసుద్దేశము, మహత్తరభావము ఇమిడియున్నదో ఊహించినకొలదీ అర్థమవుతూనే యుంటుంది. ఈ సూత్రానికొక భాష్యం వ్రాయవచ్చును.

## ఆంధ్రుల ప్రేమస్వరూపుడు :

పంతులుగారు కాంగ్రెస్ పక్షాభ్యర్థిగా ఢిల్లీ ఎసంబ్లీకి నిలువబడినప్పుడు ఆయనకు ప్రత్యర్థిగా నిలవడానికి సమర్థులగు ప్రతిపక్షనాయకుల కెవ్వరికిని సాహసము కలుగకపోవడమునకు కారణం తెలుగుదేశంలోని సమస్తకులముల వారికిని, సకల పక్షములవారికిని ఆయనయందుగల భక్తివిశ్వాసములే కారణము. భేదభావమును మరచి ఆంధ్రులలో ప్రతిభగల ప్రతివ్యక్తికిని తన ఆంధ్రపత్రిక ద్వారా ప్రచారములోనికి దెచ్చి, అతని యభివృద్ధి కనేకవిధముల పాటుపడుతూండడము చేతనే తన నియోజకవర్గములోని సర్వులును ఆయనకే వోట్లనిచ్చి పంతులుగారియెడల తమకుగల ప్రేమను చూపగలిగారు. ఎసంబ్లీ యెన్నికల ప్రారంభదినాలలో నా మిత్రుడగు నొక జస్టిస్ పార్టీ ప్రముఖుని ప్రశ్నించాను— పంతులుగారి ఎన్నికవిషయంలో మీ అభిప్రాయమేమిటని. ఆయన వెంటనే సమాధాన మిచ్చాడు— మా పార్టీ భేదాలూ కులభేదాలూ ఇతరుల విషయంలోగాని పంతులుగారి విషయంలో కాదని. పంతులుగారి విషయంలో వేరువిధంగా ప్రవర్తిస్తే స్వామిద్రోహము, దేశద్రోహము చేసినవార మవుతామనీ, పంతులుగారి

విజయసాధనకు ఎన్నికలు పూర్తిఅయ్యేవరకూ విశ్రాంతి లేకుండా పనిచేస్తామనీ నాతో దృఢంగా చెప్పసాగాడు. ఈమాటలాతని నోటినుండి వస్తూంటే అతని నేత్రములనుండి విశ్వాసం ప్రతిఫలించింది. అందుచేతనే హిందూదేశ మొత్తంమీద పంతులుగారికి వచ్చినన్ని వోట్లు మరి యెవ్వరికని ఎన్నికలలో పోటీచేసి గెలుపొందినవారికి వచ్చియుండలేదు. ఈ కారణమునబట్టే పంతులుగారు ఆంధ్రులందరకును ప్రేమస్వరూపుడని మనవి చేస్తూన్నాను.

హరిజన సేవ :

పంతులుగారు ఆంధ్రదేశ హరిజనసేవాసంఘమునకు అధ్యక్షునిగానుండి దీనులూ,దరిద్రులుగానుండిన హరిజనుల నుద్ధరించుటకు అతని జీవితాంతమువరకును వారికి సేవచేస్తూండేవాడంటే అతని అంతరంగమెంతటి అనంత అగాధ ప్రేమభరితమైనదో ఊహించుట అసాధ్యం. ఈశతాబ్దిలో తన పవిత్రజీవితంతోపాటు అధునిక ఆంధ్రదేశ చరిత్రనుకూడ సృష్టి యొనరించి, ఆంధ్రుల ప్రతిభను, ఆంధ్రుల ప్రాభవమును, ఆంధ్రుల ప్రజ్ఞావిశేషాదులను ఉన్నతస్థితిలోనికి తేవలెననే ఆ వేదన, ఆతురత, ఆశ, దృఢసంకల్పము, ప్రయత్నము, పరిశ్రమను చూపిన మహావ్యక్తి పంతులుగారికిపూర్వము మరియొకడు ఉద్భవించియుండడు. దేశోద్ధారకుడే దేశోద్ధరణముకొరకు మరల నవతరించి తనజీవితాదర్శములగు స్వాతంత్ర్యము, ప్రత్యేకాంధ్రరాష్ట్రములను పొందుటకు పునఃప్రయత్నమునకు గడంగవలయునని నా ఆశ.

ధార్మికుడు :

పంతులుగారు కేవలము రాజకీయ పరిజ్ఞాత, భాషాపోషకుడు మాత్రమే కాదు. ఆయనలో ఆధ్యాత్మిక చింత ప్రబలముగ నుండెననుటకు శంకర, రామానుజ, మధ్వాచార్యు, తిలక్, గాంధీగార్లు రచించిన భాష్యములను, వ్యాఖ్యానములను పరిశీలనముగావించి తన యనుభవజ్ఞానమునుజేర్చి రచించిన శ్రీమద్భగవద్గీతా వ్యాఖ్యానమే పంతులుగారిలో గల ఆధ్యాత్మిక చింతను వేనోళ్ల చాటుతూ ఆ సద్గ్రంథము ఆంధ్రదేశములోని ప్రతియింటియందును అలంకరిస్తూంది. అందుచేతనే నాగేశ్వరుడు దాతమాత్రమే కాక ధార్మికుడు కూడానై యుండి మతప్రచారముకూడా తనశక్తికొలది చేయగలిగాడు.

పంతులుగారు బ్రతికియున్నంతకాలము ఆయన ధన ప్రాణములను సమస్తమును ఆంధ్రులనేకవిధముల, అనేకరూపములుగా వినియోగించుకుని, ఆయన లింగైక్యమును బొంది ఆరుసంవత్సరములైనా, ఇంతవరకూ పంతులుగారి శాశ్వత స్మారకచిహ్నమును నెలకొల్పకుండుట ఆంధ్రనాయకులకును, ప్రజలకును గొప్ప కళంకమని వ్రాయవలసివచ్చినందులకు చింతపడుతున్నాను. ప్రతిసంవత్సరము పంతులుగారి జయంత్యుత్సవాలను ఆంధ్రదేశమునందన్నిచోట్లను జరిపి అనాడా పవిత్రమూర్తి సేవాసౌభాగ్యమును జ్ఞాపకముతెచ్చుకుని స్మారకనిధిని వసూలుచేయు బాధ్యత ఆంధ్రులపైనున్నదని మరియొకసారి మనవి చేస్తూన్నాను.





# విమర్శనము



## Sri Ramanuja's Theory of knowledge
## ( A Study )

( శ్రీ రామానుజదర్శనమునందలి ప్రమేయవిచారము )

రచయిత : కె. సి. వరదాచారిగారు, యం. ఏ. పి. హెచ్. డి., డెమ్మీ క్రౌను ౨౩౬ పుటలు వెల రు 3 లు. దొరకుచోటు : శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్, తిరుపతి.

పాశ్చాత్యాదరణవల్లనైతేనేమి, లేక భారతీయుల ఉత్సాహంవల్లనైతేనేమి ఆంగ్లంలో మన దర్శనశాస్త్రాల్ని గురించి ప్రసంగించే గ్రంథాలు బహుళంగా ఉన్నాయి. వర్తమానశకంలో అద్వైతానికి శ్రీరాధాకృష్ణ పండితుడు, విశిష్టాద్వైతానికి శ్రీనివాసాచారిగారు, మధ్వమతానికి నగరాజశర్మగారును మూలస్తంభాలు. అంటే, ఆయా మతవాదాల్ని వీరు ప్రచారం చేసినంతగా మరెవ్వరూ చెయ్యలేదని నా భావం. మొన్నీమధ్యనే విశిష్టాద్వైతవాదానికి అత్యంతప్రమాణభూతమైన 'విశిష్టాద్వైత-వేదాంతము' అనే శ్రీనివాసాచారిగారి గ్రంథాన్ని 'అడయారు' వారు ప్రకటించి ఆంగ్లపాఠకలోకానికి మహోపకృతిని చేశారు.

అసలు వేదాంతమంటే శంకరమతమనే భావం-బహుళా పూర్వంనుండీ నేటివరకూ ఈ మతానికున్న ప్రాబల్యాన్నిబట్టే కావచ్చును— ప్రపంచంలో దృఢంగా పాతుకొనిపోయింది. పాశ్చాత్య సంస్కృత పండితులుకూడా ఈ మతాన్నే ఎక్కువగా ప్రచారం చేశారు. తక్కిన వేదాంతమతాలమీదకూడా వాఙ్మయం లేని లోటు ఇప్పుడిప్పుడు తీరిపోతోంది. ఉపనిషత్తుల్ని ఆధారపరుచుకొని నిర్మింపబడ్డ దర్శనాలన్నీ కూడా వేదాంతాలే.

వర్తమాన గ్రంథం శ్రీనివాసాచారి (పి. ఎన్.) గారి తొలిపలుకుతో ఆరంభమవుతోంది. ఈ గ్రంథం ఏడు ప్రకరణాలుగాను, నాల్గు అనుబంధములుగాను కూర్చబడింది. ఆంగ్లంలో వ్రాయబడ్డ వేదాంతగ్రంథాల ప్రణాళికను అనుసరించే ఈ గ్రంథంకూడా వ్రాయబడినది. విశిష్టములైన పాశ్చాత్య దర్శన - సిద్ధాంత వాక్యాలు రామానుజదర్శనానికి ప్రోద్బలకంగా ఉద్ఘాటింపబడ్డాయి. శ్రీరామానుజ సిద్ధాంతానికి ప్రాణప్రదమైన 'శరీర-శరీరి భావం' అనే విషయం చక్కగా ప్రతిపాదింపబడటమే కాకుండా, న్యాయమతమూ, అద్వైతమతమూ గ్రహించిన నిర్వికల్పకజ్ఞానం మొదలైన జటిల విషయాలుకూడా పర్యాలోచింపబడ్డాయి. కనుక, దర్శన శాస్త్రాధ్యయన తత్పరులైనవారందరికీ కూడా ఈగ్రంథం ఒక కానుక. ఈ గ్రంథ రచయితకూ, ప్రకాశకులకూ నా ధన్యవాదాలు. ఇల్లాంటి రచనలు తెలుగులో కూడా రావాలి.

నిర్వికల్పానందస్వామి.

---

## శబరి

భక్తి ప్రతిపాదకమైన పద్యకావ్యము. కవులు : శ్రీ శ్రీనివాససోదరులు, శతావధానులు, పవరుపేట, ఏలూరు. కృతిపతి : శ్రీ రాజా రాఘవరాజు రంగరాజు గారు, గుంటుపల్లి ముఠాతాలూకాదార్లు మరియు గవరవరం వగైరా ఎస్టేట్ల జమీందార్లు. పుటలు ౫౨. వెల ఎనిమిది అణాలు.

## Sri Madhva's Tattva-Vada
### (మధ్వతత్త్వవాదము)

రచయిత: హెచ్. ఠ. వేదవ్యాసాచార్యులు గారు. శ్రీ పరిమళ పబ్లిషింగ్ హౌసు, నంజన్‌గూడు, మైసూరువారిచే ప్రకటితము. వెల రు ౧-౦-౦

హెచ్. ఎన్. రాఘవేంద్రాచార్య లను వారు వ్రాసిన "మధ్వాచార్య స్వతంత్రవాదము" అను గ్రంథమున కిది సమాధానముగా వ్రాయబడిన విమర్శక గ్రంథము. ఆంగ్లము. త్రిమతాల సంఘర్షణలు త్రికాలాత్మకవిషయాలు. అవశ్యంభావినులు. అట్టివానిలో నిదీ వకటి క్రొత్తగా వెలువడినది. త్రిమతాలవారూ నిద్రాళువులైయుండకుండా అప్పుడప్పుడు వారిని జాగృతులనుగా చేయుట కిట్టిగ్రంథములు చాలా ముఖ్యములైనవి. మతత్రయసారముల గుర్తెరుంగదలచువారందరూ కాక మాధ్వులైనా ముఖ్యంగా పఠింపదగిన గ్రంథ మిది.

---

### వేదము వేంకటరాయశాస్త్రిలవారి జీవితచరిత్ర

రచయిత: వేదము వేంకటరాయ శాస్త్రిగారు, యం. ఏ. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండు బ్రదర్సు, ర, మల్లికేశ్వరస్వామి గుడిసందు, లింగిసెట్టివీథి, మద్రాసు. క్రౌను సైజులో ౨౧౮ పుటలు.

౧౯, ౨౦ శతాబ్దముల సంధియుగములో వెలసిన ఆంధ్రపండితులలో వేదము వేంకటరాయశాస్త్రిలవారు అగ్రగణ్యులు. గద్యపద్య నాటక విమర్శనాది విషయములలో వారు చూపిన మార్గములు పెక్కులు. వారి జీవితమంతయు సారస్వతవ్యాసంగములతోనే కడచినది. సర్వతోముఖమైన వారి పాండిత్యమును వర్ణించుట మాటలుకాదు. వారు రచించిన వ్యాఖ్యానములు, నాటకములు, విమర్శలు మొదలైన గ్రంథములే ప్రత్యక్షసాక్ష్యములై వారి విద్వద్గరిమను వేనోళ్ల చాటుచున్నవి. అటువంటి పండితప్రకాండుని జీవితచరిత్ర నండి ఆంధ్రసారస్వతలోకము పుడికిపుచ్చుకోవలసిన అంశములు అనంతములుగా నున్నవి. ప్రస్తుతగ్రంథము దానిని ఋజువుచేయుచున్నది. శాస్త్రిలవారితో అత్యంతసన్నిహిత-గాఢ-సహవాసమునకు నోచుకొన్న వారి మనుమలే కూర్చినందున ఈ జీవితచరిత్ర పరమ ప్రామాణికముగా ఒప్పియున్నది శాస్త్రిలవారి విద్యావ్యాసంగము లన్నియు ఇందులో సంగ్రహముగా, బహు పొందికగా, కాలక్రమానుసారముగా వివరింపబడినవి. రచనప్రౌఢ కథాశైలిలో నుండి సరళముగా నున్నది.

---

### తెలుగు కళావిలాసిని

మద్రాసు లయోలా కళాశాలవారి ఎనిమిదవ సంవత్సరసంచిక. యథాప్రకారమైన శ్రద్ధాసక్తులతో కూర్పబడినది. ఆకళాశాల విద్యార్థులకు ఆంధ్రవాఙ్మయమునందలి వివిధశాఖలలో గల రచనాపాటవమునకు ఇది 'ప్రదర్శనశాల'గా వెలయుచున్నది. సంపాదకులు: ఆకుండి పరబ్రహ్మశాస్త్రిగారు, ప్రధానాంధ్రోపన్యాసకులు, లయోలా కళాశాల.

---

# గ్రంథస్వీకారము

---

### నిట్టూర్పులు

చిన్న ఖండకావ్యసంపుటి. కవి: గోవిందు వేంకట నరసింహశర్మగారు, వాడాడ, శ్రీకాకుళము తాలూకా. ఫూల్సుకేపు సైజులో ౩౮ పుటలు. వెల తెలియదు.

---

### జన్మభూమి

హిందూదేశచరిత్రను పూర్వయుగము మొదలు కుంపిణీ పరిపాలనవరకు సంగ్రహముగా వివరించుచున్న పద్యకావ్యము. కృతికర్త: విశ్వనాథ నరసింహముగారు, బి. ఏ., బి. ఓ. యల్., బి. ఇడి., తెలుగు పండితులు, ప్రభుత్వకళాశాల, రాజమహేంద్రవరము. ఫూల్సుకేపు సైజులో ౪౮ పుటలు. వెల అర్ధరూపాయి.

# సాభిప్రాయ విశేషాలు

## పవిత్రస్మరణ :

నిన్న గాక మొన్న జరిగినట్లున్నది. కాని, అప్పు డే ఆరేండ్లు తిరిగిపోయినవి. కాలచక్రమునకేమి, అటి ల్లతవలె వడిపోసుకొని పోవుచుండును.

మొన్న ౫-వ తేదీ మా పంతులుగారి ఆరవ ఆరాధనోత్సవదినము. భారతిని కని, పెంచి, పెద్దచేసి, రూపురేఖలమరించి ఇంతదానిని చేసిన ఆ జనకమహా రాజు—శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి వరంతి దినము.

వారి నొక్కసారి మనసారా స్మరించి జోహారు లర్పించుట మా పవిత్రధర్మము.

నిజానికి మాకు వారిని స్మరణచేయని క్షణమే లేదు. అనుక్షణమూ మాకు వారి స్మరణే; అనుపదమూ వారి చింతనమే. కాని చైత్ర శుద్ధ ద్వాదశినాడు దానికి మరింత ఉత్తేజము. నాడు వారి దివ్యమూర్తి మా కండ్ల యెదుట సాక్షాత్కరించినట్లే యుండును.

వారు మా పాలిటికి మృతజీవులే.

అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూకూడా వారి ఆశీర్వాదబలమే మాకు అంగరక్ష.

భారతి వారి అల్లారుముద్దుబిడ్డ. భారతిసౌభా గ్యానికై వారు తపించిన తపనకు, భారతి నిర్వహణము పట్ల వారు చూపిన ఆదరాభిమానములకు అంతులేదు.

అటువంటి చల్లని తండ్రిని మరచుట మాతరమా?

ఆ లోకమునుండికూడ వారు మాపై కురిపించు చున్న ఆశీర్వాదములే మాకేడుగడయై మాకు ఆలోక మునిచ్చి దారిమాపి నడిపించుచున్నవి.

ఆ మహనీయమూర్తికి ఈపుణ్యదినసందర్భములో ఇవే మా నమోవాకములు! ఇవే మా పూజాంజలులు!

## ఆంధ్రుల చరిత్ర :

ఆంధ్రతేజము ఈనాటిది కాదు: వేదయుగము లోనే అది పొడచూపినది. ఆంధ్రపౌరుషము ఈనా టిది కాదు: పురాణకాలమునాడే అది విజృంభించినది.

వానిని అక్కడ, ఇక్కడ చిల్లగమల్లరగా కని, విని మనము మురిసిపోవుచున్నాము. కాని సమగ్రమైన ఆంధ్రజాతిచరిత్రను మనము ఇంతవరకు గ్రంథస్థము చేసుకోలేకపోయినాము. అన్యాయము!

అటువంటి చరిత్రరచనకు కావలసిన సాధన సంపత్తికి కొదువలేదు; వస్తువిశేషములకు లోటులేదు. కాని పూనికయే ఇంతవరకు మృగ్యమైనది. ఒకటి రెండు గ్రంథము లున్నను అవి సమగ్రముగా, పరినిష్ఠి తముగా లేవు.

తోడిజాతులవారు ఈ విషయములో ఎంతో మేలు. అచంచలమైన అభిమానముతో ఉరకలు వేయుచు తమ చరిత్రలను నిర్మించుకొని ప్రపంచమునకు చాటు చున్నారు.

పోయినది పోనిండు. ఇప్పుడైనను ఈ చరిత్ర రచనావసరమును పెద్దలు కొందరు గుర్తించి, దానికై పూనికపట్టుట సంతోషకరము. ఆంధ్రచరిత్రరచనలో ఆత్యాసక్తిగలిగి, కృషిచేయగలిగిన డా. మారేమండ రామారావుగారు దీనికి నడుముకట్టి ముందుపడి, హేమాహేమీలనందరిని కూడగట్టుకొని పనిచేయు చున్నారని వినుటకు సంతోషమువుచున్నది. ఈమధ్య గుంటూరులో శ్రీ కే. ఎ. నీలకంఠశాస్త్రిగారి అధ్య క్షతక్రింద జరిగిన ప్రథమాంధ్రచారిత్రకమహాసభ దానికి అంకురార్పణచేసినది. శుభమస్తు.

ఆ పట్టినపట్టు విడువకుండ రామారావుగారు త్వరలోనే సమగ్రమైన, నిర్దుష్టమైన ఆంధ్రచరిత్ర నిర్మింపజేసి, ఆంధ్రజాతి ఖ్యాతికి అజరామరమైన రూపమిచ్చి, ఆంధ్రతేజమును నిలబెట్టి దివ్యదీప్తులతో వెలిగింపగలరని నమ్ముచున్నాము.

ఆ సుముహూర్తము ఆంధ్రుల కొక పండుగ దినము తప్పక కాగలదు. దానికై ఎదురుతెన్నులు చూచుచు మే మానందించుచున్నాము.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

